# అపరాధ పరిశోధన

రూ. 3 ఫిబ్రవరి '75

## సప్లిమెంట్



అపరాధ పరిశోధన అనుబంధం—14

# నాలుగు నవలలు

(మీ కోసం "అపరాధ పరిశోధన" అందజేస్తున్న
మీరు మెచ్చే క్రైమ్ నవలలు)

## బొందిలో ప్రాణం!

రచన: రమణశ్రీ

## చట్టంతో చెలగాటం

రచన: సుజనశ్రీ

## మాయమైన మాధవి

రచన: ఏ. వీ. మోహన్రావ్

## అంతఃపుర రహస్యం!!

రచన: కంచర్ల రమణ

"ఖైదీ" సీరియల్ - 9 వ భాగము

**అపరాధ పరిశోధన సప్లిమెంట్—14**
ఫిబ్రవరి, 1975
వెల: రు. 3-00
ఏడాది చందా 39 రూపాయలు
30-3-'75 లోగా పంపితే 30 రూపాయలు
ఉచిత చందా డిపాజిట్టు 250 రూపాయలు

మేనేజింగ్ ఎడిటర్:
**శ్యామ దామోదర్ రెడ్డి**

సంపాదక వర్గం:
**టెంపోరావ్**
**శ్యాంబాబు**
**రమణశ్రీ**
**ఏ. వీ. మోహన్రావ్**
**సుజనశ్రీ**
**వసుంధర**
**కంచర్ల రమణ**

కార్యాలయం:
**అపరాధ పరిశోధన కార్యాలయం**
నారాయణగూడ, హైదరాబాద్-29
ఫోన్—36959

ముద్రణ:
**క్రాంతి ప్రెస్**
12, ఫ్రాన్సిస్ జోసెఫ్ స్ట్రీట్
మద్రాసు—1

# బొందిలో ప్రాణం?

రమణశ్రీ

**మా**ధవ్ మాన్షన్ రంగురంగుల ఫేజింగ్ లైట్లతో శోభాయమానంగా అలంకరించబడి వుంది.

మైక్ లనుండి ఘంటసాల గీతామృతధారలు ఆహ్వానితుల కర్ణపుటాలలో ప్రవహిస్తూంటే వారి హృదయాలు ఆనందంతో పులకించిపోతున్నాయి—ఆ అమరగాయకుని ప్రతిభకు జోహార్లు అర్పిస్తూ.

ఆ రోజు ప్రఖ్యాత క్యారెక్టర్ యాక్టర్ మాధవరావు జన్మదినోత్సవం!

అంతేగాక ఆయన శత చిత్రాలను పూర్తిచేసిన సందర్భంలో అభిమానులు జరిపే సన్మాన సత్కార కార్యక్రమాలు భారీగా సాగుతున్నాయి.

సహ నటీనటులు, చిత్ర నిర్మాతలు, దర్శకులు, వివిధ టెక్నిషియన్స్, అభిమాన సంఘాల నాయకులు, ఇంకా వందలాది అభిమానులు ఆ విశాలమైన హాలులో వివిధ ఆసనాలలో ఆశీనులై వున్నారు.

ఆహ్వానితుల సత్కార కార్యక్రమములో హడావుడిగా తిరుగుతున్నారు మాధవరావు ఏకైక కుమార్తె శోభా రాణి, తమ్ముడు కళ్యాణరావు, బావమరిది పీతాంబరం.

మాధవరావు పర్సనల్ బోయ్ ఆర్ముగం ఆ రోజు హడావుడి అంతా తనదేనన్నట్లుగా తిరుగుతున్నాడు.

మాధవరావు మాత్రం ఫుల్‌సూట్‌లో చిరునవ్వు నవ్వుతూ అతిథుల అభినందనల్ని అందుకుంటూ హృదయ పూర్వక కృతజ్ఞతలను తెలియచేస్తున్నాడు.

అతి చక్కని గులాబి పుష్పగుచ్ఛాన్ని తీసుకొని గబగబ లోపలకు ప్రవేశించాడు ప్రఖ్యాత హీరో రమానంద్.

లోపల కూర్చొనివున్న చిత్ర పరిశ్రమ పెద్దలంతా రమానంద్‌ను చూసి విష్ చేశారు.

అందరికీ చిరునవ్వుతో చేయెత్తి విష్ చేస్తూ మాధవరావు దగ్గరకు వెళ్ళి పాదాభివందనం చేశాడు.

"ఛ! రమానంద్, ఏమిటది? లే బాబూ!" చటుక్కున ముందుకువంగి రమానంద్ భుజాలను పట్టుకొని పైకి ఎత్తుతూ అన్నాడు మాధవరావు.

పుష్పగుచ్ఛాన్ని మాధవరావుకు అందిస్తూ అన్నాడు "రావ్‌జీ, మీ దయార్ద్రహృదయమే నన్నీస్థితికి తీసుకు వచ్చింది. మీ జన్మదినోత్సవ శుభసందర్భంలో నేను ఏమి సమర్పిస్తే మీ ఋణం తీర్చుకోగలను?" ఆనందంతో గొంతు పొరబోయింది రమానంద్‌కు.

మాధవరావు కళ్ళు చెమ్మగిల్లాయి. రమానంద్‌ను గాఢంగా హృదయానికి హత్తుకున్నాడు.

"రమానంద్, నువు ఉన్నత శిఖరాలను అందుకోవడమే నేను కోరుకునేది. అంతకన్నా నేనేమీ ఆశించను బాబూ!"

మరో వర్ధమాన నిర్మాత మొదలియార్ ఓ పెద్ద పాకెట్‌ను తీసుకొని మాధవరావు దగ్గరకు వచ్చాడు.

"మళ్ళీ కలుస్తాను రావ్ జీ!" అంటూ ముందుకు కదిలాడు రమానంద్.

అతని కళ్ళు పరిసరాలను ఆత్రంగా వెదికాయి.

దూరంగా నటీమణులతో ముచ్చటిస్తున్న శోభారాణి రమానంద్‌ను చూసి గబగబ పరిగెత్తుకుంటూ వచ్చింది.

"హల్లో ఆనంద్, ఎంత సేపయింది వచ్చి?"

"ఇప్పుడే శోభా! మీ నాన్నగారికి కనిపించి ఇక యీ రాణీగారికోసం అన్వేషిస్తున్నాను" చిలిపిగా నవ్వాడు.

"పో, ఆనంద్! నువ్వు ఎప్పుడూ ఇంతే! నీకోసం ఎంతగా ఎదురుచూస్తున్నానో తెలుసా? సరిగ్గా అయిదు గంటలకొస్తానని చెప్పి ఏడుగంటలకా రావడం?" చిరు కోపంగా అంది.

"స్వీట్ శోభా! ఏంచేయను చెప్పు? 'మా రాణీగారు కేకలేస్తారు. అయిదుగంటల తరువాత ఒక నిమిషంకూడా పనిచేయనని' మరీమరీ చెప్పి ఆ మురుగన్‌కి కాల్‌షీట్ ఇచ్చాను. తీరా యీ రోజు హీరోయిన్ షాట్స్ ఓ. కె. అవక ఆలస్యమైపోయింది. అన్నమాట ప్రకారం అయిదు గంటలకే వచ్చేస్తే ఆ నిర్మాతకు యాభైవేలు నష్టం!"

"అయితే నాకన్నా నీ నిర్మాత యాభైవేలు నీకు 'ముద్దు' అన్నమాట!"

"డియర్. యాభైవేలుకాదు యాభై లక్షలయినా నీ 'ముద్దు'కు సాటిరావు. అయినా నాకు తెలుసు నా రాణీ

అర్థం చేసుకుంటుందని. ప్లీజ్ క్షమించు!'' సున్నితంగా తలవంచుతూ అన్నాడు రమానంద్.

''యూనాటీ! నన్నెలా లొంగతీసుకోవాలో నీకు బాగా తెలుసు'' కిలకిలా నవ్వింది శోభ.

''శోభా! శోభా! నువ్వెక్కడున్నావా? ఏంచేస్తున్నావ్?'' హడావుడిగా వచ్చాడు పీతాంబరం.

''అబ్బ! ఎందుకలా అరుస్తావ్, కొంపలంటుకు పోతున్నట్లు? ఆనంద్ వస్తే మాట్లాడుతున్నాను, కనబడటం లేదూ?'' విసుగ్గా అంది శోభారాణి.

''తీరికగా మాట్లాడుకోవడానికి ఇదేమన్నా బీచ్ అనుకున్నావా? అవతలవచ్చే అతిధుల్ని రిసీవ్ చేసుకోవద్దూ!'' రమానంద్ వైపు కోపంగా చూస్తూ అన్నాడు పీతాంబరం.

''మైడియర్ పీతాంబరం మామయ్యా, నాకు తెలుసు ఎవర్ని ఎక్కడ రిసీవ్ చేసుకొని మాట్లాడాలో! నాకు తలనొప్పి కల్గించక నీ పనులు నువు చూసుకో!'' రమానంద్ వైపు తిరుగుతూ అంది.

''శోభా! పరాయి మగవాళ్ళముందు కాబోయే భర్తతో ఇలా మాట్లాడటం మంచిదికాదు! బుద్ధిగా ప్రవర్తించు!'' గట్టిగా అన్నాడు పీతాంబరం.

ఆశ్చర్యంగా చూసింది శోభారాణి.

''మామయ్యా, నీకు అప్పుడే చత్వారం వచ్చేసిందా? ఇక్కడ పరాయి మగవాళ్లెవరూ లేరే!'' అంది గలగల నవ్వుతూ.

''ఆల్‌రైట్, నీతో మాట్లాడటం నాదే పొరపాటు'' కందిపోయిన మొఖంతో రమానంద్‌ను చూస్తూ గబగబ ముందుకు నడిచాడు పీతాంబరం.

''ఎక్స్‌క్యూజ్ మి ఆనంద్! మామయ్యావలన నీ మనసుకు కష్టం కలిగితే క్షమించు'' చేతులు పట్టుకుంటూ అంది శోభ.

"నాకు తెలియదా శోభా?" ఆ చేతిని చిన్నగా ముద్దు పెట్టుకుంటూ అన్నాడు రమానంద్.

గోల్డ్ స్పాట్, కోకో ఇంకా వివిధ రకాలైన హాట్ డ్రింక్స్ చకచక సర్వ్ అవుతున్నాయి అతిథులకు.

చక్కని పాశ్చాత్య సంగీతం చక్కగా విన్పిస్తోంది. అందరి టేబుల్స్ మీద వింత తినుబండారాలు డిమ్ లైట్ల కాంతిలో మరింత వింతగా కన్పిస్తున్నాయి.

"జస్ట్ వెయిట్ ఆనంద్, డ్రింక్ తీసుకొస్తాను" అతని చేతిలోనుండి తన చేతిని సున్నితంగా విడిపించుకొని ముందుకు నడిచింది శోభ.

మరో రెండు నిమిషాలలో డ్రింక్స్, కేక్స్ తీసుకు వచ్చింది శోభ.

"ఏమిటి శోభా, మీ మామయ్య యింకా మారలేదను కుంటా!" కేక్ తీసి అందిస్తూ అడిగాడు రమానంద్.

"లేదు ఆనంద్, అమావాశ్య, పౌర్ణమికి తిక్క రేగు తుంటుంది. అయినా యీ సమయంలో అతని సంగతి మనకెందుకు డియర్" చిన్నగా నవ్వింది శోభ.

ఆ నవ్వుతో శృతి గలిపాడు రమానంద్.

రాత్రి పది గంటలకు గ్రాండ్ డిన్నర్‌తో పార్టీ విజయవంతంగా ముగిసింది.

ఆహ్వానితులంతా శెలవు తీసుకొని వెళ్ళిపోయారు.

రమానంద్ కూడా అందరి దగ్గర శెలవు తీసుకుని శోభకు ప్రత్యేకంగా 'గుడ్ బై' చెప్పి వెళ్ళిపోయాడు.

## 2

"శోభా!" గట్టిగా పిలిచాడు పీతాంబరం.

"ఏమిటి?" విసురుగా అరిచింది శోభ.

"ఎక్కడికి వెళుతున్నావ్?"

"అది నీకనవసరం."

"లేదు. అవసరం!"

"ఎందుకు?"

"ఈ యింటిలో ఒక బాధ్యతగల వ్యక్తిగా నీ యోగ క్షేమాలు విచారించే వ్యక్తిగా అడుగుతున్నాను."

"బాధ్యత!" పెద్దగా నవ్వుతూ హేళనగా అంది. "బాధ్యత గల వ్యక్తివయితే ఇరవైనాలుగు గంటలూ ఆ క్లబ్బులో తాగి తందనాలాడుతూ కూర్చోవు!"

"శోభా!" కోపంగా అన్నాడు పీతాంబరం. "ఈ రోజులలో త్రాగడం గొప్ప డిగ్నిటీ! నువ్వూ, మీ నాన్న, నేనూ, యీ లోకంలో అంతా తాగేవాళ్ళే! కావాలంటే అందర్నీ పరిశీలించు. అది కేవలం హాబీ మాత్రమే!"

"అవునవును. క్లబ్ డ్యాన్సర్ రీటాతో రాత్రింపగళ్ళు గుడ్డలు లేకుండా దొర్లడం కూడా హాబీయే కదూ!" కోపంగా అంది.

"శోభా, హద్దు మీరుతున్నావ్. నా ఆంతరంగిక విషయాలలో నీకు జోక్యం అనవసరం!" సిగరెట్ అంటిస్తూ అన్నాడు పీతాంబరం.

"గుడ్ సైదట్! ఆ జ్ఞానం నీకు లేనందుకు విచారిస్తున్నాను. కాబట్టి ఇకనుండీ నీవు కూడా దయచేసి నా ఆంతరంగిక విషయాలలో జోక్యం కల్గించుకోకు" విసురుగా పల్కి ముందుకు నడవబోయింది శోభ.

"ఆగు. ఆ రమానంద్‌తో మాట్లాడటానికేనా వెళ్ళేది?" గర్జించాడు.

"కాదు. ఈ పీత మొహం పీతాంబరంతో కులకడానికి వెళుతున్నాను" ఫక్కున నవ్వుతూ అంది శోభ.

"శోభా, చివరిసారిగా చెబుతున్నాను-కాదు, నీ కాబోయే భర్తగా ఆజ్ఞాపిస్తున్నాను. ఆ రమానంద్‌తో

తిరగడం తగ్గించుకో'' అనునయంగా అన్నాడు పీతాంబరం.

''సారీ మామయ్యా! నేను ఆనంద్‌ను పెళ్ళి చేసుకోవాలని నిశ్చయించుకున్నాను. దయచేసి నువ్వు ఇక యీ విషయంలో జోక్యం చేసుకోకు'' నిష్కర్షగా చెప్పింది శోభ.

''వాట్?'' అదిరిపడ్డాడు పీతాంబరం.

''శోభా! నువ్వు బాగా ఆలోచించే యీ మాట అంటున్నావా?''

''పూర్తిగా ఆలోచించుకొనే మాట్లాడుతున్నాను.''

''రమానంద్ ఉత్త దుర్మార్గుడు. వాడు ఎందర్ని వంచించి ఫీల్డ్‌లో పైకి వచ్చాడో తెలుసా?''

''నాకన్నీ తెలుసు మామయ్యా! ఏది ఏమయినా నీ వంటి త్రాగుబోతు, స్త్రీ లోలుడుకన్నా ఆనంద్ వెయ్యిరెట్లు మెరుగు.''

''శోభా!'' అసహనంగా అరిచాడు పీతాంబరం.

''మీ అమ్మ చచ్చిపోయే ముందు చెప్పిన మాటలు ఒక్కసారి గుర్తుకు తెచ్చుకో శోభా! ఈరోజు నాకన్నా కొంచెం అందగాడు దొరికాడని నన్ను అలక్ష్యం చేసి వాడిని పెళ్ళి చేసుకుంటే మీ అమ్మ ఆత్మ సహించదు'' హెచ్చరించాడు.

''సారీ మామయ్యా, నా నిర్ణయానికి తిరుగు వుండదు. దయచేసి నామీద ఆశ వదులుకో.''

''ఆశ పడటమే గానీ, ఆశ వదులుకోవడమన్నది యీ పీతాంబరం జీవితంలో లేదు!'' కర్కశంగా నవ్వాడు.

''సరే, నీ ఇష్టం. ఆశ పడుతూనే వుండు. కాని మా విషయంలో జోక్యం చేసుకున్నావంటే మర్యాద దక్కదు.''

"ఏం చేస్తావేమిటి?" కోపంగా అడిగాడు.

"నీకు యీ ఇంటిలో స్థానం లేకుండా చేస్తాను. జాగ్రత్త! మర్యాదగా వున్నంతకాలమే మంచి రోజులు. ప్లీజ్ మైండ్ యిట్!"

"ఆల్ రైట్! వ్యవహారం ఇంతవరకు వచ్చిందన్న మాట! సరే చూస్తాను," అంటూ కోపంగా ముందుకు నడిచాడు పీతాంబరం.

## 3

పీతాంబరం మాధవరావుకు స్వయాన బావమరిది అవుతాడు. మాధవరావు భార్య, శోభకు పదేళ్ళ వయస్సు వచ్చేటప్పటికే చచ్చిపోయింది. లలిత మాధవరావు జీవితంలో ప్రవేశించిన తరువాతనే, మాధవరావుకు పరిశ్రమలో గిరాకి పెరిగింది.

స్వంత వూరులో జులాయిగా తిరుగుతున్న తమ్ముడు పీతాంబరాన్ని ఒక కొలిక్కి తీసుకురావాలనే దృక్పథంతోనే తనదగ్గరకు రప్పించుకొని భర్త చేతిక్రింద వుంచింది లలిత.

లలితకు తమ్ముడన్నా, కూతురు శోభ అన్నా తగని ప్రేమ. వాళ్ళిద్దరూ పెళ్ళి చేసుకొని చిలకా గోరింకల్లా తన కళ్ళముందే తిరుగుతుండాలన్నది ఆమె కోరిక. ఐతే ఆమె తన కోరిక తీరకుండానే యీ లోకం విడిచి వెళ్ళిపోయింది.

పరిశ్రమలో తరచు అనేకమంది కలుషిత వ్యక్తులు తారసపడుతూనే వున్నా, మాధవరావు మాత్రం చాలావరకు తన జీవితాన్ని నిర్మలంగానే గడిపేవాడు. చెడు అలవాట్లు గానీ, దుష్ట తలపులు గానీ లేని మాధవరావు అంటే పరిశ్రమలో అంతా ప్రాణం ఇస్తారు.

బయట కులాసాగా తిరిగే మాధవరావుకు ఇంట్లో

మాత్రం మనశ్శాంతి కరువై పోతోంది.

భార్యకిచ్చిన మాటను నెరవేరుద్దామంటే, శోభ పీతాంబరాన్ని పెళ్ళి చేసుకోవడానికి ఇష్టపడటం లేదు. అందుకు శోభ చెప్పే కారణాలు కూడా సమంజసంగానే వుంటున్నాయి. అప్పటికీ పీతాంబరాన్ని దుర్వ్యసనాల నుండి దూరం చేయడానికి సదా ప్రయత్నిస్తూనే వుంటాడు. కానీ అక్క ఇచ్చిన చనువుతో అదుపు తప్పిన గుర్రంలా తయారయ్యాడు పీతాంబరం.

ఒక్క పీతాంబరం ప్రవర్తనకే మాధవరావు మనస్సు ఇంత అశాంతికి గురి కావడం లేదు.

ఆయన మనస్సుకు తమ్ముడు కళ్యాణరావు కూడా అశాంతినే కల్గిస్తున్నాడు.

పదేళ్ళక్రితం అన్నీ వదులుకొని దేశాలు పట్టిపోయిన తమ్ముడు కళ్యాణరావు తిరిగివస్తే, ఆప్యాయంతో ఆదరించి దగ్గరకు తీసుకున్నాడు.

అయితే చివరకు ఆయన ఆప్యాయతే ఆయనకు శత్రువయింది.

ఏకులావచ్చిన కళ్యాణరావు, మాధవరావు అలసత్వంతో మేకు అయి కూర్చున్నాడు.

సదా పేకాటలో మునిగిపోయి డబ్బును నీళ్ళలా ఖర్చు బెడుతున్న కళ్యాణరావును చూసి మాధవరావు 'ఒరేయ్, డబ్బులను ఎందుకురా అలా తగలెడుతావ్?' అంటే 'నా అన్న డబ్బులను ఆ మాత్రం నేను ఖర్చు చేయగూడదా?' అంటాడు.

మాధవరావు కొంచం గట్టిగా మాట్లాడితే 'నీ తమ్ముడ్ని కదా, వాటా పంచి బెట్టి ఇచ్చేయ్!' అంటాడు.

ఇటు తమ్ముడు, అటు బావమరిది ప్రవర్తనతో లక్షలు సంపాదిస్తున్నా మాధవరావు మనసులో అశాంతి గూడు

కట్టుకొనే వుంటోంది.

ఈ బాధలన్నింటినీ మర్చిపోవడానికే ఆయన యీ వయసులో గూడా ఒక్క నిమిషం సమయాన్ని గూడా వృధా చేయకుండా షూటింగ్ లలో పాల్గొంటూ వుంటాడు.

## 4

ఉదయం ఎనిమిది గంటలయింది.

మాధవరావు తన పర్సనల్ రూంలో కూర్చొని డైరీ వ్రాసుకుంటున్నాడు.

ఆర్ముగం ఆ గదిలో పుస్తకాలన్నింటినీ దులిపి సర్దుతున్నాడు.

ఆ ఇంటిలో మాధవరావుకు పూర్తి ప్రశాంతతను చేకూర్చేది ఆర్ముగం ఒక్కడే!

మాధవరావుకు ఏ సమయంలో ఏదికావాలో ఆర్ముగానికి బాగా తెలుసు. ఏ నిర్మాతకు ఏ రోజున కాల్ షీట్ ఇచ్చినదీ, ఏ కాల్ షీట్ కు ఏ సమయంలో హాజరు కావలసిందీ ఆర్ముగానికి కంఠతాపాఠంగా తెలుసు. ఒక్కమాటలో చెప్పాలంటే మాధవరావుకు రెండో డైరీ ఆర్ముగం!

"ఆర్ముగం, పి. అండ్ జె. పిక్చర్స్ వారికి ఏ రోజున కాల్ షీట్ ఇచ్చాం?" అడిగాడు తల ఎత్తి మాధవరావు.

ఓ క్షణం ఆలోచించి, "యీ నెల ఇరవై ఆరవ తారీకున సార్" ఠక్కున చెప్పేశాడు.

"కరెక్టు... కరెక్టు..." చిన్నగా తలవూపి డైరీలో వ్రాసుకోసాగాడు మాధవరావు.

అక్కడ అలుముకున్న ప్రశాంతతను ఛేదిస్తూ 'కాల్ బెల్' గణగణ మ్రోగింది.

"ఎస్ కమిన్!" అన్నాడు మాధవరావు, డైరీ డ్రాయర్ సొరుగులో పడేసి.

మరుక్షణంలో తలుపు తెరచుకొని పీతాంబరం లోపలకు

వచ్చాడు.

అర్ముగం కుర్చీ సరిచేసి "కూర్చోండి సార్!" అన్నాడు.

కుర్చీలో కూర్చుంటూ మాధవరావువైపు చూశాడు పీతాంబరం.

"ఏమిటి పీతాంబరం, పనిమీద వచ్చావు?" అడిగాడు మాధవరావు.

"బావా, యీమధ్య శోభ ప్రవర్తన ఏమీ బాగుండటం లేదు. మీరేమైనా గమనించారా?" అడిగాడు.

చిన్నగా నవ్వాడు మాధవరావు.

"ఇప్పుడేం జరిగింది పీతాంబరం?"

"నేనేం చెప్పను? కన్నకూతురు కాలుజారకముందే జాగ్రత్తపడాలి మీరు."

"పీతాంబరం! శోభ అలాంటి పిల్లకాదోయ్! అయినా ఇప్పుడు అంతమాట వాడవలసిన అవసరం ఏమొచ్చింది?"

"ఆ రమానంద్ లేడూ? వాడితో శోభ ఒకటే తిరుగుడు తిరుగుతోంది. బీచ్‌లో, పార్కులో, సినిమా హాల్స్‌లో ఎక్కడచూసినా వాళ్ళే కనబడుతున్నారు. శోభ ఇలా తిరగడం సహించరాని విషయం!" కోపంగా అన్నాడు.

"ఓ, అదా!" చిన్నగా నవ్వాడు మాధవరావు.

"చూడు పీతాంబరం! శోభ నాకు అంతా చెప్పింది. తను రమానంద్‌ను మనస్ఫూర్తిగా ప్రేమిస్తున్నదట! నేను రమానంద్‌ను పిలిచి అడిగాను. అతనుగూడా శోభను మనసారా ప్రేమిస్తున్నట్లు చెప్పాడు. నీకు తెలుసుకదా, రమానంద్ చాలా మంచివాడు. అంతేగాక ఫీల్డ్‌లో మంచి ఫ్యూచర్ గలవాడు. అందుకే నేనేమీ అభ్యంతరం పెట్టలేకపోయాను."

మాధవరావు మాటలకు అదిరిపడ్డాడు పీతాంబరం.

అతనిలో కోపం సెగలు కక్కింది.

"బావా!" విసురుగా అరిచాడు.

ఏమిటన్నట్లు చూశాడు మాధవరావు.

"అక్కయ్య మరణించేముందు, ఏమన్నదో గుర్తున్నదా?"

"ఆఁ. గుర్తున్నది!"

"ఏమిటి, మీకు గుర్తున్న విషయం?" విసురుగా అడిగాడు పీతాంబరం.

"శోభను నీకిచ్చి పెళ్ళి చేయమన్నది" నవ్వుతూ అన్నాడు మాధవరావు.

"మరి మీరు చేస్తున్నదేమిటి? వయసులోవున్న అమ్మాయికి బుద్ధిలేకపోతే, మీకయినా జ్ఞాపకం వుండొద్దూ?" గర్జించాడు.

"పీతాంబరం, మీ అక్కయ్య మరణించేటప్పటికి నీకు పదహారేళ్ళు మాత్రమే! ఇప్పుడు పాతికేళ్ళు వచ్చాయి. అలాగే నీకు అప్పుడులేని వ్యసనాలు ఇప్పుడు చాలా వచ్చాయి. నిన్ను ఒక త్రాగుబోతుగా మీ అక్కయ్య ఆ రోజే వూహించి వుంటే శోభను నీకిచ్చి పెళ్ళి చేయవద్దని మాట తీసుకొని వుండేది."

"అయితే... అయితే... ఇప్పుడు మీరేమంటారు?" గొంతు వణికింది కోపంతో.

"ఏమీ అనడంలేదు. ఈ విషయంలో శోభకు పూర్తి స్వాతంత్ర్యాన్ని ఇచ్చాను. శోభ ఇష్టానికి విరుద్ధంగా ప్రవర్తించలేను."

"అయితే శోభను నాకిచ్చి పెళ్ళి చేయరన్న మాట!" అసహనంగా అడిగాడు పీతాంబరం.

"లేదు. అంతేకాదు, యీ విషయంలో శోభ ఇష్టమే నా ఇష్టం కూడా!" స్పష్టంగా చెప్పాడు మాధవరావు.

"అన్యాయం! మీరు ఇలా చేస్తారని నేను అనుకోలేదు. శోభను నేను పెళ్ళి చేసుకోకపోతే మా అక్కయ్య ఆత్మ శాంతించదు. అక్కయ్య ఆత్మ క్షోభిల్లడం నేను సహించలేను."

"చచ్చిపోయిన వారి ఆత్మలకోసం బ్రతికివున్న వారి మనసులను క్షోభపెట్టలేము. శోభను నీకు ఇచ్చి పెళ్ళి చేయడం కలలోగూడా జరగని పని. ఇక ఆ ప్రసక్తి నా దగ్గర తీసుకురావద్దు. నీకు ఇష్టమైతే మరో అమ్మాయిని చూస్తా. హాయిగా పెళ్ళిచేసుకో. లేదా ఆ క్లబ్‌లోని రీటానే వుంచుకో. నీ పేరన మీ అక్క వుండగానే లక్ష రూపాయలు బాంక్‌లో వేశాను కదా! ఇక ఆ లక్ష రూపాయలు నీవే! వాటిని పొదుపుగా వాడుకుంటావో, నీళ్ళలా ఖర్చుపెట్టుకుంటావో నీ ఇష్టం!" గంభీరంగా చెప్పాడు మాధవరావు.

కోపంతో కంపించిపోయాడు పీతాంబరం.

"హుం. లక్ష రూపాయలు! ముష్టి లక్ష రూపాయలు ఎన్నాళ్ళు వస్తాయి, ఎందుకు పనికి వస్తాయి? అయినా ఇంటిలో చెట్టంత బావమరిదిని పెట్టుకొని, పరాయి మగ వాడికి లక్షల కట్నంతో మీ కూతుర్ని ఎలా ఇస్తారో నేనూ చూస్తా! ఎన్ని అవాంతరాలు వచ్చినా, ఎంత సాహసం చేసి అయినా సరే, శోభను నేను పెళ్ళి చేసుకొని తీరతాను. మా అక్క ఆత్మకు శాంతి కలిగించి తీరతాను" ఉద్రేకంగా పల్కాడు.

మాధవరావు కూడా ఉగ్రరూపం దాల్చాడు.

"ఒరేయ్ పీతాంబరం! నా మాటంటే మాటే! నా బొందిలో ప్రాణముండగా శోభను నువ్వు పెళ్ళి చేసుకోలేవు. గుర్తుంచుకో. మళ్ళీ నీ ముఖం నాకు చూపించకు. గెటవుట్!" గర్జించాడు.

"ఆల్ రైట్! ఆ బొందిలో ప్రాణం ఎంత కాలం వుంటుందో నేనూ చూస్తాను!" నిర్లక్ష్యంగా అంటూ బయటకు వెళ్ళిపోయాడు పీతాంబరం.

"ప్చ్! మొండి వెధవ!" కుర్చీలో నీరసంగా జారగిల పడ్డాడు మాధవరావు.

"సార్, కాఫీ తీసుకోండి" ఆర్ముగం కప్పు అదించాడు వినయంగా.

"గుడ్" తృప్తిగా ఆర్ముగం వైపు చూస్తూ కప్పు అందుకున్నాడు మాధవరావు.

# 5

"ఆర్ముగం, ఈ రోజు ప్రోగ్రాం ఏమిటి?" సిగరెట్ వెలిగించుకుంటూ అడిగాడు మాధవరావు.

"నవతా ఆర్ట్స్ వారికి యీ రెండు రోజులూ కాల్ షీట్స్ ఇచ్చాం సార్. చిత్రీకరణ మొదలయార్ స్టుడియో రెండవ ఫ్లోర్‌లో జరుగుతుంది. మనం మరో అరగంటలో అక్కడ వుండాలి" చెప్పాడు ఆర్ముగం.

"ఆల్ రైట్, ఆ స్క్రిప్టు ఒకసారి ఇచ్చి నువ్వు కారు బయటకు తీసుకురా!" కోటు అందుకుంటూ అన్నాడు మాధవరావు.

"అలాగే సార్!" అంటూ స్క్రిప్టు అందించి బయటకు నడిచాడు ఆర్ముగం.

మరో అయిదు నిమిషాలలో కారు హారన్ విన్పించగానే, గబగబ ముందుకు నడిచాడు మాధవరావు.

డోర్ తెరచుకొని కారులోకి ఎక్కబోతూండగా ఎక్కడినుండో పరుగు పరుగున వచ్చాడు కళ్యాణరావు.

"అన్నయ్యా, అర్జంటుగా ఓ అయిదువేలు కావాలి!" అడిగాడు గోముగా.

కోపంగా చూసాడు మాధవరావు.

"అయిదువేలా? డబ్బంటే మన తోటలో పెరిగే గడ్డి అనుకున్నావా? ఎప్పటికప్పుడు కోస్తుంటే మళ్ళీ పెరగ డానికి?"

"ఛ! అంత నీచంగా నేను ఎప్పుడూ భావించను అన్నయ్యా! మన ఇంట్లో డబ్బు గడ్డి కాదు, కల్పవృక్షం! ఎంత తీసుకున్నా అది తరగదు. నాకు బాగా తెలుసు ఆ విషయం."

"ఒరేయ్, నీ దేశాటనంలో అన్ని వ్యసనాలతో బాటు, మాటలు కూడా నేర్చావు. ఎందుకురా దండగ! మనిషి అన్న వాడికి ఒకసారి చెబితే జ్ఞానం వుండాలి."

" 'మని-షీ' వున్నంతకాలం నేను మనిషిని కాదు అన్నయ్యా! నువ్వు ఎన్నయినా తిట్టు. నాకేం ఫర్వాలేదు. కానీ తిట్టిన వెంటనే అయిదువేలకు చెక్ ఇచ్చేయ్! మళ్ళీ మాట్లాడను."

"అయిదువేలకు కాదుగదా, అయిదు రూపాయలకు గూడా చెక్ ఇవ్వను. అయినా మొన్ననేగా అయిదు వేలు తీసుకున్నావ్?" నిరసనగా చూస్తూ అన్నాడు మాధవరావు.

"డియర్ బ్రదర్, అధిక ధరలతో అలమటించి పోతున్న యీ రోజులలో అయిదువేలు ఎన్నాళ్ళు వస్తాయి, ఏం సరిపోతాయి? నువ్వే చెప్పు?"

"నీకెలా సరిపోతాయిరా! అయిదువేలు కాదు, యాభై వేలు అయినా పేకాటలో అయిదు నిమిషాలు కూడా రావు."

"సారీ బ్రదర్, పేకాట మానేశాను గదా! మంచి బిజినెస్ స్టార్ట్ చేద్దామని చూస్తున్నాను. ఈ ఒక్క

సారికి అయిదువేలు ఇవ్వు. మళ్ళీ నెల రోజుల వరకు అడగను."

"నో. నువ్వు ప్రతిసారీ పాడే పాటే యీ రోజూ పాడుతున్నావ్. నువ్వు అరిచి గగ్గోలు పెట్టినా డబ్బులు ఇవ్వను" లోపల కూర్చుంటూ అన్నాడు మాధవరావు.

"ఆల్ రైట్, నాకు రావలసిన డబ్బుల కోసం నిన్ను బ్రతిమాలడం దేనికి? నా ఆస్తి నాకు పంచిపెట్టి ఇవ్వు. మళ్ళీ నిన్ను అడగను.'"

కారు డోర్ తీసుకొని విసురుగా బయటకు దూకాడు మాధవరావు.

"ఏమిటీ, నీకు ఆస్తి పంచాలా? ~~ఈ~~ ఆస్తి పిత్రార్జితం కాదు. నా కష్టార్జితం! మళ్ళీ యీ సారి వాటా అన్నా వంటే, యీ ఇంట్లోంచి బయటకు గెంటేస్తాను" గర్జించాడు.

"నన్ను ఇంట్లోంచి గెంటేస్తావా? అది నీవల్ల కాదు బ్రదర్! నీ తదనంతరం యీ ఆస్తిలో నీ కూతురుకెంత హక్కుందో, నాకూ అంతే హక్కు వుంటుంది."

"ఒరేయ్, నేనంత పిచ్చివాడ్ని కాదురా! నా బొందిలో ప్రాణమున్నంతవరకు నీకు రూపాయి ఇవ్వను. ఆ తరువాత పైసా రానివ్వను" కోపంగా అని మళ్ళీ కారులో కూర్చొని డోర్‌ను బలంగా మూశాడు.

"ఆర్ముగం, కారును త్వరగా నడుపు" తల పట్టుకొని సీటుకు జారగిలపడుతూ అరిచాడు మాధవరావు.

కారు ఆవరణ దాటి వేగంగా దూసుకు పోయింది.

# 6

మూడు సంవత్సరాల అపరాధ పరిశోధన పుస్తకాలను ముందేసుకొని బట్టీ పట్టేస్తున్నాడు అసిస్టెంట్ పార్వతీశం.

అయిదేళ్ళుగా కాలేజీ చదువుతో బాటు అనేక డిటెక్టివ్ పుస్తకాలు కంఠాపాఠంగా నెమరేసి శవ సాహిత్యంలో అపార జ్ఞానాన్ని సంపాదించిన పార్వతీశం, తన పట్టాకు తగిన వుద్యోగం ప్రభుత్వం చూపించలేక పోయేసరికి, కనీసం శవపరిజ్ఞానాన్ని అయినా సద్వినియోగం చేద్దామని డిటెక్టివ్ గిరీశం దగ్గర అసిస్టెంట్ గా చేరాడు.

గిరీశం దగ్గర అసిస్టెంట్ గా చేరిన లగాయితూ, తన ప్రతిభను భారతావనికి చాటడానికి తగిన అవకాశం రాలేదే, అని విచారిస్తూ కసిగా పుస్తకాలను రంగరించి 'కాకా' వాడి టీ లో కలిపేసుకొని త్రాగేస్తున్నాడు.

ఇంతపెద్ద మద్రాస్ నగరంలో కనీసం రోజుకొక హత్య కూడా జరగటం లేదా, అని బోల్డు బాధ పడి పోతాడు పార్వతీశం.

ప్రజలలో ఇంత నీతి నిజాయితీలు, శాంతస్వభావం ఎందుకింత బాగా పెరిగిపోతున్నాయో కూడా, అతగాడికి అర్థంగాని ప్రశ్నలలో ఒకటి!

ప్రతి రోజూ ఎక్కడైనా హత్యలు, దొంగతనాలు జరిగాయేమోనని తెలుసుకోవడానికి అన్ని పోలీస్ స్టేషన్లకు ఫోన్ చేయడం అతని డ్యూటీలో ఒకటి!

మంచి హత్యా సన్నివేశంలో గాఢంగా లీనమైవున్న పార్వతీశం ఢమఢమ మంటూ పెద్ద శబ్దం విన్పించేసరికి ఉలిక్కిపడి స్టూలు మీదనుండి లేచాడు.

కారు డోర్ గట్టిగా తెరచి మూసిన శబ్దం విన్పించే సరికి కంగారుగా బయటకు పరిగెత్తాడు పార్వతీశం.

డొక్కు డాడ్జి కారులోనుండి అతికష్టంగా దిగిన దిగ్రేట్ డిటెక్టివ్ గిరీశం, టర్కీటవల్ తో చమటను తుడుచుకుంటూ లోపలకు ప్రవేశించాడు భారంగా.

గురువును ఆ స్థితిలో చూసేటప్పటికి పార్వతీశానికి చాలా ముచ్చటేసింది.

"వాట్ గురూగారూ! చాలా శ్రమపడినట్లున్నారు. ఎక్కడన్నా హత్యా, దొంగతనమా?" సంతోషంగా అడిగాడు.

అసిస్టెంట్ వైపు కోపంగా చూశాడు గిరీశం.

"ఓరి నీ డిటెక్షన్ కూలా! నా దగ్గరవుండి నీవు నేర్చుకొనే పరిశోధన యిదా?"

"తప్పయిపోయింది గురూ! ఏం జరిగింది?" కంగారుగా అడిగాడు పార్వతీశం.

"హత్య జరగలేదు, దొంగతనం జరగలేదు. ఘెరావ్ జరిగిందయ్యా, ఘెరావ్!" కుర్చీలో కూలబడుతూ అన్నాడు గిరీశం.

"వాట్? ఘెరావా? ఎవరిని? మిమ్మల్నే? ఎక్కడ గురూ? ఆడవాళ్ళు చేశారా, మగవాళ్ళు చేశారా?" కుతూహలంగా గడగడ అడిగేశాడు పార్వతీశం.

అరికాలి మంట నెత్తికెక్కింది గిరీశానికి.

"నీ తలకాయ్! మన డొక్కు డాడ్జి కారు నన్ను ఘెరావ్ చేసింది. అప్పటికీ అష్టకష్టాలుపడి దాని ఘెరావ్ నుండి తప్పించుకోనేసరికి, నాలుగుచోట్ల గీసుకుపోయింది గూడా!" ఆపసోపాలు పడుతూ చెప్పాడు గిరీశం.

ఆ అవతారంలో గిరీశాన్ని చూస్తున్న పార్వతీశానికి నవ్వాగలేదు.

పకపక, పకపక విడవకుండా నవ్వాడు.

పిచ్చిపట్టినట్లు నవ్వుతున్న పార్వతీశాన్ని చూడగానే గిరీశానికి కడుపులో మండింది.

"స్టాపిట్!" గర్జించాడు గిరీశం.

ఉలిక్కిపడి సర్దుకుని కూర్చుండిపోయాడు పార్వతీశం.

"మిష్టర్ పార్వతీశం! నేను డిటెక్టివ్‌ను. నువు అసిస్టెంటువు. అవునా?" గంభీరంగా అడిగాడు గిరీశం.

"అవును సార్!" అటెంక్షన్‌లో నిలబడి చెప్పాడు పార్వతీశం.

"కరెక్టు. వెంటనే ఫోన్ చేసి చెప్పు?"

"ఎవరితో సార్?"

"ఫిట్‌వెల్ ఆటోమొబైల్స్‌కు."

"ఏమని సార్?"

"మన డాడ్జి కారు డోర్ వెడల్పు చేయమని" గట్టిగా కసిరాడు.

"ఎస్సార్!" గబగబ ఫోన్ ముందుకు లాక్కున్నాడు పార్వతీశం.

గిరీశం కుర్చీలో యిబ్బందిగా కదిలాడు. టేబుల్ మీద పుస్తకాలన్నీ సర్ది, ఆ రోజు పేపరు అందుకున్నాడు.

ఫోన్ క్రెడిల్ చేసి "చెప్పాను సార్!" అన్నాడు పార్వతీశం.

"ఏమన్నారు?"

"మరో పదినిమిషాలలో వచ్చి, మీ కొలతలు తీసుకొని కారును తీసుకెళతామన్నారు."

"వెరీగుడ్!" సిగరెట్ వెలిగిస్తూ అన్నాడు.

"సార్!" పిలిచాడు పార్వతీశం.

"ఏమిటి?" పేపరులోంచి తల పైకెత్తి అడిగాడు గిరీశం.

"డిటెక్టివ్ నవలలో డిటెక్టివ్‌లంతా శవాలను చూడగానే హత్యో, ఆత్మహత్యో చెప్పేస్తారు. అది ఎలాసార్?" అడిగాడు పార్వతీశం.

"అది హత్యఅయినదీ, ఆత్మహత్య అయినదీ ఆ నవల వ్రాసేవాళ్ళకు ముందే తెలిసి వుంటుంది కాబట్టి, డిటెక్టివ్

టక్కున చెప్పేస్తాడు. అందులో పెద్ద గొప్పఏమీ లేదు''
తేలికగా చెప్పాడు గిరీశం.

''అలాగా సార్!'' అన్నాడు ఆశ్చర్యంగా చూస్తూ పార్వతీశం.

''ఇదిగో పార్వతీశం, ఈ రోజు పట్నంలో ఎక్కడైనా హత్యలు జరిగాయేమోనని వాకబు చేశావా?'' ప్రశ్నించాడు గిరీశం.

''చేశాను సార్! ఎవర్నీ ఎవరూ చంపలేదు సార్? చాలా అన్యాయంగా వుంది దేశం!'' చిన్నగా నిట్టూర్చాడు పార్వతీశం.

''కలికాలం పార్వతీశం, కలికాలం!'' జతగా నిట్టూర్చాడు గిరీశం.

అంతలో బయట ఏదో వాహనం ఆగిన శబ్దం విన్పించింది.

''ఫిట్ వెల్ ఆటో మొబైల్స్ వాళ్ళు వచ్చేసినట్లున్నారు సార్.''

''కాదు పోలీస్ జీప్ వచ్చింది. బహుశా ఇన్ స్పెక్టర్ చిదంబరం కూడా వచ్చివుంటాడు'' చెప్పాడు గిరీశం.

కిటికీ తలుపు తెరచి బయటకు చూసిన పార్వతీశం నిజంగానే ఆశ్చర్యపోయాడు.

బయట పోలీస్ జీప్ ఆగివుంది. ఇన్ స్పెక్టర్ చిదంబరం కంగారుగా లోపలకు వస్తున్నాడు.

ఆశ్చర్యంగా గిరీశంవైపు చూశాడు పార్వతీశం.

''గురూ, ఆ వాహనం ఫిట్ వెల్ ఆటో మొబైల్స్ వాళ్ళది కాదని పోలీస్ జీప్ అని ఎలా కనిపెట్టారు?'' అడిగాడు కుతూహలంగా.

గర్వంగా నవ్వాడు గిరీశం.

''నామ్, డియర్ శిష్యా! అదే మన డిటెక్షన్లో

స్పెషాలిటీ! అది నీకు క్రమేపీ అర్థమయ్యేటట్లు చెబు తాను. ఒక్కసారే డిటెక్షన్ నేర్పకూడదు'' సిగరెట్ పెట్టె అందుకుంటూ అన్నాడు.

ఇన్‌స్పెక్టర్ చిదంబరం గబగబ లోపలకు ప్రవే శించాడు.

"అబ్బబ్బ! గిరీశం, తెల్లవారి లేవగానే ఎలాంటి కబురు వినవలసి వచ్చిందయ్యా!''కుర్చీలో కూలబడుతూ అన్నాడు చిదంబరం.

"ఏమిటది చిదంబరం? పరగడుపున ఎవడన్నా పోయాడా?'' అడిగాడు గిరీశం.

"అవును. కోడంబాకంలో ఓ హత్య జరిగిందని ఫో నొచ్చింది.''

"నిజంగా? హత్యా''' ఎగిరి గంతేశాడు పార్వతీశం.

"శిష్యా, చిదంబరానికో చిక్కని కాఫీ తీసుకురా!'' ఆనందంగా చెప్పాడు గిరీశం.

డిటెక్టివ్‌ల సంతోషాన్ని చూస్తుంటే ఒళ్ళు మండింది చిదంబరానికి.

"ఇదిగో, ఎవడన్నా ఛస్తే మీ కెందుకంత సంతోషం?''

"సంతోషించక ఏడవమంటావా? అయినా పుట్టిన ప్రతివాడు చావక మానడు. ఆ చచ్చేవాడు మన బుర్రలకు ఇంత పదును పెట్టేటట్లు ఛస్తే, యీ విషయాలలో స్పెష లైజ్ చేసిన యీ బుర్రలకు కాస్త తిండయినా దొరుకు తుంది,'' బొజ్జ సవరించుకుంటూ అన్నాడు గిరీశం.

"ఇంతకీ ఎవరు గురూ, ప్రొద్దున్నే పుణ్యం కట్టుకుంది?'' కాఫీ కప్పు అందిస్తూ ఆత్రంగా అడిగాడు పార్వతీశం.

"ప్రఖ్యాత క్యారెక్టర్ యాక్టర్ మాధవరావు!'' కాఫీ త్రాగుతూ చెప్పాడు చిదంబరం.

డిటెక్టివ్ లిద్దరూ అదిరిపడ్డారు.

"వాట్ మాధవరావా? ఆయన పాపం చాలా మంచి వాడు. ఆయనను ఎవరు హత్యచేశారోయ్?" ఆశ్చర్యంగా అడిగాడు గిరీశం.

"ఆ విషయం తెలిస్తే నీ దగ్గరకు రావడం దేనికి? నువ్వే తేల్చాలి ఆ హంతకుడిని" కసురుతూ అన్నాడు చిదంబరం.

గిరీశం ఒక్కక్షణం ఆలోచనలో పడ్డాడు.

త్వరగా బయల్దేరమన్నట్లుగా పార్వతీశం, గిరీశంవైపు ఆత్రంగా చూశాడు.

"సరే పద చిదంబరం. మాధవరావు నా అభిమాన నటుడు. కనీసం అందుకోసమయినా యీ కేసును పరిశోధిస్తాను" కుర్చీలోంచి భారంగా లేస్తూ అన్నాడు గిరీశం.

కుర్చీలోంచి లేవలేకపోతున్న గిరీశానికి, చేయూతనిచ్చి నిలబెట్టాడు పార్వతీశం.

పార్వతీశం సహాయంతో జీప్ ఎక్కడానికి అయిదు నిమిషాలు పట్టింది గిరీశానికి.

"గిరీశం ఆ లావు తగ్గడానికి ఏమైనా మందులు వాడకూడదూ?" అడిగాడు చిదంబరం.

"లాభంలేదు చిదంబరం. మందులు వాడబట్టే ఇంత లావయ్యాను. అలా కాదని, నేనూ, పార్వతీశం ఎక్సర్‌సైజులు చేస్తున్నాం."

"పార్వతీశం ఎందుకూ?" ఆశ్చర్యంగా అడిగాడు చిదంబరం.

"మరీ బక్కసన్యాసి! కొంచం లావు అవుతాడని" వాసంలా వున్న పార్వతీశాన్ని చూస్తూ అన్నాడు గిరీశం.

జీప్ కోడంబాకంవైపు పరుగుదీసింది.

## 7

జీప్ మాధవ్ మాన్షన్ ముందాగింది.

అప్పటికే అక్కడ జనం బాగా గుమికూడివున్నారు. లోపలకు దూసుకుపోబోతున్న జనాన్ని అదుపు చేయలేక పోతున్నారు పోలీసులు. అడపాదడపా లాఠీలను ఉపయోగిస్తున్నారు.

"ఏడుకొండలూ!" అరిచాడు జీప్‌లోనుండి చిదంబరం.

"ఎస్సార్ వస్తున్నా" అంటూ హడావుడిగా వచ్చి ఎటెంక్షన్‌లో సెల్యూట్ కొట్టి నిలబడ్డాడు హెడ్ కానిస్టేబుల్ ఏడుకొండలు.

"లోపలకు ఎవరన్నా వెళ్ళారా?" అడిగాడు.

"ప్రఖ్యాత హీరో రమానంద్ గారు మేం ఎంత చెబుతున్నా వినిపించుకోకుండా లోపలకు వెళ్ళారు సార్" భయపడుతూ చెప్పాడు ఏడుకొండలు.

"ఆల్ రైట్! ఇంకెవర్నీ లోపలకు రానివ్వకు" అంటూ డిటెక్టివ్‌లతో ముందుకు నడిచాడు చిదంబరం.

ఏడుకొండలు లాఠీని గాలిలో త్రిప్పుతూ అధికారులకు దారి చేశాడు.

ముగ్గురూ సరాసరి మేడమీద హత్య జరిగిన గదిలోకి ప్రవేశించారు.

అక్కడి దృశ్యాన్ని చూసి అదిరిపోయాడు పార్వతీశం.

మాధవరావు శవం నేలమీద వెల్లకిలా పడివుంది. దుస్తులు అస్తవ్యస్తంగా చెదిరిపోయి వున్నాయి. శవం క్రింద పడివున్న పొజిషన్ చూస్తే, హంతకుడు హతుణ్ని నిలబడి వున్నప్పుడు కత్తితో గుండెలలో బలంగా పొడిచి వుంటాడని వూహించడానికి అవకాశం వుంది. హతుడు క్రిందపడిపోయిన తరువాత గిలగిల కొట్టుకుంటూ ప్రాణం విడిచినట్లు స్పష్టంగా కన్పిస్తోంది.

హతుని కుడిచేయి కత్తిపిడిని బలంగా పట్టుకొనివుంది. గుండెలలో దిగిన బాకును బయటకులాగి వేయాలని హతుడు చేసిన విఫలప్రయత్నం స్పష్టంగా ముఖంలో కనబడుతూంది. ఆ ప్రయత్నంలో హతుడు కొంత విజయం సాధించాడు కూడా! గుండెలలో దిగిన కత్తి షుమారు ఒక అంగుళం పైకి లాగబడివుంది.

అసిస్టెంట్ డిటెక్టివ్ పార్వతీశం ఆ గది నొకసారి పూర్తిగా పరిశీలించాడు.

ఎయిర్ కండిషన్ చేయబడిన ఆ విశాలమైన గదిలో పెద్ద ఫోంబెడ్, ఓ రెండు సోఫాలు అమర్చి వున్నాయి. గది గోడలనిండా మాధవరావు ఛాయాచిత్రాలే వివిధ భంగిమలలో అలంకరింపబడి వున్నాయి. శవం మంచానికి గజం దూరంలో పడివుంది.

శవంవైపు మరోసారి పరిశీలనగా చూశాడు గిరీశం.

మాధవరావు నైట్ డ్రస్ తొడుక్కుని వున్నాడు. హత్యాయుధం అక్కడే వుండటంతో పరిశోధన తేలికగా సాగవచ్చునని భావించాడు.

శవం చుట్టూవున్న పరిసరాల్ని సునిశితంగా పరిశీలించాడు గిరీశం. అనుమానించదగిన విశేషాలేమీ కనబడ లేదు. హతుని ఎడమచేయి పిడికిలి మాత్రం గట్టిగా మూసి వుంది.

"విత్ యువర్ పర్మిషన్ చిదంబరం!" అంటూ గిరీశం బలవంతంగా ఆ పిడికిలిని తెరిచాడు.

చేతిలో ఒక చిన్న రాగి బిళ్ళ మెరుస్తోంది.

ఆ బిళ్ళను జాగ్రత్తగా తీసుకొని పరిశీలించాడు. అది ఆంజనేయస్వామి బొమ్మవున్న బిళ్ళ! సాధారణంగా చాలామంది ఆ బిళ్ళను మెళ్ళో ధరిస్తూ వుంటారు. ఆ బిళ్ళకు సంబంధించిన తాడు వుంటుందేమోనని పరిశో

ధించారు. ఎక్కడా కనబడలేదు.

"ఈ బిళ్ళ అతని చేతిలోకి ఎలా వచ్చిందంటావు గిరీశం?" అడిగాడు చిదంబరం.

"బహుశా యీ రాగిబిళ్ళను హంతకుడు ధరించి వుండ వచ్చును. హతునికి హంతకుడికి జరిగిన పెనుగులాటలో హంతకుడికి చెందిన యీ రాగిబిళ్ళ హతుని పిడికిలిలో చిక్కి వుండవచ్చును.

"హమ్మయ్య! ఇక హంతకుడు దొరికినట్లేగా!" చిన్నగా నిట్టూర్చాడు పార్వతీశం.

ఆశ్చర్యంగా చూశాడు చిదంబరం.

"అంతేగా గురూ! ఆ రాగిబిళ్ళ ఎవరిదో కనుక్కుంటే హంతకుడు దొరికినట్లేగా!"

"శిష్యా! హంతకుడు నీ అంత తెలివితక్కువ వాడు కాదు" కసిరాడు గిరీశం.

శవాన్ని కొంచం ప్రక్కకు తిప్పాడు చిదంబరం.

గిరీశం కళ్ళు తళతళ మెరిశాయి. చటుక్కున ముందుకు వంగాడు.

శవం క్రింద ఒక కాల్చిపడేసిన సిగరెట్ పీకను జాగ్రత్తగా కర్చీఫుతో పైకితీశాడు.

"గురూ, అది ఏ బ్రాండ్ ది?" అప్పుడే మేల్కొంటున్న పార్వతీశం డిటెక్షన్ మైండ్ టక్కున అడిగింది.

"పనామా! నోట్ చేసుకో" చెప్పాడు గిరీశం.

చిదంబరం కూడా నోట్ చేసుకున్నాడు.

సిగరెట్ పీకకు అంటిన మట్టి రాలకుండా జాగ్రత్తగా తన కోటు జేబులోకి కర్చీఫుతో సహా నెట్టేశాడు గిరీశం.

"ఇప్పటికి రెండు!" అన్నాడు తృప్తిగా చిదంబరం.

"అవును. బహుశా హంతకుడు దొరకడానికి ఈ రెండు ఆధారాలు చాలు. హత్యాయుధం ఇక్కడే వుంది కాబట్టి

వేలిముద్రలు కూడా దొరుకుతాయేమో చూద్దాం!'' బాండ్ ఫోజ్ కొడుతూ అన్నాడు గిరీశం.

ఇనస్పెక్టర్ సిబ్బందిని పిలవగానే, అంతా హుటా హుటిన రంగంలోకి ప్రవేశించారు.

వేలిముద్రల నిపుణుడు కత్తిపిడిమీద, ఇంకా పరిసరాలలో ఎవరివైన వేలిముద్రలు వుంటాయేమోనని పరిశోధించసాగాడు. పోలీస్ డాక్టర్ హతుని గుండెలలో దిగిన కత్తిని పైకిలాగి దానిపొడవు కొలుచుకొని నోట్ చేసుకున్నాడు. ఆ తరువాత హతుని రక్తాన్ని కొద్దిగా ఒక గ్లాసు ప్లేట్ పై తీసుకొని మరణం ఎప్పుడు సంభవించిందో పరిశీలించసాగాడు. ఫోటోగ్రాఫర్లు శవాన్ని, హత్యా ప్రదేశాన్ని వివిధ కోణాలలో ఫోటోలు తీయడంలో మునిగిపోయారు.

''పద. ఈ ఇంట్లో వాళ్ళని పరిచయం చేద్దుగాని!'' ముందుకు నడిచాడు గిరీశం.

ముగ్గురూ మెయిన్ హాలులోకి వచ్చారు.

అధికారులను చూడగానే, హాలులో కూర్చొనివున్న వారందరూ, ఒక్కసారిగా నిలబడ్డారు.

ఇనస్పెక్టర్ చిదంబరం అందర్నీ డిటెక్టివ్ కు పరిచయం చేయసాగాడు.

''ఈయనపేరు కళ్యాణరావు. హతుడు మాధవరావు గారికి స్వయానా తమ్ముడవుతాడు.

''వీరిపేరు పీతాంబరం. మాధవరావుగారి బావమరిది. ఒకటి రెండుసార్లు పర్మిట్ లేకుండా లిక్కర్ సేవించి వుండగా అరెస్ట్ చేశాం. మాధవరావుగారే బెయిల్ యిచ్చి విడిపించారు.''

నల్లగా మాడిపోయివున్న పీతాంబరం మొహంచూసి చిన్నగా నవ్వుకున్నాడు పార్వతీశం.

మరో సోఫాదగ్గర నిలబడివున్న యువతీయువకుల దగ్గరకు నడిచాడు.

"ఈమె పేరు శోభారాణి. మాధవరావుగారి ఏకైక కుమార్తె. ఆయన మరణం ప్రస్తుతం వీరికే తీరని లోటు.

"ఇక వీరు మీకు తెలిసినవారే! హీరో రమానంద్! మాధవరావుగారంటే వీరికి అభిమానం. వీరంటే మాధవ రావుగారికి వాత్సల్యం."

పరిచయ నమస్కారాలకు ప్రతినమస్కారాలు చేసి మరికొంచం ముందుకు నడిచారు డిటెక్టివ్‌లు.

చేతులు కట్టుకొని విచారంగా నిలబడివున్న వ్యక్తిని చూపిస్తూ, "ఇతను మాధవరావుగారి పర్సనల్ బోయ్. పేరు ఆర్ముగం. చాలా మంచివాడు, నమ్మకస్థుడు అని పేరు వుంది" చెప్పాడు.

అందరి పరిచయాలు పూర్తవ్వగానే ఒక సోఫాలో కూర్చొని అందర్నీ కూర్చోమని సైగచేశాడు డిటెక్టివ్ గిరీశం.

అంతా తమతమ స్థానాలలో కూర్చొన్నారు.

వేలిముద్రల నిపుణుడు వచ్చి కత్తి పిడిమీద ఇద్దరు వ్యక్తుల వేలిముద్రలు లభించినట్లు చెప్పాడు.

"రాత్రి యీ ఇంట్లో వున్నది ఎవరెవరు?" అందరివైపు చూస్తూ అడిగాడు గిరీశం.

"రమానంద్‌బాబుగారు తప్ప మిగిలిన వారందరం ఇక్కడే వున్నాం సార్!" ఆర్ముగం చెప్పాడు.

"ఆల్ రైట్ మిస్టర్ వేలాయుధం, ఆ నలుగురి వేలి ముద్రలు కూడా తీసుకొని పరిశీలించండి" చెప్పాడు గిరీశం.

వేలాయుధం శోభ, ఆర్ముగం, పీతాంబరం, కళ్యాణ రావుల వేలిముద్రలు తీసుకొని మరో గదిలోకి నడిచాడు.

శోభారాణివైపు చూశాడు పార్వతీశం. ఏడ్చిఏడ్చి

శోకదేవతలా వున్న శోభవైపు చూడగానే కడుపు తరుక్కుపోయింది.

"గురూ, ప్రశ్నలడగనా?" హుషారుగా అడిగాడు పార్వతీశం.

"నువ్వొద్దు! నేనే అడుగుతాను. నువ్వు జాగ్రత్తగా నోట్ చేసుకో" అంటూ శోభారాణివైపు తిరిగి ప్రశ్నలు అడగసాగాడు.

"చూడమ్మా శోభా! మీరంటే మీ తండ్రిగారికి చాలా ప్రేమకదూ?"

"అవునండి!" తండ్రి గుర్తుకు వచ్చి భోరుమంది.

ఓ రెండు నిముషాలు ఆగి "శోభారాణీ, మీరు పెద్దగా విచారించినంత మాత్రాన పోయిన మీ నాన్నగారు తిరిగి రారు. నే నడిగే ప్రశ్నలకు సమాధానమిస్తే, మీ తండ్రి గారిని హతమార్చిన హంతకులను ఉరికంబ మెక్కించ వచ్చు!" సోఫాలో తన భారీ శరీరాన్ని సర్దుకుంటూ అడిగాడు గిరీశం.

"అడగండి. తప్పకుండా చెబుతాను!" కళ్ళు తుడుచు కుంటూ అంది శోభ.

"అసలు హత్య ఎందుకు జరిగిందో తెలుసుకుంటే, హంతకు లెవరో అవలీలగా తెలిసిపోతుంది. సో, మీ నాన్న గారి యీ హత్యకు కారణమేదైనా చెప్పగలరా?"

"చెప్పలేను గిరీశంగారూ! అసలు నాన్నగారు హత్య చేయబడ్డారంటే, ఇంకా నమ్మలేకపోతున్నాను."

"ఆల్ రైట్, మీరు మీ నాన్నగార్ని చివరిసారిగా ఎప్పుడు చూశారు?"

"రాత్రి పదిగంటలకు నేను బెడ్ రూంలోకి వెళ్ళ బోతూ, నాన్నగారు ఏంచేస్తున్నారో చూడటానికి వారి గది దగ్గరకు వెళ్ళాను. ఆయన ఏదో రిహార్సల్ చేసు

కుంటుంటే, డిస్టర్బ్ చేయడమెందుకని నా గదిలోకి వెళ్ళిపోయాను."

"గుడ్! మీకు తెలిసినంతవరకు మాధవరావుగారి గదిలో ఏవైనా విలువైన వస్తువులు అపహరించబడ్డాయా?"

"ఏమీ పోలేదని ఆర్ముగం చెప్పాడు సార్."

"ఈ ప్రశ్నకు సమాధానం బాగా ఆలోచించుకొని చెప్పండి. మాధవరావుగారిపైన ఎవరికైనా విరోధంగానీ, ద్వేషంగానీ వున్నాయా?"

శోభ పీతాంబరం, కళ్యాణరావుల వైపు ఒకసారి చూసింది.

ఒక నిమిషం ఆగి "లేదు గిరీశంగారూ, ఒకవేళ ఏవైనా కోపతాపాలు వున్నా స్వల్పాతి స్వల్పం. హత్య చేసేటంతటి విరోధులు నాన్నగారికెవరూ లేరు" అంది.

గిరీశం వాళ్ళిద్దరివైపు పరీక్షగా చూశాడు.

కల్యాణరావు రెండు చేతులలో తల పెట్టుకొని కూర్చున్నాడు. పీతాంబరం ఎటో సిగరెట్ త్రాగుతున్నాడు.

"గురూ, నే నో రహస్యం కనిబెట్టేశాను. అదుగో వాడే హంతకుడు," గొణిగాడు పార్వతీశం.

ఆశ్చర్యంగా చూశాడు గిరీశం.

"ఎవరు?"

"ఆ పీతాంబరం గాడే!"

"ఎలా?" చిన్నగా అడిగాడు.

"వాడు త్రాగే సిగరెట్ పనామా సిగరెట్! ఇందాక పేంట్లోంచి సిగరెట్ తీసుకొంటుంటే చూశాను."

"వెరీగుడ్. గట్టిగా అరవకు" హెచ్చరించాడు గిరీశం. వేలిముద్రల నిపుణుడు వేలాయుధం లోపలనుండి వచ్చి ఇనస్పెక్టర్ చిదంబరానికి ఓ కాగితం అందించాడు.

ఇనస్పెక్టర్ చదివి ఆ కాగితాన్ని గిరీశానికి అందించాడు.

కత్తి పిడిమీద హతుడు మాధవరావు వేలిముద్రలు గాక, కళ్యాణరావు, ఆర్ముగం వేలిముద్రలున్నట్లు పరిశోధనలో తేలింది. ఆ గదిలో అనుమానాస్పదమైన మరే ముద్రలు లేవు.

ఆ కాగితం చూసిన పార్వతీశం గూడా ఆశ్చర్యపోయాడు.

పీతాంబరం, కళ్యాణరావు, ఆర్ముగంల వైపు మార్చి మార్చి చూశాడు.

"ఇదిగో గిరీశం, నీ కేమన్నా అర్ధమయిందా? నాకంతా అయోమయంగా వుంది" గొణిగాడు చిదంబరం.

"చిదంబరం! నేను ఒక విషయం రూఢి చేసుకున్నాను. ఇది తప్పకుండా యీ యింటిలోని వారెవరో చేసిన హత్య! ఇందులో సందేహం లేదు" గంభీరంగా అన్నాడు గిరీశం.

అంతా భయం భయంగా చూశారు. పార్వతీశం అందరి కళ్ళలోకి పరీక్షగా చూడటం ప్రారంభించాడు.

పోలీస్ డాక్టర్ తన పరీక్ష ముగించుకొని బయటకు వచ్చాడు.

"హత్య ఎన్ని గంటలకి జరిగింది డాక్టర్?" అడిగాడు చిదంబరం.

కుర్చీలోంచి లేచిన గిరీశం ముందుకు నడవబోయి జర్రున క్రిందకు జారాడు.

అంతా హడావుడిగా చూశారు. డాక్టర్ గబగబ గిరీశం దగ్గరకు పరిగెత్తాడు.

"ఇదిగో డాక్టర్, నువ్వు లేపలేవు గానీ, ఆ హత్య జరిగిన టైం ఎంతకి?" రహస్యంగా అడిగాడు గిరీశం.

తెల్లబోయి చూసిన డాక్టర్ తేప్పరిల్లుకొని "రాత్రి పదిన్నరకు జరిగి వుంటుంది సార్" అన్నాడు చిన్నగా.

"థాంక్యూ! హత్య జరిగిన టైం తెలియలేదని, త్వరలో కనుక్కుంటామని ప్రకటించండి," గబగబ పల్కి డాక్టర్ యిచ్చిన ఆసరాతో లేచి నిలబడ్డాడు గిరీశం.

"అదేమిటి గురూ, అలా పడిపోయావు?" అడిగాడు పార్వతీశం.

"సడెన్‌గా ఏదో గుర్తుకు వచ్చి!" చెప్పాడు గిరీశం.

'ఓహో! సడెన్‌గా ఏదన్నా గుర్తుకు వస్తే అలా పడి పోవాలన్న మాట!' మనసులో మరోసారి మననం చేసుకున్నాడు పార్వతీశం.

డాక్టర్ అందరికీ వినబడేటట్లుగా చిదంబరంతో చెప్పాడు.

"మరో రెండు గంటలలో హత్య ఎన్ని గంటలకు జరిగినది ఖచ్చితంగా తెలుస్తుంది."

ఇనస్పెక్టర్ చిదంబరం శవాన్ని మార్చురీకి తరలించమని ఆర్డర్ జారీ చేశాడు.

"గిరీశం కేసు అంతా గజిబిజిగా వుంది. నువ్వేమన్నా ఆలోచించావా?" అడిగాడు ఇనస్పెక్టర్ చిదంబరం.

"నేనూ చాలా అర్జంటుగానే ఆలోచిస్తున్నాను చిదంబరం. ఈ యింట్లోనే ఏదో మనం వూహించలేని రహస్యం యిమిడి వుంది. అది ఎవరూ చెప్పడం లేదు. నా దృష్టిలో అనుమానితులు ముగ్గురు వున్నారు. అయినా, వీళ్ళందర్నీ విడివిడిగా క్రాస్ చేస్తేగానీ కొన్ని విషయాలు బయట పడవు," చిన్నగా చెప్పాడు గిరీశం.

## 8

"అమ్మగారం, మీ బాబుగారు ఎలాంటి వారు?" అడి

గాడు గిరీశం ప్రక్క గదిలో అక్కడున్న కుర్చీలో కూర్చోలేక కూర్చుంటూ.

"బాబుగారు ధర్మ ప్రభువులు సార్! ఎప్పుడూ ఎవరికీ అన్యాయం చేయనివారు బాబూ! అలాంటి పుణ్యాత్ముని చంపడానికి ఎవరికి చేతులు వచ్చాయో?" కళ్ళ నీరు తుడుచుకుంటూ చెప్పాడు ఆర్ముగం.

"మాధవరావు గారికి దుర్వ్యసనాలు ఏమైనా వున్నాయా?"

"లేదు బాబూ! ఎవరైనా పెద్దవారు పార్టీలు యిస్తే కాస్త 'మందు' తీసుకొంటారు తప్ప, మరేవిధమైన వ్యసనాలు లేవు బాబూ!"

"రావుగారి భార్య చచ్చిపోయి ఎన్నాళ్ళయింది?"

"తొమ్మిదేళ్ళు దాటుతోంది సార్!"

"ఆవిడ నీకు తెలుసా?"

"లేదు సార్! నేను యీ పనిలోకి చేరి నాలుగేళ్ళు అవుతుంది."

"భార్య చచ్చిపోయిన దగ్గరనుండి మాధవరావు స్త్రీ సాంగత్యం లేకుండానే వుంటున్నాడా?" చటుక్కున అడిగాడు పార్వతీశం.

"నాలుగేళ్ళ క్రిందటి విషయం నాకు తెలియదు సార్. నాలుగేళ్ళ నుండి ఆయన నిష్టగానే వుంటున్నారని తెలుసు."

"అంత గట్టిగా ఎలా చెప్పగలుగుతున్నావ్?"

"బాబుగారి వెంట ఎప్పుడూ నేనే వుంటాను సార్. ఆయన కారును గూడా నేనే నడుపుతుంటాను."

"చూడు ఆర్ముగం, నాలుగేళ్ళ బట్టి నువ్వు యీ యింటిలో వుంటున్నావు కాబట్టి, యీ యింట్లోవారి మనస్తత్వాలు నీకు బాగా తెలిసే వుంటాయి. కాబట్టి నీకు

తెలిసిన విషయాలు పూర్తిగా మాకు చెప్పు,'' అన్నాడు గిరీశం సిగరెట్ అంటించుకుంటూ.

"అడగండి సార్!'' క్రింద కూర్చుంటూ అన్నాడు ఆరోగ్యం.

"రావుగారి బావమరిది పీతాంబరం ఎలాంటివాడు?'' పార్వతీశం వైపు నోట్ చేసుకోమని సైగ చేస్తూ అడిగాడు గిరీశం.

"పీతాంబరంగారు ముక్కోపి సార్. అంతేగాక ఆయనకు బాగా త్రాగుడు అలవాటువుంది. మీకో ముఖ్యమైన విషయం చెప్పాలి సార్. పీతాంబరంగారి అక్కగారు బ్రతికుండగా శోభారాణిగారిని యీయనకిచ్చి పెళ్ళి చేస్తానన్నారట! అయితే శోభారాణిగారికి పీతాంబరం గారు యిష్టంలేదు. దానికి కారణం, ఈయనవట్టి త్రాగుబోతు మాత్రమేగాక అనుమానం మనిషి. ఇటీవల హీరో రమానంద్ గారితో శోభారాణిగారికి పరిచయమయింది. అది యిష్టంలేని పీతాంబరంగారు బాబుగారితో ఘర్షణకు దిగారు సార్'' అంటూ నిన్న జరిగిన దంతా వివరించి చెప్పాడు.

"వెరీగుడ్! మరి కళ్యాణరావుగారు ఎలాంటివారు?''

"ఆయన పెదబాబుగారి తోబుట్టువుగా పుట్టవలసిన వారు కాదు బాబూ! దేశాలుబట్టి తిరుగుతున్న తమ్ముడ్ని దయతలిచి యింట్లో పెట్టుకుంటే, తిన్నయింటి వాసాలనే లెక్కబెడుతున్నాడు. పేకాటకు పెద్దపెద్ద మొత్తాలలో డబ్బు అడగడం, బాబుగారు కోపగించుకుంటే ఆస్తిలో వాటా యిమ్మని డిమాండ్ చేయడం ఆయనకు ఓ గొప్ప చెడ్డ అలవాటు సార్. నిన్న ఉదయం డబ్బు గురించే పెదబాబుగారికీ, కళ్యాణరావుగారికీ కొంచెం పెద్ద ఘర్షణే జరిగింది'' అంటూ ఆ ఘర్షణ అంతా వివరించి చెప్పాడు

ఆర్ముగం.

"చాలా విలువైన విశేషాలు అందచేశావు ఆర్ముగం, థాంక్స్! ఇకపోతే నిన్ను గూడా కొన్ని విషయాలు అడగాలి" అన్నాడు గిరీశం.

"అడగండిసార్!" ఉత్సాహంగా అన్నాడు ఆర్ముగం.

"మా పార్వతీశంగాడు యీ హత్య నువ్వే చేశావంటు న్నాడు" చిన్నగా అన్నాడు గిరీశం.

ఆర్ముగం ముఖం నల్లబడింది.

"బాబుగారి మోచేతి నీళ్ళు త్రాగి బ్రతికేవాడిని. నేను బాబుగారిని హత్యచేస్తానా బాబూ?" ఆవేదనగా అడి గాడు ఆర్ముగం. అతని కళ్ళ వెంట నీళ్ళు తిరిగాయి.

"అచ్చే! వాడు వూరికే ఆమాట అనడంలేదు. కత్తి పిడిమీద నీవేలి ముద్రలు వున్నాయంట!"

"ఆదా సార్! నన్ను చాలా అపార్థం చేసుకున్నారు సార్. నిన్న సాయంత్రం కళ్యాణరావుగారు నన్ను పిలిచి యీ కత్తిని శుభ్రంగా కడిగి యిమ్మన్నారండి. ఎందుకని అడిగినా సమాధానం చెప్పలేదు సార్. నా కెందుకులే అనుకొని కత్తిని శుభ్రంగా కడిగి కళ్యాణ రావుగారికి యిచ్చాను. బహుశా అప్పుడు నా వేలిముద్రలు పడివుంటాయి" చెప్పాడు ఆర్ముగం.

"ఆర్ముగం, నువ్వేం సిగరెట్ కాలుస్తావ్?" అడిగాడు పార్వతీశం.

తల గోక్కుంటూ చెప్పాడు ఆర్ముగం. "సిగరెట్ ఎప్పుడూ త్రాగను బాబూ! ఎప్పుడన్నా ఘుంట మార్కు బీడీలు త్రాగుతూంటాను" జేబులోంచి బీడీ కట్ట తీసి చూపించాడు.

"ఇదిగో ఆర్ముగం, మరణించిన మాధవరావుగారి పిడి కిలిలో ఈ రాగి బిళ్ళ చిక్కుకొని వుంది. ఈ యింట్లో

యిది ఎవరు ధరిస్తారో చెప్పగలవా?" జేబులోంచి ఆంజనేయస్వామి బిళ్ళతీసి చూపించాడు.

ఆ రాగి బిళ్ళను చూసి ఆశ్చర్యపోయాడు ఆర్ముగం.

"ఇది ఒకవారం రోజుల క్రితం పీతాంబరంగారు మోజుపడి కొనుక్కొచ్చుకున్నారు సార్. నేను గూడా ఒకటి కొనుక్కుందామని రేటు అడిగినా చెప్పలేదు సార్!"

"ఆల్ రైట్! నువ్వు రాత్రి పూట యిక్కడే పడుకుంటావా?" అడిగాడు గిరీశం.

"లేదు సార్. తోటలోని అవుట్ హౌస్‌లో నాకు బస ఏర్పాటు చేశారు బాబుగారు. అక్కడే పడుకుంటాను."

"ఆర్ముగం, మాధవరావుగారి హత్య సమయంలో నీకేమైనా ఎలిబీవుందా?" అడిగాడు పార్వతీశం.

"ఒంటరివాడ్ని, నాకు ఎలిబీ ఏం వుంటుంది సార్. అన్నట్టు మరిచాను, రాత్రి మా స్నేహితుడొకడు పది గంటలకు అవుట్ హౌస్‌కువచ్చి బలవంతంగా సినిమాకు లాక్కుపోయాడు, అతనికి బోర్‌గా వుందని. కావాలంటే అతనితో చెప్పిస్తాను."

"ఎవరు మీ స్నేహితుడు?"

"రాందాసు అని ఈ ప్రక్కనేవున్న లిబర్టీలో ఆపరేటర్‌గా పనిచేస్తున్నాడు."

"వెరీగుడ్! మాకు చాలా విలువైన సమాచారాన్ని అందించావు. ఇక నువ్వు వెళ్ళవచ్చు," చెప్పాడు గిరీశం.

నమస్కారంచేసి బయటకు వెళ్ళిపోయాడు ఆర్ముగం.

పార్వతీశం గిరీశం వైపు ఆశ్చర్యంగా చూశాడు.

"ఏమిటి గురూ! కేసు సాలెగూడులా తయారవుతున్న దేమిటి?"

"అంతే మరి, ఈ సాలెగూడుకు కేంద్ర బిందువు కను

కోవాలి" గర్వంగా భుజ ఎగరేస్తూ అన్నాడు గిరీశం.

"డిటెక్షనంటే చాలా కష్టమే గురూ!" గొణిగాడు పార్వతీశం.

# 9

"కూర్చోండి కళ్యాణరావుగారూ!" కుర్చీ చూపించాడు గిరీశం.

కళ్యాణరావు కుర్చీలో కూర్చున్నాడు.

"ఏమిటో యీ మధ్య హత్యలన్నీ ఆస్తికోసమే జరుగుతున్నాయండి. డబ్బు మహాపాపిష్టిది సుమండీ!" అన్నాడు గిరీశం.

"మీరేమంటున్నారో నా కర్థం కావడం లేదు" కోపంగా అన్నాడు కళ్యాణరావు.

"మొట్టమొదట మా పార్వతీశం అన్నప్పుడు నాకూ అర్థం కాలేదు. ఆ తరువాత ఆధారాలు, అవకాశాలు చూసిన తరువాత నమ్మక తప్పడంలేదు."

"ఏమన్నారు మీ పార్వతీశం?"

"మీ అన్నయ్యకు మీకు మధ్య మనస్పర్థలు వున్నాయని, మీ అన్నయ్య వీలునామా వ్రాయకుండా హఠాత్తుగా మరణిస్తే ఆస్తిలో వాటా మీకు వస్తుందని చెప్పాడు. దానినిబట్టి మీరే యీ హత్య చేశారని, అందుకు ఆధారాలున్నాయని మా పార్వతీశం వాదిస్తున్నాడు" చెప్పాడు గిరీశం, పార్వతీశాన్ని చూసి కన్ను గొడుతూ.

తెల్లబోయి చూశాడు కళ్యాణరావు.

"గిరీశంగారూ. మీరేం మాట్లాడుతున్నారో నాకర్థం కావడంలేదు. నేను మా అన్నయ్యను హత్య చేయడమేమిటి? మీరూ, మీ పార్వతీశంగారు ఎందుకలా వూహిస్తున్నారో నా కర్థం కావడంలేదు" ఆందోళనగా అన్నాడు.

"నిన్న మీ అన్నయ్యతో ఘర్షణ పడ్డారట గదా?" అడిగాడు పార్వతీశం ధీమాగా.

కళ్యాణరావు ముఖం పాలిపోయింది.

"గిరీశంగారూ, ఆ ఘర్షణను దృష్టిలో పెట్టుకొని నన్ను హంతకుడుగా వూహించడం దారుణం! నాకు మా అన్నయ్య అంటే చాలా ప్రేమ. అయితే జూదానికి బానిసనై తాత్కాలికంగా అన్నయ్యతో డబ్బు కోసం ఘర్షణ పడుతుంటాను. నిన్న గూడా ఒక పెద్ద ఘర్షణ జరిగింది. అంతమాత్రాన హత్య చేసేటంత నీచుడ్ని కాదు గిరీశంగారూ," గొల్లున గొడవ పెట్టాడు కళ్యాణరావు.

"చూడండి కళ్యాణరావుగారూ, మేం కూడా కేవలం మాటలకే అనుమానించాం. చేతలలో గూడా మీపై అనుమానం వుంది" అన్నాడు గిరీశం.

"ఏమిటది?" ఆశ్చర్యంగా చూశాడు కళ్యాణరావు.

"కళ్యాణరావుగారూ, ఈ కత్తిని మీరెప్పుడైనా చూశారా?" కత్తి చూపిస్తూ అడిగాడు పార్వతీశం.

"ఆఁ. చాలా సార్లు చూశాను. ఆ కత్తి మా బావ బీరువాలో వుంటుంది."

"దటీజ్ కరెక్ట్! ఇదే రావుగార్ని హత్య చేసిన ఆయుధం. దీని పిడిమీద మీ వేలిముద్రలు వున్నాయి. ఇప్పుడు మిమ్మల్ని హంతకుడనడంలో తప్పు లేదుగా!"

"నో!" గట్టిగా అరిచాడు కళ్యాణరావు.

"ఇదేదో పెద్ద కుట్ర సార్! కత్తి పిడిమీద నా వేలి ముద్రలు కనబడగానే నన్ను హంతకుడనడం అన్యాయం సార్! నేను అప్పుడప్పుడు ఆ కత్తిని వుపయోగిస్తుంటాను. మొన్న సాయంత్రం కూడా ఆ కత్తిని వుపయోగించుకున్నాను. మొన్న శనివారం కాబట్టి, రాత్రిపూట భోజనం చేయను. అందుకని బజారునుండి తెచ్చిన ఏపిల్

కాయలను ఆ కత్తితోనే కోసుకొని తిన్నాను. అంత కన్నా ఆ కత్తి గురించి నాకు తెలియదు. ఇక మీ యిష్టం!" సర్వం త్యజించిన విరాగిలా అన్నాడు కళ్యాణ రావు.

"ఆర్ రైట్, యీ రేకుబిళ్ళ మీకు తెలుసా?"

"నాకు తెలియదు. నేనెప్పుడు చూడలేదు."

"ఈ రేకుబిళ్ళను పీతాంబరం, మెడలో ధరిస్తాడని విన్నాను. నిజమేనా?"

"సారీ సార్! వాడు త్రాగుబోతు వెధవ! వాడి గురించి నేనేమీ పట్టించుకోను."

"మీరు ఏ బ్రాండ్ సిగరెట్ కాలుస్తారు?"

"నేను చాలా కాలంబట్టి సిజర్స్ వాడుతున్నాను," పాకెట్‌లోంచి పెట్టె తీసి చూపించాడు కళ్యాణరావు.

"చివరి ప్రశ్న. ఇందులోనయినా మీ నిజాయితీని చాటుకోవచ్చు! హత్య జరిగిన సమయంలో మీకు పటిష్టమైన ఎలిబీ వుందా?" అడిగాడు గిరీశం.

కళ్యాణరావు ముఖం పాలిపోయింది.

"సారీ సర్! డబ్బుంటే క్లబ్బులో పిచ్చిగా పేకాడుతూ వుండేవాడిని. నిన్న చేతిలో రూపాయి లేక పోవడంతో ఉదయం నుండి రోడ్లవెంట పిచ్చిగా తిరుగుతూ పానగల్ పార్కులో పడి నిద్రపోయాను. లేచేటప్పటికి తెల్లవారి పోయింది. దీనికి సాక్షులు ఎవరూ లేరు సార్!" దీనంగా చెప్పాడు.

"ఆల్ రైట్! మీరు వెళ్ళండి. అవసరమైతే మళ్ళీ పిలుస్తాను" సిగరెట్ ముట్టించుకుంటూ అన్నాడు గిరీశం.

"థాంక్యూ సార్!" అంటూ బయటకు నడిచాడు కళ్యాణరావు.

"ఏమిటి గురూ, యీ మిష్టరీ అర్థం కావడం లేదు.

ఎవడు జూసినా హంతకుడు లాగానే వున్నాడు. నువ్వేం దర్శి హంతకులనే అంటున్నావ్?'' ఆశ్చర్యపోతూ అడిగాడు పార్వతీశం.

''ఇదిగో పార్వతీశం, పిల్ల డిటెక్టివ్ కేం తెలుసు పెద్ద వాళ్ళ పథకాలు. ఇలా ఓ పది హత్య కేసులు నేను పరి శోధిస్తుండగా చూడు. పదకొండో కేసు నువ్వే పరిశో ధిస్తావు,'' బొజ్జ ఎగిరెగిరి పడుతూండగా నవ్వుతూ అన్నాడు గిరీశం.

''ఏమిటి గిరీశం నవ్వుతున్నావ్? హంతకుడు దొరి కాడా?'' హుషారుగా లోపలకు వచ్చి అడిగాడు ఇన స్పెక్టర్ చిదంబరం.

''ఆఁ. హంతకుడు మెడవరకు దొరికాడు. ఇంకా తల దొరకాలి. ఆ మిగిలిన వాడ్ని కూడా పంపించు,'' మరో సారి కుర్చీ వూగించి గిరీశం నవ్వుకు.

# 10

''గిరీశంగారూ, బాపను హత్య చేసిన హంతకుడ్ని వురి కంబం ఎక్కించడానికి నేనేం సహాయం చేయగలనో చెప్పండి'' ఉద్రేకంగా అన్నాడు పీతాంబరం.

''క్షమించాలి! మీ సహాయం అవసరం లేదు. హంతకు డెవరో మాకు తెలిసి పోయింది,'' అన్నాడు గిరీశం.

''ఎవరతను? ఎలా కనిబెట్టారు మీరు?'' కుతూహ లంగా అడిగాడు పీతాంబరం.

''ఇంత చిన్న హత్యను నేను గూడా పరిశోధించాలా? మా శిష్యుడు పార్వతీశం పరిశోధించి హంతకుడ్ని ఆధా రాలతో సహా కనిబెట్టేశాడు. ఇంతకీ ఆ హంతకుడు ఎవరో కాదు, మీరే!'' తాపీగా అన్నాడు గిరీశం.

ఆ మాట విని అదిరిపోయాడు పీతాంబరం.

"గిరీశం, నువ్వు ఎవరితో మాట్లాడుతున్నావో తెలుసా? కాస్త ఒళ్లు దగ్గర పెట్టుకొని మాట్లాడు" ఉద్రేకంగా అరిచాడు.

"గురూ, వీడిని చూస్తుంటే మనల్ని ఉతికేసేటట్లున్నాడు," చిన్నగా వణికాడు పార్వతీశం.

"వాడి మొహం, వాడికి మందు నేను వేస్తానుగా" అంటూ "మిష్టర్ పీతాంబరం, యీ హత్య నువ్వు చేసావని ఆషామాషీగా అనడం లేదు. అందుకు ఆధారాలు వున్నాయి. నిన్న మీ బావతో పోట్లాడావు. 'ఆ బొందిలో ప్రాణాలు ఎంతకాల ముంటాయో నేనూ చూస్తాను' అంటూ తీవ్రమైన పదజాలాన్ని వాడావు. ఆ మాటకు చాలు నిన్ను అరెస్ట్ చేయవచ్చు! అంతే కాదు, హత్యాప్రదేశంలో ఓ సిగరెట్ పీక దొరికింది. అది నువ్వు కాల్చే పనామా బ్రాండ్! అవునా?" అడిగాడు గిరీశం.

పులిలా మాట్లాడిన పీతాంబరం పిల్లిలా మారిపోయాడు.

"గిరీశంగారూ, నే నా హత్య చేయలేదు. నన్ను నమ్మండి. ఏదో వుద్రేకంలో బావతో ఘర్షణ పడ్డంత మాత్రాన బావను హత్య చేసేటంతటి నీచ స్వభావం నాలో లేదు. నన్ను చిన్నతనం నుండి మా బావే పెంచాడు. నన్ను నమ్మండి."

"మరి నీ సిగరెట్ పీక అక్కడెందుకు వచ్చింది?" ఈ సారి ధైర్యంగా అడిగాడు పార్వతీశం.

"అదే నాకూ అర్థం కావడంలేదు సార్. అసలు నేను మా బావ ముందు సిగరెట్ త్రాగను."

"ఆల్ రైట్, ఈ ఆంజనేయస్వామి బిళ్ళ చూడండి. ఇది మీదే కదూ!" బిళ్ళను చూపిస్తూ అడిగాడు గిరీశం.

"అయామ్‌సారీ, ఆ బిళ్ళను నేనెప్పుడూ చూడలేదు."

"మిస్టర్, మీరు అబద్ధం ఆడుతున్నారు. ఆ బిళ్ళ మీది. నాలుగు రోజుల క్రితం మీరు మోజుపడి కొనుక్కున్నారు. అది మీ మెళ్లోనే ధరించేవారు. మీ బావగారిని హత్య చేసేటప్పుడు జరిగిన పెనుగులాటలో ఆ బిళ్ళ మీ బావగారి చేతిలో చిక్కుకొంది. ఆ బిళ్ళ మీదంటే హంతకుడి నవుతాననే భయంతో 'నాది' కాదంటున్నారు. అయినా నేరం దాగదు. మీరు హంతకులే!" గర్జించాడు గిరీశం.

"గిరీశంగారూ, మీరు నమ్మండి, నమ్మకపొండి, నేను చెప్పేది మాత్రం యదార్ధం. నేను దేవుడ్ని నమ్మను. పరమ నాస్తికుడ్ని. సో, నేను కనీసం కలలోగూడా అలాంటి బిళ్ళలను కొనను, ఈ విషయం మీరు నమ్మకపోతే, మీ యిష్టం!"

"ఆల్‌రైట్, మీ నిర్దోషిత్వాన్ని ఋజువు చేసుకోవడానికి మరో ఛాన్స్ యిస్తున్నాను. హత్యాసమయంలో మీరు ఎక్కడ వున్నారో చెప్పగలరా?"

"నిన్న ఘర్షణ జరిగిన తరువాత అసలు యీ యింటి ఛాయలకేసి కూడా రాలేదు. మస్తుగా త్రాగేసి రీటాతోనే గడిపేశాను తెల్లవారేవరకు. మీరు నమ్మితే రీటా చేత సాక్ష్యం యిప్పిస్తాను," చిన్నగా తలవంచుకొని అన్నాడు.

"వెరీ గుడ్! మళ్ళీ కబురు చెప్తాను. వెళ్ళండి" కుర్చీలో వెనక్కి వాలుతూ అన్నాడు గిరీశం.

పీతాంబరం కుర్చీలోంచి లేవబోతూంటే హఠాత్తుగా తుమ్మాడు పార్వతీశం.

"ఛీ వెధవా! ఎప్పుడు పడితే అప్పుడు తుమ్మడమేనా? సారీ పీతాంబరంగారూ, కాసేపు కూర్చొని వెళ్ళండి" సంజాయిషీ చెబుతూ అన్నాడు గిరీశం.

చిన్నగా నవ్వాడు పీతాంబరం.

"ఫర్వాలేదు సార్! నా కలాంటి నమ్మకాలు గూడా ఏవీ లేవు," కుర్చీలోంచి లేచి ఓ నమస్కారం చేసి బయ టకు వెళ్ళిపోయారు.

గిరీశం పార్వతీశాని కేదో సైగ చేసి ఆ గదిలోంచి బయ టకు నడిచాడు.

చిన్న సైజు పర్వతంలా నడుస్తూ వస్తున్న గిరీశాన్ని చూడగానే అందరి కళ్ళు ప్రశ్నార్థకంగా వెడల్ప య్యాయి.

"గిరీశం, హంతకుడు తలవరకు దొరికాడా? ఇంకా మెడవరకే వున్నాడా?" ఆదుర్దాగా అడిగాడు ఇన్ స్పెక్టర్ చిదంబరం.

అందరివైపు చూసి ముసిముసిగా నవ్వాడు గిరీశం.

"నెత్తిమీద జుత్తుతో సహా లాక్కొచ్చాను" అన్నాడు.

"ఏడీ?" అంతా ఆశ్చర్యంగా చూశారు.

"చిదంబరం, మాధవరావుగారి పర్సనల్ బోయ్ ఆర్ముగం ఈ హత్య చేశాడు. అతడ్ని అరెస్ట్ చేయండి" గంభీరంగా అన్నాడు గిరీశం.

ఆర్ముగంతో బాటు అంతా నిశ్చేష్టులైపోయారు.

"గిరీశంగారూ, అన్యాయంగా నన్ను అనుమానించి అరెస్ట్ చేయిస్తున్నారు. నేను మీకు ఏం ద్రోహం చేశాను?" ఆందోళనగా అడిగాడు ఆర్ముగం.

"మిస్టర్ ఆర్ముగం! ఈ గిరీశం ఒకరికి సహాయం చేస్తాడు కానీ, అన్యాయం చెయ్యడు, నిన్ను కేవలం అను మానంమీద అరెస్ట్ చేయడంలేదు. ఆధారాలతో సహా అరెస్ట్ చేస్తున్నాం.

ఆర్ముగం, నువ్వు మాధవరావుగారిని కత్తితో పొడిచి

హత్య చేశావు. ఆ కత్తిపిడిమీద నీ వేలిముద్రలు పడ్డాయి. అయితే అంతకుముందే ఆ కత్తిని వుపయోగించిన కళ్యాణరావు వేలిముద్రలు కూడా దానిమీద వున్నాయి. అవి నీకు కొంత వుపయోగపడ్డాయి. నన్ను కాస్త తికమక పెట్టాయి.

ఆ కత్తిని కళ్యాణరావు నిన్న సాయంత్రం శుభ్రపరచడానికి యిచ్చాడని, నీవు శుభ్రం చేసి యిచ్చావని చెప్పావు. కానీ అది అబద్ధం! కళ్యాణరావు నిన్న ఘర్షణ పడిన తరువాత యింటికి తిరిగి రాలేదు. ఇక పోతే ఆ కత్తి పిడిమీద కళ్యాణరావు వేలిముద్రలు వుండటానికి, అతగాడు చెప్పిన కారణం సమంజసంగానే వుంది. ఆ కత్తి పిడికి సమీపంలో అంటివున్న ఆపిల్ గుజ్జు ఆయన మాటను ఋజువు చేసింది. ఇకపోతే మిగిలిన వేలిముద్రలు నీవే గనుక, నువ్వు హంతకుడివనడంలో తప్పులేదు.

అదీగాక, హతుని చేతిలో చిక్కబడిన ఆంజనేయస్వామి పీతాంబరానిదని చెప్పావు. కానీ అది పీతాంబరానిది కాదు. అతను నాస్తికుడు, ఆ విషయాన్ని నేను ఋజువు చేసుకున్నాను. ఆ విషయంలో నువ్వు అబద్ధం చెప్పావు కాబట్టి, ఆ బిళ్ళ నీదేనని వూహించడంలో పొరబాటు లేదనుకుంటా!

మరో ముఖ్యమైన విషయం, నువ్వు యీ కేసులో పీతాంబరాన్ని యిరికించాలని చూశావు. అందుకు గట్టి ప్రయత్నంగా పీతాంబరం త్రాగే సిగరెట్ పీకను, సంపాదించి హత్యాప్రదేశంలో పడేశావు. అది నే నెలా కనుక్కున్నానా అని ఆశ్చర్యబోకు. ఆ సిగరెట్ పీకకు అంటిన మట్టి రేణువులు నిన్ను తేలికగా పట్టిచ్చాయి. పీతాంబరం మాధవరావుగారిముందు సిగరెట్ త్రాగాడు.

అతగాడు తోటలో త్రాగుతూ పడేసిన సిగరెట్ పీకను తేలికగా సంపాదించడానికి, తోటలో వుండే అవుట్ హౌస్‌లో వుంటున్న నీకే సులభం!

ఇక చివరి కారణం, హత్య జరిగిన సమయం మాకు ముందే తెలిసినా, కావాలని ప్రకటించలేదు. మిమ్మల్నందర్నీ క్రాస్ ఎగ్జామినేషన్‌లో ఆ విషయమై టెస్ట్ చేశాను. కళ్యాణరావు, పీతాంబరాలకు హత్యా సమయం తెలియదు కాబట్టి, వారు పెద్దగా ఎలిబీలను గురించి ప్రయత్నించలేదు. అదీగాక వారు తమకు రాత్రి సరియైన ఎలిబీ లేనందుకు భయపడ్డారు కూడా! కానీ హంతకుడవయిన నీకు హత్యజరిగిన సమయం కరెక్టుగా తెలుసు కాబట్టి, సరిగ్గా ఆ సమయానికే పటిష్టమైన ఎలిబీని సమకూర్చుకున్నావు" గిరీశం తన గంభీరమైన కంఠంతో చెప్పడం ముగించాడు.

ఆర్ముగం అవమానంతో తలవంచుకున్నాడు.

చిదంబరం, ఆర్ముగం చేతులను సంకెళ్ళతో అలంకరించాడు.

"సార్, మీరు నన్నే హంతకుడినంటే అదిరిపోయాను సార్. మీ మేధాశక్తికి కృతజ్ఞతలు సార్!" సంతోషంగా అన్నాడు కళ్యాణరావు.

"మీరు నన్ను గూడా హంతకుడనే అన్నారుగా సార్. అయినా చివరలో అసలైన హంతకుడిని చాలా తెలివిగా పట్టుకున్నారు సార్!" ఆనందంగా అన్నాడు పీతాంబరం.

"గిరీశంగారూ, ఆర్ముగం చాలా మంచివాడు సార్. నాలుగేళ్ళుగా మా అందరిలో ఒకడిగా తిరుగుతున్నాడు. ఆర్ముగం హత్య చేశాడంటే నేనే నమ్మలేకపోతున్నాను. దానికి కారణం చెప్పగలరా సార్!" ప్రాధేయ పూర్వ

కంగా అడిగింది శోభారాణి.

రమానంద్‌తో సహా అంతా గిరీశంవైపు కుతూహలంగా చూశారు.

"సారీ డియర్ ఫ్రండ్స్! ఆర్ముగం ఎందువలన యీ హత్యచేశాడో నాకూ అర్థంకాలేదు. అతను చెబితే విందామని నేనూ ఎదురుచూస్తున్నాను" ఆర్ముగంవైపు చూస్తూ అన్నాడు గిరీశం.

ఆర్ముగం అందరివైపు ఒక్కసారి చూసి వణుకుతున్న కంఠంతో గొంతు విప్పాడు.

"గిరీశంగారూ, నేను నేరం అంగీకరిస్తున్నాను. నేను మాధవరావుగార్ని హత్యచేశాను. నన్ను ఉరితీయండి. కానీ ఆ హత్య ఎందుకు చేశానో నన్ను అడగకండి. దానికి చాలా పెద్ద కథ వుంది. దానిని నేను చెప్పదలచుకోలేదు, క్షమించండి" కళ్ళవెంట నీళ్ళు తిరుగుతూండగా అన్నాడు ఆర్ముగం.

డిటెక్టివ్‌లతో సహా అంతా ఆర్ముగంవైపు ఆశ్చర్యంగా చూశారు.

* * *

దాదాపు పాతికేళ్ళక్రితం మాధవరావు సినిమా రంగంలో ప్రవేశించిన కొత్తలో రాజ్యం అనే అమ్మాయితో పరిచయమైనదని, ఆ పరిచయం అభివృద్ధిచెంది పరిణయంవరకు రాగా, రాజ్యం మాధవరావును నమ్మి తన సర్వస్వం అర్పించిందనీ, ఆ తరువాత మాధవరావు రాజ్యాన్ని మరిచి తన అభివృద్ధికి పెద్ద సోపానమైన హీరోయిన్ లలితని పెళ్ళి చేసుకున్నాడని, అతనిని నమ్మి మోసపోయిన రాజ్య మరొకరిని నమ్మలేక మాధవరావునే

మనసులో పూజించుకుంటూ ఓ కొడుకును కన్నదని, ఆ కొడుకుకు పదహారు సంవత్సరాల వయస్సు రాగానే మాధవరావు గురించిన విషయం పూర్తిగా చెప్పి కన్నుమూసిందని, ఆ కొడుకే ఆర్యోగమని, అతగాడు తన తండ్రియైన మాధవరావు దగ్గరే పర్సనల్ బోయ్‌గా చేరి అభిమానాన్ని సంపాదించుకొని, ఆ తరువాత తండ్రిని పీతాంబరం, కళ్యాణరావులు పీడించడం చూసి సహించలేక తనను తాను పరిచయం చేసుకొని, తనను కొడుకుగా స్వీకరిస్తే వీరందరి ఆటలు కడతాయని నచ్చచెప్పాడని, మాధవరావు యీ విషయం నమ్మక ఆర్యోగాన్ని దుర్భాషలాడాడని, అంతటితో ఆగక ఆర్యోగం తల్లి రాజ్యాన్ని నీచంగా భావిస్తూ మాట్లాడాడని, దైవసమానురాలైన తన తల్లిని తిట్టడం సహించలేక ఆర్యోగం కేవలం క్షణికావేశంలో అక్కడున్న కత్తితో పొడిచేశాడని, ఆ దెబ్బ ఊహించనంత తీవ్రంగా తగిలి మాధవరావు చనిపోయాడని మాత్రం ఎవరికీ తెలియదు.

—: ఐపోయింది :—

# చట్టంతో చెలగాటం

## సుజనశ్రీ

"పార్వతీ! నామాట విను ఈసారికి!" రమేష్ లాలనగా అడిగాడు.

"నీవు ఎన్నన్నా చెప్పు రమేష్! ఈ విషయంలో నీ మాట వినను. వినలేను! ఇన్నాళ్ళలో ఎప్పుడన్నా నీమాట కాదన్నానా?" పార్వతి సముదాయిస్తూ అంది.

"అంతేకాని నామాట విననంటావ్?"

"ఇక ఆ ప్రసంగం ఆపు! మీ ఫ్యాక్టరీలో పని ఎలా ఉంది? నీ చదువుని అంతటితో స్వస్తి చెప్పడమేనా? ప్రైవేటుగానన్నా పరీక్షలకి కట్టకూడదూ?"

రమేష్ మాట్లాడలేదు.

"ఏం కోపం వచ్చిందా?" అని అతని గడ్డాన్ని పుచ్చు

కుని అతని ముఖాన్ని తన వేపుకు తిప్పుకుంది పార్వతి.

"కోపమా, తాపమా? అయినా నిన్ను కోప్పడడానికి నే నెవరిని?" నిష్ఠురంగా అన్నాడు రమేష్.

"అదుగో ఆ మాటే అనవద్దని! నేను నీకేమీ కాక పోతే ప్రతి రాత్రీ ఎందుకు వస్తావ్ ఇక్కడకు?" అంటూ అతడిచుట్టూ చేతులువేసి తనకేసి హత్తుకుంది.

రమేష్‌కి మాట్లాడే అవకాశం లేకుండా పోయింది.

మేడ మెట్లెక్కుతూ రమేష్ క్రితం రాత్రి జరిగిన సంభాషణను గుర్తుకు తెచ్చుకుంటున్నాడు. ఏమైనాసరే ఈ రాత్రి తనమాట నెగ్గించుకు తీరాలి.

తనా కేవలం కాటన్ మిల్ లో టెక్నికల్ మేస్త్రీగా పనిచేస్తున్నాడు. తనకు జీతం రెండువందలు మాత్రమే. అందుకే తను ఇన్నాళ్ళూ పెళ్ళి చేసుకోకుండా ఏకాకిగా ఉండిపోయాడు. తనకు ముందూ వెనకా ఎవరూలేరు.

తనతోటి వాళ్ళు, తనకన్న తక్కువ జీతం తెచ్చు కుంటున్న వాళ్ళూ, పెళ్ళిళ్ళు చేసుకుని కాపరాలు చేస్తు న్నారు, కాని తను జీవితాన్ని ఎంతో అందంగా చిత్రించు కుని తీయని కలలు గన్నాడు. అవన్నీ కలలుగానే ఉండి పోయి, నిజజీవితంలో తను కేవలం కూలీవాడుగా స్థిరపడి పోయాడు.

హైస్కూలు చదువు తండ్రి మరణంతో ఆగిపోయింది. తన తండ్రికి తెలిసిన వాళ్ళను పట్టుకుని ఎలాగో తిప్పలు పడి ఈ పని సంపాదించుకో గలిగాడు.

ఒకసారి తను సిటీలో గుడ్డలకొట్టు కెళ్ళాడు చౌకా గుడ్డలు కొనాలని. అక్కడే సేల్స్‌గరల్ గా పనిచేస్తున్న పార్వతి అతడ్ని ఆకర్షించింది. ఆమెతో పరిచయం పెంచుకున్నాడు.

పెళ్ళంటే భయంతో పెళ్ళి వాయిదా వేసిన వ్యక్తి,

రెండో కంటికి తెలియకుండా పార్వతిని గుళ్ళో పెళ్ళి చేసుకున్నాడు.

పార్వతి గతచరిత్ర అంతా రమేష్‌కు తెలుసు.

పార్వతి ఎవరినో కులంగానివాడ్ని ప్రేమించింది. ఆమె తండ్రికి సిటీలో మంచిపలుకుబడి ఉంది. ఒక్కతే కుమార్తె. తండ్రిని కాదని, తను ప్రేమించిన వ్యక్తిని పెళ్ళాడింది. దాంతో తండ్రికీ ఆమెకూ సంబంధం తీరి పోయింది.

అయితే పార్వతి జీవితం మరో విధంగా మలుపు తిరిగింది. ఏ వ్యక్తికోసం కన్నతండ్రినీ, అతడి డబ్బునీ కాలదన్నుకుని వచ్చిందో, ఆ వ్యక్తి రెండు సంవత్సరాలన్నా తిరగకముందే లారీ ఏక్సిడెంట్‌లో చనిపోయాడు.

అభిమానవతి అయిన పార్వతి దుఃఖంతో కుమిలి పోయిందేగానీ, తండ్రిని కలవలేదు. తన ఒక్క పొట్టే అయినా గడవాలిగదా? అందుకే గుడ్డలకొట్లో సేల్స్ గరల్‌గా చేరింది. తను పనిచేసే క్లాత్ షాప్‌కి దూరంగా నవాబుపేటలో కాపురముంటోంది. ఆ భవంతి రెండంతస్తుల మేడ. అందులో ఎక్కువగా ఉద్యోగాలు చేసే ఒంటరి ఆడవాళ్ళే ఉంటున్నారు.

పార్వతీ, తనూ మరో ఇల్లు వెతుక్కుందామన్నాగాని, సరైన ఇల్లు దొరక్క అలాగే వేరువేరుగానే ఉంటున్నారు. రాత్రి డ్యూటీ లేకపోతే రమేష్ ఆమె నివాసానికి చేరుకుంటాడు.

ఆ రోజు బాగా పొద్దుపోయింది. పార్వతి తను రాదనుకుంది గాబోలు పడుకున్నట్టుగా ఉంది. రమేష్ తలుపు తట్టాడు. పార్వతి తలుపు తీసింది.

సంక్రాంతి రోజులు. చలి విపరీతంగా ఉంది. రమేష్ తొడుక్కున్న ఖాకీ ప్యాంటూ, చొక్కా మంచుకి తడిసి

నట్టుగా అయినయ్. అయినా వాటిని విప్పకుండానే అలాగే మంచంమీద కూర్చున్నాడు.

"చల్లగా ఉన్నట్టున్నయ్! విప్పి ధోవతి కట్టుకోగూడదూ?" పార్వతి అడిగింది.

"ఫరవాలేదులే! ఏమి చలో ఏమో!" అన్నాడు రమేష్.

"భోజనం అయిందా? లేకపోతే చెప్పండి! స్టౌ వెలిగించి వండుతాను!"

"వద్దులే! నేను భోజనం చేసే వచ్చాను. టీ ఉంటే చాలు నాకు!" రమేష్ అన్నాడు.

"ఇవాళ లేడీ డాక్టరు దగ్గరకు వెళ్ళి పరీక్ష చేయించుకుని వచ్చాను. నెల తప్పిందనే చెప్పింది ఆమె గూడ!"

"అంతేనా? ఎబార్షన్ సంగతే అడగలేదా?" రమేష్ ఆమె వంక చూస్తూ అడిగాడు.

"ఆ మాటే ఎత్తద్దని అన్నానా? నా హృదయం పిల్లలకోసం ఎంతగా తపించి పోతున్నదో నీకేం తెలుసు?"

"ఐతే నీవు పట్టిన కుందేటికి మూడే కాళ్ళంటావా?"

"రమేష్! నేను నిన్ను పునర్వివాహం ఎందుకు చేసుకున్నానంటావ్? కేవలం కామం తీర్చుకోవడానికి కాదు. అసలు ప్రకృతిలో స్త్రీ పురుష సాంగత్యం ఎందుకు ఏర్పడిందంటావు? కేవలం సంతానోత్పత్తి కోసమే! కాని స్వార్థం పెరిగిపోయిన మానవులు ఆ సంతానం ఉత్పత్తి కాకుండా మార్గాలు కనిపెట్టి, సౌఖ్యం అనుభవించటమే నేర్చుకున్నారు."

"చాల్లే! నీ లెక్చరు ఆపు! మనిద్దరి జీతం కలిపినా మనం సుఖంగా జీవించలేం! ఇక పిల్లలు పుడితే మనమేం తింటాం? వాళ్ళకేం పెడతాం? చిరిగిపోయిన చొక్కాలతో చింపిరి జుట్టుతో బజార్ల వెంబడి తిరిగే పిల్లవాళ్ళు తయారవుతారు.

వాళ్ళా మన బిడ్డలు? వద్దు పార్వతీ! అలాంటి సంతానాన్ని కనేకంటే, బిడ్డలు లేకుండా ఉండటమే మేలు!"

"కేవలం ఒక్క మగపిల్లవాడు చాలు, మన ముద్దూ మురిపెం తీరటానికి!"

"వెనకటికి ఒకాయన మగపిల్లవాడు కావాలని ఎదురు చూస్తే, వరుసగా ఆరుగురు ఆడపిల్లలే కలిగారట. అలా అయితే మనకు గూడ!"

"కాదు! నా మనసు చెబుతోంది మనకు మగపిల్లవాడే పుడతాడని!" అంది పార్వతి టీ అందిస్తూ.

గబగబ టీ త్రాగేశాడు రమేష్.

"మా షాప్‌లో ప్యాంటు పీసెస్ చాలా చౌకగా అమ్మేస్తుంటే నీ కోసమని రెండు తీసుకున్నాను! చూపిస్తానుండండి!" అని పార్వతి లేవబోయింది.

"ఆగు! ఏదో వంకతో ప్రసంగం మార్చాలని చూస్తావ్! నేను చెప్పిన మాట వినకపోతే నన్ను శాశ్వతంగా దూరం చేసుకుంటావ్!" తన బెదిరింపుల పొదిలోంచి ఆఖరి బాణాన్ని వదిలాడు.

"హుం! నాకు తెలుసు! మీకు జీవితమంటే భయం! అనుభవం అంటే భయం! ఆఖరికి మీ నీడను చూసి మీరే దడుచుకుంటారు!"

ఆమె మాటల్ని రమేష్ వినిపించుకోలేదు. విసురుగా లేచాడు.

అతడి కోపాన్ని చూసి పార్వతి అతడ్ని ఆపుకోలేక పోయింది. వెళ్ళిపోతూన్న రమేష్‌వంక అలాగే చూస్తూ ఉండిపోయింది. ఆ తర్వాత తలుపు మూసి లోపల గడియ పెట్టుకుంది. నిట్టూరుస్తూ వచ్చి బెడ్ మీద వాలిపోయింది.

రమేష్ నిజంగా తనకు శాశ్వతంగా దూరమైపోతాడా? తనను వదిలి అతడు ఎంతవరకు నిగ్రహించుకోగలడు.

ఆడదాన్ని భయపెట్టటానికి మగవాళ్ళ బెదిరింపు ఇలాగే ఉంటుందిలే అనుకుంది మళ్ళీ. పార్వతి తనలో తనే నవ్వుకుంటూ నిద్రబరువుతో కళ్ళు మూసుకుంది.

# 2

ఎముకలు కొరికే చలి. కోపంగా, వేడెక్కిన నరాలతో రోడ్డుమీదకు వచ్చిన రమేష్ చలికి గడగడ వణికాడు.

హాయిగా పరుపుమీద వెచ్చగా పార్వతి కౌగిలిలో ఉండవలసిన తను, అలిగి ఇలా రోడ్డెక్కాడు. ఇప్పుడు ఎక్కడకు వెళ్ళాలి? తన రూమ్‌కి వెళ్ళటానికి సిటీ బస్‌లు కూడ లేవు. నడిచి వెళ్ళాలంటే ఏడెనిమిది మైళ్ళు వెళ్లాలి. ఈలోపల చలికి కాళ్ళూ చేతులూ కొంకర్లుపోయి, తను గడ్డకట్టుకు పోకుండా ఉంటే!

పెరిగిపోయిన ధరలతో, తనే జీవితాన్ని ఎలాగో గడుపుతున్నాడు. ఇక ఇలాంటి జీవితాల్లోకి మరో వ్యక్తిని ప్రవేశపెడితే ఇంకేమన్నా ఉందా? అయినా ఒక ప్రక్క ప్రభుత్వం సంతానాన్ని కనడం వాయిదా వెయ్యండో అని ప్రచారం చేస్తూండడంగా, గర్భస్రావాన్ని చట్టబద్ధం చేస్తుంటే, పార్వతి అలా మంకుపట్టుతో కూర్చోవటం అతనికి సుతరామూ నచ్చలేదు.

పేవ్‌మెంట్ మీద ఆలోచనగా నడుస్తున్న రమేష్ కళ్ళకు లైటు స్తంభం క్రీనీడలో ఎవరో స్త్రీ తచ్చాడటం కన్పించింది. పాపం! ఏ అయ్యకన్న కూతురో! ఇంత రాత్రి వేళ రేపటి ఆకలి తీర్చుకోవడంకోసం తాపత్రయపడుతోంది. ఆ తండ్రిగూడ తనలాగ 'సినికల్'గా ఆలోచించి ఉంటే ఆమెకీ గతి పట్టేదా?

ఎటు చూసినా, ఎటు ఆలోచించినా అతడి ఆలోచన ఒకచోటకే చేరుకుంటోంది! తను తీసుకున్న నిర్ణయం తప్ప

కుండా ఆచరణయోగ్యం కావాలని!

తను బయటకు వస్తుంటే పార్వతి తనను అడ్డుకోలేదు. చలిలో కాసేపు తిరిగి మళ్ళీ గతిలేనట్టుగా తనవద్దకు వస్తాడులే అనుకుందా? చలి విపరీతంగా వీస్తున్నది. అతడు పిడికిళ్ళు గట్టిగా బిగించాడు వెచ్చదనంకోసం.

సినిమా హాలు సెంటర్ దగ్గరకు చేరుకున్నాడు రమేష్. హాలు కెదురుగా బార్ ఉంది. అందులోకి వెళ్ళి ఏదైనా వెచ్చగా పానీయం తాగితే ఒంట్లోకి వేడివస్తుందను కున్నాడు. ఆలోచిస్తూనే_రోడ్డు దాటుతున్నాడు రమేష్.

అంతలోనే వేగంగా కారు దూసుకు వచ్చింది. రమేష్ తప్పుకోబోయి, మంచుతో తడిసి తేమగాఉన్న నేలమీద కాలుజారి పడిపోయాడు.

'కీచ్' మంటూ కారు సడన్ బ్రేక్‌తో అతడికి దగ్గరగా ఆగిపోయింది.

"ఏమయ్యా! బ్రతకటానికి ఇష్టంలేదా?" రోడ్డుమీద జనంలోంచి ఎవరో అరిచారు.

"సమయానికి బ్రేకులు పడినయ్ కాబట్టి సరిపోయింది! లేకపోతే ఏమయేది? నీవు ఆస్పత్రిలో, నేను పోలీస్ స్టేషన్లో ఉండేవాళ్ళం!" స్టీరింగ్ ముందు కూర్చున్న స్త్రీ అంది అతడి వేపే చూస్తూ.

"అవునవును! మీదేం తప్పులేదు! వీడెవడో తాగిన మైకంలో కారుకి అడ్డంవచ్చి ఉంటాడు!" జనంలోంచి మరెవరో పలికారు.

"మీ గోలే మీదికాని అతగాడి కేమైనా దెబ్బలు తగిలాయేమో కనుక్కున్న వారెవరు?" సానుభూతిగా ఒక వ్యక్తి రమేష్‌మీదకు వంగి అతడికి తన చేయి అందించాడు.

"ఫరవాలేదు! ఇవాళ లేచినవేళ మంచిది. నాకేం

దెబ్బలు తగల్లేదు!" అంటూ నిలబడ్డాడు రమేష్.

"నా మూలంగా నీబట్టలు పాడయ్యాయి. మీ ఇంటి దగ్గర డ్రాప్ చేస్తాను రావయ్యా!" కారులోని స్త్రీ అంది.

ఆమె వంక చూశాడు రమేష్. ఆమె ఎర్రగా, నాజూకుగా ఉంది. బహుశా ఇరవయి సంవత్సరాలు ఉండచ్చేమో! బొద్దుగా ముద్దుగా, ఖరీదైన ఫారెన్ నైలక్స్ చీరలో ఆకర్షణీయంగా ఉంది.

"నేను ఇంటినుంచే వస్తున్నాను! మీరు వెళ్ళండి! థాంక్స్!" అన్నాడు రమేష్.

"ఇంటికి కాకపోతే మీ రెక్కడికి వెళ్ళాలో అక్కడే డ్రాప్ చేస్తాను!" ఆమె బ్రతిమాలుతున్నట్టుగా అంది.

రోడ్డుమీద నిలబడి వాళ్ళ మాటల్ని వింటున్న ఓ వ్యక్తి కలుగజేసుకుంటూ అన్నాడు. "అందమైన అమ్మాయి పిలుస్తుంటే బెట్టుచేస్తావేంటి? ఎక్కవయ్యా! కారెక్కు! అలాంటి అవకాశాలు అందరికీ రావు!"

రమేష్ తన చుట్టూ కలయజూశాడు. రోడ్డుమీద నిలబడ్డ మనషులు తనవంకా, కారువంకా అనుమానంగా, ఆశ్చర్యంగా చూస్తున్నారు. తను కారెక్కకపోతే ఆమె వదిలేట్టు లేదు.

రమేష్ కారు డోర్ తెరుచుకుని లోపలకు దూరాడు.

ఆమె డోర్ మూసేసి, కారుని స్టార్ట్ చేసింది.

"మీరు నన్ను మరీ మొహమాటంలో పెట్టేశారు!" అన్నాడు రమేష్.

"అదేంలేదు. నా మూలంగా నీవు క్రిందపడిపోయావు. అందుకు కనీసం ఈ మాత్రమైనా సాయంచేసి నా మనసును శాంతింప చేద్దామని... అంతే."

రమేష్ ముక్కువెంట నెత్తురు కారసాగింది. జేబులోంచి రుమాలుతీసి ముక్కుకు అదిమిపెట్టాడు.

"అయ్యో పాపం! చలికి బాధపడుతున్నావల్లే ఉంది. వెనుకసీట్లో మఫ్లర్ ఉంది! దాన్ని తలకు చుట్టుకో!" అంది ఆమె.

రమేష్ వెనక్కి వంగి మఫ్లర్ అందుకున్నాడు. దాన్ని తలకు చుట్టుకున్న తర్వాత కొంచెం వెచ్చదనం వచ్చింది.

"ఈ రోడ్డు చివరగా ఉన్న రైల్వేస్టేషన్ దగ్గర నన్ను దింపండి!"

ఆమె ఆశ్చర్యంగా చూసింది. "ఏమిటీ? ఈ రాత్రంతా స్టేషనులో పడుకుంటావా?"

అతడి అహం దెబ్బ తిన్నది. తనని రౌడీక్రిందనో, త్రాగుబోతువాడిక్రిందనో జమకట్టిందేమో ఈమె!

"అలా అని ఎందుకనుకోవాలి! ఏదైనా రైలెక్కాల్సి వెళ్తున్నానని ఎందుకనుకోగూడదూ?"

"నీ వాలకం టిక్కెట్టు కొని రైలెక్కేవాడిలా లేదు!"

భగవాన్! తనను, టిక్కెట్టు లేకుండా రైలుప్రయాణం చేసే వాడిక్రింద జమకట్టిందన్నమాట.

"రౌడీలాగానో, దొంగగానో కనబడ్డానా మీ కంటికి? అటువంటప్పుడు మీలాంటి ఒంటరి ఆడది నాకు లిఫ్టు ఇవ్వగూడదేమో!" ఆమెను దెబ్బతీయాలనే అన్నాడు.

"రోడ్డుమీద జనం నడుస్తున్నారు! నాకేం భయం!" అంది ఆమె.

రమేష్ రోడ్డుమీదకు చూశాడు. కారు స్టేషన్ దిక్కుగా పోవటంలేదు. రైల్వేస్టేషన్ నుంచి అంతకంతకూ దూరమైపోతోంది కారు.

"మీరు స్టేషన్ వైపు పోవటం లేదల్లే ఉంది. వచ్చే రోడ్డు మలుపులో ఆపండి! నేను దిగిపోతాను."

అయితే ఆమె రోడ్డు మలుపు రాకముందే కారు ఆపింది.

అదో పెద్ద బంగళా. రోడ్డుమీద ఇంకా రెండుమూడు కార్లు ఆగివున్నాయ్. ఆ ఇంట్లోంచి మ్యూజిక్ రోడ్డు మీదకు వినబడుతోంది. లోపల ఏదో పార్టీ జరుగుతూ ఉండాలి అనుకున్నాడు రమేష్.

వాకిట్లో ఏదో పెద్ద నేమ్‌బోర్డ్ కనుపించిందిగాని దాన్ని పూర్తిగా చదవలేదు రమేష్. అయితే అది ఎవరో డాక్టర్ నివాసం అని మాత్రం గ్రహించాడు.

"లోపలకు వెళ్ళి ముఖం అదీ కడుక్కొని, ఒక డ్రింక్ త్రాగి వెళ్ళచ్చు. మీ బట్టలు మార్చుకో దల్చుకుంటే మా వారి జత ఒకటి ఇస్తాను! రా లోపలకు" అంటూ ఆమె దారితీసింది లోపలకు.

రమేష్ కాదనలేక, ఎదురుచెప్పే వ్యవధిలేక ఆమెను అనుసరించాడు.

మెయిన్ ఎంట్రెన్స్ తప్పించి ప్రక్క వాకిలిగుండా ఆమె లోపల ప్రవేశించింది.

తను సేషన్‌కి వెళ్ళి జివ్వుమనే చల్లని నీళ్ళతో ముఖాన్ని కడుక్కునే బాధ తప్పింది. తన గుడ్డలమీది బురద మరకల్ని పోగొట్టటానికి వాటిని తడిపి, పిండి, ఆ తడిగుడ్డల్లో తన శరీరం నీలుగుకుపోయే ఇబ్బంది వుండదు.

"ఇది డాక్టరుగారిల్లయితే నా ముక్కుకు ఏదైనా మందుగూడ దొరుకుతుందనుకుంటాను?" రమేష్ అడిగాడు.

"తప్పకుండా. రా లోపలకు!"

సందులోంచి ఒక పెద్ద హాలులోకి అడుగుపెట్టారు ఇద్దరూ.

హాలుకి దక్షిణంగా మరో గదిని చూపుతూ "అదుగో! అదే బాత్‌రూమ్! వెళ్ళి కడుక్కొని రండి!" అంది ఆమె.

రమేష్ ఆత్రంగా గది తలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళాడు.

హఠాత్తుగా లైట్లు ఆరిపోయాయి. కరెంటుపోయింది కాబోలు అనుకుంటూనే రమేష్ మరో అడుగువేశాడు. అతడి కాలికేదో అడ్డం తగిలింది. నేలమీద బోర్లా పడి పోయాడు.

అంతలోనే లైట్లు వెలిగినయ్.

రమేష్ తను దేనిమీద పడ్డానా అని కళ్లు పెద్దవిచేసి చూశాడు. నేలమీద రంగుల తివాసీమీద ఒక వ్యక్తి పడుకుని ఉన్నాడు. అతడి కళ్లు తెరుచుకునే ఉన్నయ్. కాని అతడిలో చలనంలేదు. బయట చలికన్న చల్లగా, మంచు ముద్దలా ఉన్న అతడి స్పర్శకు రమేష్ భయపడి పోయాడు.

రమేష్ లేచి నిలబడ్డాడు. నేలమీద పడివున్న వ్యక్తి ఛాతీలో కత్తి దిగబడి ఉంది. ఆ గాయంనుంచి కారిన నెత్తురు చార ఇంకా కనబడుతూనే ఉంది ఎర్రగా. చుట్టూ చూశాడు. ఆమె కనిపించలేదు.

# 3

రమేష్ శవాన్ని చూస్తూ అచేతనంగా అలాగే నిలబడి పోయాడు రాయిలా. ఆ భవంతికి దూరంగా, తక్షణం పారిపోవాలనుకున్నాడు.

తను పారిపోతే తననే హంతకుడిగా నిర్ణయిస్తారు. తను హత్యచేసి ఉంటేగదా భయపడాల్సింది?

ఆ గదిలోంచి బయటకు వెళ్ళబోయేవాడల్లా ఆగి ఆ చనిపోయిన వ్యక్తివంక చూశాడు. అతడు అయిదున్నరడుగుల ఎత్తుకన్న ఉండడు. తల బాగా నెరిసిపోయింది. మనిషి నీట్‌గా డ్రెస్ చేసుకుని ఉన్నాడు. బహుశా ఆ ఇంట్లో జరిగే పార్టీకివచ్చిన వ్యక్తి అయివుండచ్చును కున్నాడు రమేష్.

తనను తీసుకొచ్చిన యువతికోసం చుట్టూ గాలించాడు. ఆమె ఎక్కడా కనిపించలేదు.

ఆ గది వాకిలి దాటేసరికి హాల్లో జనం కుర్చీల్లో కూర్చుని గ్లాసుల్లోని ద్రవాన్ని సిప్ చేస్తూ మ్యూజిక్ వింటూ కబుర్లు చెప్పుకుంటున్నారు.

చెదిరిపోయిన తల, అప్పుడే జైల్లోంచి వచ్చినవాడిలా వికారంగా ఉన్న ముఖం, పాకీవాడికన్నా కనాకష్టంగా ఉన్న అతడి బురదకొట్టుకుపోయిన కాకీ గుడ్డలూ, రమేష్ అవతారాన్ని చూసి ఆ జనంలో ఎవరో అరిచారు "అమ్మయ్యో! దొంగ!" అని.

రమేష్ నివ్వెరపోయాడు. అతడి ముఖాన చెమట పట్టింది. అంత చలిలోనూ జేబులోంచి చేతి రుమాలు లాగాడు ముఖం తుడుచుకుందామని. దాన్నిండా ఇంత క్రితం తన ముక్కునుంచి కారిన రక్తం మరకలు.

"దొంగ కాదు! ఎవర్నో హత్యచేసి వచ్చిన హంతకుడిలా ఉన్నాడు, రక్తమైన అతడి జేబుగుడ్డ చూడండి!" మరో వ్యక్తి హెచ్చరించాడు.

టేప్ రికార్డర్ నుంచి వస్తున్న మ్యూజిక్ ఆగిపోయింది. తాపీగా గదిలో చుట్టూరా వేసివున్న కుర్చీల్లో కూర్చున్న వాళ్ళంతా లేచివచ్చి అతడిచుట్టూ మూగారు.

"చూస్తారేం? నాలుగు తగిలించక?" అరిచారెవరో.

"ఆగండి! ఆ గదిలో శవం ఉంది" ఇంకా ఏదో చెప్ప పోయాడు రమేష్.

"చూశారా! చూశారా? వీడెక్కడో నిజంగా హత్య చేసి వచ్చాడు. వీడికి తగిన మర్యాద జరగాల్సిందే!"

"అంతేకాదు! వాడి తలకున్న మఫ్లర్ మనవాడిదే! దాని నిండా కూడా ఆ రక్తం మరక లేమిటో?"

అప్పటిదాకా పీకలవరకూ విందారగించిన అతిథులంతా

హింసాకాండకు దిగారు. రమేష్ చేతుల్ని వెనక్కి విరిచి పట్టుకున్నారు. ఎవరికి అందినచోట వాళ్లు పిడికిళ్ళతో పొడుస్తున్నారు అతన్ని.

"ఆగండి! ఏమిటీ దౌర్జన్యం!" అని గింజుకున్నాడు రమేష్. కాని ఎవరూ అతడి మాటల్ని వినిపించుకోలేదు. ఇలా లాభంలేదని గట్టిగా పెనగులాడి చేతుల్ని వొదిలించుకున్నాడు. తన చేతికందుబాటులో ఉన్న వాళ్ళను తిరిగి కొట్టాడు.

కాని తను ఒక్కడు. వాళ్లు లెక్కలేనంత మంది ఉన్నారు.

"దొంగవెధవా? ఇక్కడ ఇంతమంది ఉండగా జొరబడ్డావంటే నీకెన్ని గుండెలు?"

"దేదీప్యమానంగా లైట్లు వెలుగుతున్నాయ్. హోరున మ్యూజిక్ వినబడుతున్నది. ఎంత ధైర్యంగా లోపలకు ప్రవేశించాడు. హీరోఫోజు వీడూను!"

అతడ్ని చావబాది ఒకమూల కూలబడేశారు.

ఎత్తుగా లావుగా ఉన్న వ్యక్తి ఒకడు ఫోన్ ఎత్తాడు. పోలీసుస్టేషన్‌కి ఫోన్ చేశాడు.

తను పోలీసు రిపోర్టు ఇవ్వాలనుకున్నాడు. కాని ఇక్కడకు రాగానే తననే నేరస్థుడిగా నిర్ణయించి తన మీదే పోలీసులకు ఫిర్యాదు చేస్తున్నారు.

"ఇతగాడేదో ప్రక్క గదిలో హత్య జరిగిందని చెబుతున్నాడు. నేను పోలీసులకు ఫోన్ చేశాను. పోలీసులు వచ్చేదాకా దయచేసి ఎవరూ కదలటానికి వీల్లేదు" అన్నాడు ఫోన్ చేసిన వ్యక్తి.

ఆ మాటలతో అందరూ కంగారు పడిపోయారు. అప్పటిదాకా ఏకాకిగా మిగిలిపోయిన రమేష్ మీద

ప్రతాపం చూపిన వారంతా దిగులుపడి కుర్చీల్లో ఒరిగి పోయారు.

అయిదు నిముషాలన్నా గడవకముందే పోలీస్ వ్యాన్ వచ్చి ఆ ఇంటిముందు ఆగింది.

ద్వారానికి ఇరుప్రక్కలా తుపాకులు పుచ్చుకున్న ఇద్దరు పోలీసులు కాపలాగా నిలబడ్డారు. పోలీస్ ఇన్‌స్పెక్టర్ అతని వెనుక మరో నలుగురైదుగురు సాయుధ బలగం లోపలకు జొరబడ్డారు. అక్కడున్న వాళ్ళందరి వంకా నిశితంగా చూశాడు గ్రుచ్చి గ్రుచ్చి ఇన్‌స్పెక్టర్.

"రండి ఇన్‌స్పెక్టర్ గారూ! నేనే ఫోన్ చేసింది! నా పేరు కళ్యాణరావు. ఇక్కడ ఉన్న అతిధులందరూ గౌరవనీయులూ, ఉన్నతవ్యక్తులు. ఇదిగో ఈ హంతకుడి గురించే మీకు ఫోన్ చేయాల్సి వచ్చింది. మా మిత్రుడు డాక్టర్ శేఖర్ ఇక్కడ తన ప్రాక్టీస్ ప్రారంభించ బోతున్నాడు, రేపట్నుంచీ. ఆ సందర్భాన్ని అనుసరించే ఈ విందు జరుగుతోంది. కాని ఈ సంతోష సమయంలో మాకందరికీ ఆప్తుడయిన సుందరమూర్తి దారుణంగా హత్య జేయబడ్డాడని తెలుపటానికి నాకూ ఎంతో విచారంగా ఉంది."

"కొంచెంసేపు ఓపిక పట్టండి! ముందు శవాన్ని చూసిన తర్వాత" అంటూ ఒక పోలీసు అతడి మాటలకు అడ్డం తగిలాడు.

"నేనీ హత్య చేయలేదు ఇన్‌స్పెక్టర్ గారూ! కావాలంటే నన్నిక్కడకు తెచ్చిన స్త్రీని పిలిపించండి. ఆమె చేతనే చెప్పిస్తాను" రమేష్ గొంతు పెగల్చుకుని మాట్లాడాడు.

"స్త్రీయా?" అంటూ అతిథుల్లో ఒకతను ఆశ్చర్యంగా అందరివంకా చూశాడు.

"ఇక్కడ ఈ ఇంట్లో స్త్రీలెవరూ లేరు! డాక్టర్ శేఖర్ ఇంకా తన భార్యని తీసుకు రాలేదు ఇక్కడకు. తెలుసా?" మరొకరు రమేష్ మాటల్ని కొట్టి పారేశారు.

"ష్! ఎవరూ వాదులాడుకోవద్దు!" అని ఇన్‌స్పెక్టర్ అందరివంకా చూస్తూ అన్నాడు.

శవం చుట్టూరా పౌడర్ చల్లి, భూతద్దాలతో వ్రేలి ముద్రలకోసం వెదికారు. ఫోటోలు తీసుకోవడం, శవాన్ని మార్చురీకి పంపడం అయాక గాని ఇన్‌స్పెక్టర్ అతిథుల జోలికి రాలేదు.

ఇన్‌స్పెక్టర్ సాయంగా ఇద్దరు డిటెక్టివ్‌లూ, స్టెనోగ్రాఫరూ వచ్చారు.

అంత విషాద పరిస్థితుల్లోనూ రమేష్ పార్వతి ఇప్పుడేం చేస్తుంటుందా అనుకున్నాడు. హాయిగా ఆమె ప్రక్కన వెచ్చగా పడుకోక అర్ధరాత్రి అలిగి బజార్నపడి దుస్థితి తెచ్చుకున్నాడు తను. ఇప్పుడేమనుకుంటే ఏం లాభం! చేతులు కాలాక ఆకులు పట్టుకున్నట్టయింది.

"అతడి దుర్మరణం సంగతి సరే అలా ఉంచండి! రేపు శుభమా అంటూ నేను డిస్పెన్సరీ ప్రారంభం చేయట మేమిటి? ఈ హత్య మూలంగా పోలీసులు ఈ ఇంటికి తాళం వేసి సీళ్లు వేసేస్తారట! ఇదెక్కడి ఖర్మ!" అని నెత్తి నోరు బాదుకున్నాడు డాక్టర్ శేఖర్.

పోలీస్ ఇన్‌స్పెక్టర్ మరో గదిలో టేబులుముందు కూర్చున్నాడు. అతిథుల్ని ఒక్కొక్కరినే పిలిచి వారి పేరూ, చిరునామా, వారి వృత్తీ వగైరాలు అడిగి తెలుసుకున్నాడు. తర్వాత వాళ్ళనుంచి వారివారి వ్యక్తిగత వాఙ్మూలం తీసుకున్నాడు.

అతిథులందర్నీ ప్రశ్నించడం అయిపోయాక గాని రమేష్‌కి పిలుపు రాలేదు. అప్పటివరకూ ఒక్కొక్కరే

స్టేట్ మెంట్ ఇచ్చి రమేష్ వంక కొరకొరా చూస్తూ వెళ్ళిపోతున్నారు.

రమేష్కి ఆవలింతలు వస్తున్నాయి. తెల్లవారుజాము కావస్తున్నది. నిద్ర విపరీతంగా ముంచుకు వస్తోంది.

ఇన్ స్పెక్టర్ ముందర నిలబడి విష్ చేశాడు రమేష్.

“కంగారుపడకుండా నేను అడిగేవాటికి జవాబియ్యి!” అన్నాడు ఇన్ స్పెక్టర్ అతడివంక చూస్తూ.

“మీరు మనసునే చదివేయగలరు సార్!” అన్నాడు రమేష్, అతడ్ని ఉబకేయాలని.

“ఎన్నో కేసుల్లో పండిపోయాక ఆపాటి తెలివి రాక పోదులే మాకు!” విసుక్కుంటూ అన్నాడు ఇన్ స్పెక్టర్.

అతడ్ని కాకాపట్టి లాభం లేదనుకున్నాడు రమేష్.

రమేష్ గురించి తెలుసుకున్న ఇన్ స్పెక్టర్ రాజారావు అతడివంక తీక్షణంగా చూస్తూ అన్నాడు “అయితే నీవు కాటన్ మిల్లులో పని చేస్తుంటావన్నమాట! సరే! అసలు జరిగిన విషయం ఏమిటో, నీవు ఇక్కడకు ఎందుకు వచ్చావో, ఏమిటో వివరంగా చెప్పు!”

రమేష్ ఒక్కనిముషం ఆలోచించాడు. తన ప్రస్తావనలో పార్వతి విషయం చెప్పకూడదు. చెబితే ఆమెను కూడా పోలీసులు ఈ వలయంలోకి లాగుతారు.

“ఏం? మాట్లాడవు?” ఇన్ స్పెక్టర్ అడిగాడు మళ్ళీ.

“అదేనండీ! ఎక్కడ మొదలెట్టాలో తెలీటం లేదు.”

“నీ ఇష్టంవచ్చిన చోట మొదలెట్టు ఫరవాలేదు. మీ అందరి సొదా ఓపికగా వినటానికే గదా మేము ఈ ఉద్యోగంలో ఉన్నది” అని నవ్వాడు ఇన్ స్పెక్టర్.

“ఇవాళ సాయంకాలం నాకు మిల్లులో డ్యూటీ అయిపోయింది. రూముకి చేరి స్నానం చేసి భోజనం ముగించుకున్న తర్వాత ఏదైనా సినిమాకు పోదామనిపించింది. ఇంతే

దూరం వచ్చాను. తీరా హోలు సమీపిస్తుండగా, రోడ్డు దాటబోయాను. ఏదో కారు 'రాష్' గా వచ్చింది నా మీదకు. దాన్ని తప్పుకోబోయి తడిసిన నేల_అదే తారు రోడ్డుమీద కాలుజారి క్రింద పడిపోయాను. కారుక్రింద పడిపోయాననే అనుకున్నాను. కాని కారు నా శరీరానికి తాకీ తాకకుండానే ఆగిపోయింది.

నేను జారి పడటంవల్ల కాళ్ళూ చేతులూ దోక్కు పోయాయి. అంతేకాని, కారువల్ల నాకేం దెబ్బలు తగ లేదు. అయినా కారు నడిపే ఆ స్త్రీ నాకు లిఫ్టు ఇవ్వ బోయింది. నేను నిరాకరించాను. ఆమె నన్ను వదల్లేదు.

మావంక జనం వింతగా చూడసాగారు. విధిలేక నేను కారులో ఎక్కాను. నా బట్టలకు బురద అయింది. అందు కని కడుక్కోవటానికి రోడ్డు చివరగా ఉన్న రైల్వే స్టేషన్ కి పోనిమ్మన్నాను.

తనభర్త డాక్టరనీ, తనింటికి వెళితే నా గాయాలకు డ్రెస్సింగ్ చేయిస్తాననీ, మరో జత తనభర్త దుస్తులు ఇప్పి స్తాననీ చెప్పింది, ఆమె.

నేను ఆమె కారుక్రింద పడిఉంటే కేసయి ఉండేది. అందువల్ల ఆమెకు ఒక రకంగా ప్రమాదం తప్పిందనే చెప్పాలి. ఆ కారణంగా ఆమె నాకు సహాయం చేయాలను కున్నదేమో అనుకున్నాను.

మారు మాట్లాడకుండా ఆమె ఇంటికి వెళ్ళాను. పెద్ద వాకిలిగుండా కాకుండా సందు వాకిలిలోంచి లోపలకు వెళ్లాం. ఎదురుగా గది చూపి, ఆమె అందులోకి వెళ్ళమంది.

నేను గదిలోకి ప్రవేశించేసరికే లైట్లు ఆరిపోయాయి. నా కాలికేదో తగిలి నేను క్రింద పడ్డాను. మరుక్షణంలో లైట్లు వెలిగాయి. నేను ప్రాణంలేని శవంమీద పడిఉన్నాను.

నేను భయోత్పాతంలో మునిగిపోయాను. లేచి పారిపోదా మనుకున్నాను. కాని నేను ఏ తప్పు చేయనిదే ఎందుకు భయపడాలనుకున్నాను.

ఏదైనా హత్య జరిగినదని తెలియంగానే పోలీసులకు తెలియజేయటం ప్రతి పౌరుడి విధి. అలాగే మీకు ఫోన్ చేద్దామని హాల్లోకి వచ్చాను.

హాల్లో ఏదో పార్టీ జరుగుతోంది. టెలిఫోన్ గూడ హాల్లోనే ఒక మూల ఉంది. నేను గదిలో శవాన్ని చూసిన విషయం వాళ్ళకు వెల్లడిచేశాను.

వాళ్ళెవ్వరూ నా మాటల్ని లక్ష్యపెట్టలేదు. పైగా నా అవతారం చూసి నన్నో దొంగ క్రిందో, హంతకుడిగానో జమకట్టి, జేబుదొంగని కొట్టినట్టుగా అందరూ చేరి కొట్టారు. తర్వాత మీకు ఫోన్ చేశారు.''

రమేష్ నిదానంగా, తడుముకోకుండా జరిగిన విషయాన్నంతా వెల్లడించాడు. తన సాక్ష్యంలో పార్వతి గురించిన ప్రస్తావన రాకుండా జాగ్రత్తపడ్డాడు.

# 4

రమేష్ తన చుట్టూ ఉన్న పోలీసుల ముఖాల్లోకి చూశాడు. వాళ్ళెవరూ తన కథను నమ్మినట్టుగా కనుపించ లేదు. పైగా తను అబద్ధం చెబుతున్నట్టూ, ఆ విషయాన్ని వాళ్ళు కనిపెట్టినట్టూ, చిలిపిగా నవ్వుతున్నారు.

ఇన్స్పెక్టర్ అతడి కళ్ళలోకి సూటిగా చూశాడు. ఆ తర్వాత అతడు చెప్పిన స్టేట్మెంట్ రాసుకుంటున్న స్టెనోగ్రాఫర్ వంక చూశాడు. స్టెనో తన పని పూర్తిచేసి నట్టుగా తల ఎగరేశాడు.

“నిన్ను అందరూ కొట్టినట్టు మిగతా వాళ్ళూ సాక్ష్యం ఇచ్చారు! అందువల్లే నీవు ఫోన్ చేయలేకపోయావ్! అవునా?''

"అంతే సార్!"

మరో కుర్చీలో కూర్చున్న ఇంకో పోలీస్ ఆఫీసర్ అతడి వంకే చూస్తూ అన్నాడు: "నీవు చెప్పిందాంట్లో మాకు మరికొన్ని వివరాలు రాలేదు. జరిగిన విషయాన్ని మరో సారి సాకల్యంగా చెప్పు!"

రమేష్‌కి చిరాకువేసింది. కాని ఇది తన కోపాన్ని వ్యక్తంచేసే తరుణంకాదు.

"ఏవో కొన్ని చిన్న చిన్న విషయాలు, మినహాయిస్తే ఇందాక నేను చెప్పినదాన్నేగదా మళ్ళీ నేను చెప్ప బోయేది" అన్నాడు రమేష్.

"అదే చిన్న చిన్న విషయాలే ఒక్కోసారి క్లూని అందిస్తాయ్. కనుక నీవు మరోసారి నీ కథను చెప్పక తప్పదు."

రమేష్ మళ్ళీ తన కథను వినిపించాడు.

"కారులోని స్త్రీ ఊరూ పేరూ అడగలేదా? తర్వాత ఆమె ఏమైంది?"

"లేదు! ఆమె పేరు తెలుసుకొనే అవకాశం రాలేదు. నన్ను ఆ గదిలో వదిలిన తర్వాత ఆమె మళ్ళీ నాకు కని పించలేదు."

"నీవు జారిపడింది 'ఓడియెన్' థియేటర్ దగ్గరకదూ? అందులో ఏ సినిమా ఆడుతున్నది?"

"తెలియదు సార్! ఏ సినిమా అయినా సరే దగ్గరలో అందుబాటులో ఉన్నదానికి వెళ్దామని వచ్చాను."

"కానీ నీవు కాటన్ మిల్ నుంచి వచ్చావుకదూ? అక్క డకూ ఓడియెన్ థియేటర్‌కూ చాలా దూరంకదా?"

"బార్‌కి దగ్గరగా ఉన్న థియేటర్ గదా అని ఇక్కడకు వచ్చాను. చలిలో ఏదైనా హాట్ డ్రింక్ త్రాగుదామని వచ్చాను."

"ఓడియన్‌లో ఇంగ్లీషు సినిమా ఆడుతోంది. నీకు ఇంగ్లీషు వచ్చునా? ఏదో యస్. యస్. యల్. సి. చదివినాగాని ఆ సినిమాలో ఇంగ్లీషు నీవు 'ఫాలో' కాగలవా?"

"నేను హైస్కూలు చదువు పూర్తిచేశాను. అయినా గోజూ తప్పని సరిగా ఇంగ్లీషు పేపరు చదువుతాను. ఇంగ్లీషు సినిమాలు ఎక్కువగా చూస్తాను."

ముఖంమీద చెమట తుడుచుకోను రమేష్ తన జేబు లోంచి చేతిగుడ్డను తీశాడు. దానిమీద రక్తం మరకలు ఇన్‌స్పెక్టర్‌లో ఉత్సుకతను కలగజేసినయ్. నిజానికి ఆ మరకలు తన ముక్కు చెదిరి కారిన రక్తం తాలూకువి.

"ఈ జేబుగుడ్డ ఎవరిది?"

"నాదే సార్!"

"దానిమీది రక్తం మరకలేమిటి?"

"నేను క్రింద పడ్డప్పుడు ముక్కుకు దెబ్బతగిలి రక్తం కారింది. యిందాక ఆ విషయం గుర్తురాలేదు."

"ఆ మఫ్లర్ ఎవరిది?" ఇన్‌స్పెక్టర్ అతడి ముఖంలోకి చూస్తూ అడిగాడు.

"దాన్ని ఆమె ఇచ్చింది. చలిలో నా తలకు చుట్టుకో మని" చెప్పాడు రమేష్.

"త్రీ నాట్ ఫోర్! అతడి జేబులు సోదా చెయ్!"

ఇద్దరు పోలీసులు అతడిమీద వేటకుక్కల్లా పడ్డారు.

అతడి జేబులోని వస్తువుల్ని లాగి టేబులుమీద పెట్టారు. ఒక పెన్సిల్, చిక్‌లెట్స్ ప్యాకెట్, గది తాళంచెవి, చిన్న దువ్వెన, పర్సు ఉన్నయ్.

"ఒక్కసారి నన్ను అద్దంలో చూసుకోనివ్వండి. నా అవతారం మీకు నామీద అనుమానాన్ని పెంచుతున్న దేమో!"

"ఏం? అద్దంలో చూసుకుని పెళ్ళికొడుకులా మస్తాబవు

తావా? అదేదో స్టేషన్ కెళ్ళాక మేమే చేస్తాంలే!'' త్రీ నాట్ ఫోర్ అన్నాడు.

రమేష్‌ని వ్యాన్‌లోకి ఎక్కించారు. వ్యాన్ స్టేషన్ చేరుకుంది.

పోలీసులు అతడ్ని ఒక గదిలోకి తీసుకువెళ్ళారు. అతడు కుర్చీలో కూర్చున్నాడు. అతడి కళ్ళముందు ఫ్లాష్ లైట్ లాంటిది వెలిగింది. కళ్ళు మూసుకున్నా భరించలేనంత వెలుగు. కళ్ళను ఛేదించుకుని మెదడులోకి దూసుకుపోయే వెలుగు.

''నీ ముక్కునుంచి రక్తం కారటం నిజమేనా? లేదు! నీవు ఆ గదిలో ప్రవేశించి అందులోని వ్యక్తితో ఘర్షణ పడ్డావు. ఆ ఘర్షణలో నీ ముక్కుమీద అతడు గుద్ది ఉంటాడు. ఆ దెబ్బకు రక్తం కారింది. అవునా?''

అతడిచుట్టూ నిలబడి ఉన్న వ్యక్తులు అనేక ప్రశ్నలు వేస్తున్నారు. రమేష్ మనసు చలిస్తోంది. వెర్రిగా చూస్తూ వాళ్ళడిగే వాటికి సమాధానాలు చెబుతున్నాడు.

ఒక గంట గడిచాక అతడ్ని అక్కడ్నుంచి జైలు గది లోకి తరలించారు.

మరొక పరిస్థితిలో అయితే తనను అనాలోచితంగా అరెస్టు చేసినందుకు గింజుకునే వాడే. కాని ప్రస్తుతం అతడి మనసు వాస్తవికతకూ, కలలకూ మధ్య ఊగిసలాడుతోంది. కాసేపు తను కలగంటున్నాడేమో అని భ్రమపడుతు న్నాడు. మరుక్షణంలోనే కళ్ళు నులుముకుని చూసి నిజం గానే తను జైల్లో ఉన్నట్టుగా నిర్ధారణ చేసుకుంటున్నాడు.

తన పూర్వాపరాలు పోలీసులు విచారిస్తారు. ఈ లోపల కారులో తనకు లిఫ్టు ఇచ్చిన స్త్రీకి ఈ సమాచారం తెలిసి ఆమె ముందుకు వచ్చి తనను విడిపించవచ్చు.

''నీ ప్యాంటు జేబులో మత్తు కలిగించే కేఫీన్ టాబ్లెట్స

దొరికాయి నీ చిక్‌లెట్స్ ప్యాకెట్‌లో. పాయిజన్ సీసా గూడా ఉంది!" పోలీసు అడిగాడు లాకప్‌లో పడేస్తూ.

"అవి నావి కావు. ఎవరో నా జేబులో వేసి వుండచ్చు. దానిమీద వ్రేలిముద్రలు పరీక్షిస్తే తెలుస్తుంది గదా!" రమేష్ అడిగాడు.

ఆ రాత్రే అతడి వ్రేలికి సూదితో పొడిచి రక్తాన్ని గాజు పలకమీదకు ఎక్కించి లేబరటరీకి పంపారు జేబు గుడ్డతో సహా.

మరోసారి ఇంటరాగేషన్‌లో రమేష్‌కు 'అవును' 'కాదు' అని సమాధానం చెప్పే ఓపికగూడ లేకుండా పోయింది. అతడు తమ ప్రశ్నలకు జవాబిచ్చే సత్తువకోసం మధ్యలో అతడికి ఇంజెక్షన్ గూడ ఇవ్వబడింది. ప్రశ్నల మీద ప్రశ్నలు. ఒక మంద వేటకుక్కల్ని తనమీదకు ఉసిగొలిపినట్టుగా ఉంది.

"ఆ కారు రంగు చెప్పు!"

"దానిమీద నెంబరు చూడలేదా?"

"ఆ స్త్రీ ఎలా ఉంది!"

"నీ సొంత గ్రామం ఎక్కడ? ఏ సంవత్సరంలో పుట్టావ్? ఈ మిల్లులో చేరక పూర్వం ఏం చేసేవాడివి? ఇంగ్లీషు సినిమాలు ఎక్కువగా చూస్తావా? అది చేస్తావా? ఇది చేస్తావా?" అంటూ ఎన్నో ప్రశ్నలు.

ఈ ప్రశ్నలకు అంతం లేదు. ఈ రాత్రి ఎంతకీ గడవదేం? అనుకున్నాడు రమేష్.

మనునాడు రమేష్‌ని మేజిస్ట్రేట్ ముందు హాజరు పరిచారు. అతడ్ని బెయిల్ క్రింద విడుదల చేయటానికి వెయ్యిరూపాయలు బెయిల్‌కీ, మరో గౌరవనీయుడి హామీ నిర్ణయించాడు మేజిస్ట్రేటు. కేసు వాయిదా పడింది.

రమేష్‌కి బ్యాంకిలో రెండు మూడు వందలకన్న బ్యాలెన్స్ లేదు. అదీ తను ఎన్నో నెలలనుంచి కూడబెట్టిన కష్టార్జితం. తనకు వెయ్యి రూపాయిలు ధరావత్తు ఎవరు కట్టగలరు? పైగా మరో వ్యక్తి హామీ. తన ఎరుకలో అలా హామీగా ఉండగల వ్యక్తి ఎవరూ కనుపించలేదు.

తిరిగి జైల్లోకి త్రోసివేయబడ్డాడు రమేష్. తనను డాక్టరు ఇంట్లోకి దొంగతనంగా జొరబడ్డ నేరంక్రింద డిటెయిన్ చేశారని మాత్రం తెలుసుకున్నాడు. అయితే అది హత్యా నేరం బయటపడేదాకా ఒక సాకు అనే అనుకున్నాడు. తగిన ఆధారాలు దొరకబుచ్చుకుని తననే హంతకుడు అన్నా అనచ్చు.

హాయిగా తను పార్వతిదగ్గరే ఉండిపోయినా పోయేది. తనిప్పుడు హత్యానేరంలో ఇరుక్కున్నాడు. ఈ పీడ ఎలా వదులుతుందో అర్థం కాలేదతడికి.

# 5

"గుడ్ మార్నింగ్ సర్!" అన్నాడు ఆ వ్యక్తి, సిటీ మెడికల్ షాప్‌లో కౌంటరులో కూర్చున్న వ్యక్తివంక చూస్తూ.

"ఓ! నువ్వా రాజూ! నేను చెప్పిన పని ఎంతవరకు అయింది" మందుల షాపు యజమాని కాంతారావు అడిగాడు.

"వాడ్ని భద్రంగా పోలీసులకు అప్పజెప్పి వచ్చాను" అంటూ రాజు చిన్నగా నవ్వాడు.

"రేయ్! త్వరగా వెళ్ళి కాఫీలు పట్రా!" అన్నాడు కాంతారావు, సేల్స్‌బాయ్‌ని ఉద్దేశించి.

"పోలీసులా? అదేమిటి?" రాజువంక తిరిగి అన్నాడు మళ్ళీ.

"అదేనండీ! మీ అల్లుడి చర్యలు కనిపెట్టి రమ్మని నన్ను పంపారా?"

"నాన్సెన్స్! వాడు నాకు అల్లుడేమిటి?" కాంతా రావు విసుక్కున్నాడు.

"అదే సార్! ఆ రమేష్ సంగతే! వాడు కాటన్ మిల్‌లో పనిచేస్తున్నాడు. రాత్రి మీ అమ్మాయి రూమ్‌కి వెళ్ళాడు. మళ్ళీ మరో అరగంటలో బయటకు వచ్చేశాడు."

"బాగుంది నీ వర్ణన."

"అతడు బహుశా భార్యమీది అలకతో వెంటనే తిరిగి వచ్చేశాడనుకుంటాను."

"ఏడవలేక పోయాడు!"

"ఇప్పుడు నిజంగానే ఏడుస్తున్నాడు. ఎందుకంటారా? పెళ్ళాం మీద అలిగి, ఆ కోపంలో రోడ్డుమీద అడ్డ దిడ్డంగా నడుస్తూ కారుక్రింద పడబోయాడు. వెంట్రుక వాసిలో ప్రమాదం తప్పింది. పైగా కారు నడుపుతున్నది, అందాల రామచిలుక. ఆమె ఇతగాడ్ని కారులో ఎక్కించు కుంది" రాజు ఉషారుగా చెప్పుకు పోతున్నాడు.

"ఇదేమిటి? కథ మాంచి రసపట్టులో పడినట్లుందే?"

"ఆ తర్వాత వినండి! అతడు కారులో ఎక్కాడు. ఆమె ఏం మభ్య పెట్టిందో ఏమో, ఒక డాక్టర్ ఇంట్లో ప్రవేశ పెట్టింది. రెండు మూడు గంటలయిన తర్వాత పోలీసులు అతడ్ని వ్యాన్‌లోకి ఎక్కించుకుని స్టేషన్‌కి తీసుకుపోయారు. ఏదో హత్యానేరం అతడిపై మోప బడింది. అందుకే అతడు ఇప్పుడు జైల్లో మగ్గుతున్నాడు."

"మా అమ్మాయి కంటికి అలాంటి హంతకులే మంచి వాళ్లుగా కనిపిస్తారు దాని ఖర్మ! ఏం చేస్తాం! ఇంతకీ నేను కనుక్కోమన్న వివరాలు మినహా మిగతావన్నీ చెబు తున్నావే?"

"అవీ కనుక్కున్నాను. అతడికి చెడు వ్యసనాలేం లేవట. డ్యూటీకి విధిగా హాజరవుతాడని మిల్లులో చెప్పారు. మితభాషి, అహంభావం ఎక్కువట. బ్యాంక్‌లో నాలుగు వందలకు సేవింగ్స్ ఎకౌంట్ ఉన్నది. స్త్రీలతో అట్టే అనుభవం లేదుట అతగాడికి."

"అలాగా? థాంక్స్!"

"మరి నా ఫీజు ఇప్పిస్తే వెళ్ళిపోతాను!"

డ్రాయరు లాగి అందులోనుంచి నాలుగు పదిరూపాయిల నోట్లను తీసి, మరోసారి లెక్కపెట్టి రాజు ముందు ఉంచాడు.

"ఇంతేనా? ముందు మీరీ పని నాకు చెప్పినప్పుడు ఎంతిచ్చినా చాలనే ఒప్పుకున్నాను. కాని నేను సేకరించిన సాక్ష్యంతో మీకు కావలసిన వ్యక్తిని కటకటాల్లోంచి తప్పించచ్చు. అతడ్ని కారులో ఎక్కించుకున్న స్త్రీ ఎవరో నాకు తెలుసు. అంతేకాదు. ఆ కారు నెంబరు కూడ నేను నోట్ చేసుకున్నాను. ఆ వివరాలన్నీ మీకు కావాలంటే ఇది చాలదు సర్!"

"రోడ్డుమీద జులాయిగా తిరిగే వాడివని, నీకు కొంతన్నా సాయం చేద్దామని నీకు పని అప్పజెప్పాను, మా అమ్మాయిని ప్రేమించిన వాడిగురించి ఆరా తీయమని. నీ దగ్గరున్న విలువైన సమాచారం నాకు కావాలనిపించినప్పుడు అప్పుడే నీ దగ్గరకు వస్తాలే! ఇక ఫో!" కాంతారావు కాస్త కటువుగా అన్నాడు.

రాజు కుర్చీలోంచి లేచాడు. "సరే! మీ ఇష్టం! మీకు నాతో అవసరం అనిపించినపుడు రేటు పెరుగుతుంది మరి!" అంటూ రోడ్డుమీదికి నడిచి ఆ జనంలో కలిసిపోయాడు.

# 6

పార్వతి వేకువనే నిద్రలేచింది. రమేష్‌కి తనంటే ఎంతో ప్రేమ అని ఇన్నాళ్ళూ నమ్మింది. ఆ అనురాగంతో నయినా అతడు తమకు కలగబోయే సంతానాన్ని ఆశీర్వదించి ఆమోదిస్తాడని నమ్మింది.

బయటకు వెళ్ళిన రమేష్ తిరిగి వస్తాడనుకుంది, ఒక గంట గడిచాకనయినా. కాని అతడు రాకుండానే తెల్లారటం ఆమెలో ఆశాభంగం కలిగించింది.

ఏమిటో ఈ మగవాళ్ళు, ప్రేమించటంలో ఉన్న నేర్పు, ప్రియురాలుకోసం కనబరిచే తహతహ పిల్లలు కలుగుతున్నారనేసరికి నీరు కారిపోతారు.

పరాకుగానే లేచి వంటచేసుకుంది. ఆమెకు దిగులుతో ఆకలిగాలేదు. కాని తన కడుపులో పెరుగుతున్న పాప కోసమైనా తను ఏదో కాస్తన్నా ఎంగిలి పడక తప్పదు. భోజనం ముగించుకొని ఇల్లు తాళంవేసి సిటీ బస్ స్టాప్ దగ్గరకు నడిచింది.

అప్పుడే ఏదో బస్ ప్రమాదం జరిగినట్టుంది, ఒక బస్ చుట్టూ జనం మూగి వున్నారు. బస్‌ముందు చక్రాలక్రింద రక్తపు మడుగులో ఒక శవం పడివుంది. రోజూ ఇలాంటివి చూడటం పరిపాటి అయిపోతోంది అనుకుంది ఆమె.

హఠాత్తుగా ఆమెలో సంచలనం రేగింది. కొంపదీసి రమేష్‌గూడ ఎక్కడన్నా ఇలాంటి ప్రమాదంలో చిక్కుకోలేదుగదా!

ఆమె హృదయం వేగంగా కొట్టుకోసాగింది. తను షాప్‌కి వెళ్ళంగానే అక్కడ్నుంచి కాటన్ మిల్‌కి ఫోన్ చేసి, రమేష్ డ్యూటీకి వచ్చాడో లేదో కనుక్కొంది.

అతడు ఆ పూట డ్యూటీకి రాలేదని తెలిసింది. ఆమెలో ఆదుర్దా ఎక్కువయింది. డ్యూటీకి సెలవుపెట్టి గవర్న

మెంటు హాస్పిటల్‌కి వెళ్ళింది రిక్షాలో. క్రితం రాత్రి రెండు మూడు శవాలు మార్చురీకి చేరినయ్యట. ఎటెండర్ చేతిలో రెండు రూపాయలుంచి మార్చురీ తలుపులు తీయించి వాటిని చూసింది. అందులో రమేష్ లేనందుకు ఆమెకు కొంత ఊరట కలిగింది.

హాస్పిటల్లోంచి బయటకు వస్తుండగా, హాల్లో పేషెంట్ల తాలూకు వ్యక్తులు కొందరు లోకల్ పేపరు చదువుతూండటం విన్నది.

"కాటన్ మిల్‌లో పనిచేసే రమేష్ అనే వ్యక్తి హత్యా నేరంపై అరెస్టు..."

ఆ తర్వాత ఆమెకు మాటలు వినిపించలేదు. ఆమెకు మైకం కలిగింది. నిల్చున్న పళంగా తూలి నోడవాన గా క్రిందపడిపోయింది.

ఆమె చుట్టూ జనం చేరారు. ఆమె ముఖంమీద నీళ్ళు చల్లారు. నర్స్ ఒకామె స్మెల్లింగ్ సాల్ట్ వాసన చూపింది.

పార్వతి కళ్ళు తెరిచింది. ఎవరో వేడి కాఫీ తెచ్చి అందించారు. దాన్ని త్రాగాక ఆమెకు కొంత ఓపిక చేరుకుంది.

"ఫరవాలేదు! ఇప్పుడు కులాసాగానే ఉంది! థాంక్స్!" అంది పార్వతి తనచుట్టూ ఉన్న జనాన్ని చూస్తూ.

హాస్పిటల్‌లోంచి బయటకు వచ్చి రిక్షాపిలిచి ఎక్కింది. నేరుగా తన ఇల్లు చేరుకుంది పార్వతి. రిక్షావాడికి డబ్బులిచ్చి పంపేసి తన ఇంటి తాళంతీసి బెడ్ మీద వాలిపోయింది. తెరలు తెరలుగా ఆమెలో దుఃఖం పొర్లుకు వచ్చింది. వెక్కిళ్ళు వచ్చేలా ఒంటరిగా ఏడ్చింది.

రమేష్ ఇలా ఎందుకు చేశాడు? తనమీది ద్వేషంతో వెళ్ళిపోయి, ఆ ఉద్రేకంలో ఈ హత్య చేశాడా? లేదా యాదృచ్ఛికంగా ఏదైనా కేసులో ఇరుక్కున్నాడా?

ఏది ఏమైనా తను చేతులు కట్టుకుని కూర్చోలేదు. తన మేనమామ ఒకాయన లాయరు. ఆయన సాయంతో రమేష్‌ని బెయిల్ మీద నన్నా విడిపించాలి. ఆమె మనసులో అతడు ఈ హత్యచేసి ఉండడనిపిస్తోంది.

కళ్ళ వెంట కారిన కన్నీటి చారికల్ని తుడుచుకుని ఫ్లాస్కు లోంచి కాఫీ వంచుకుని త్రాగింది.

ఆ తర్వాత లేచి బ్రీఫ్ కేసులోకి గుడ్డలు సర్దుకుంది. బ్యాంక్ ప్యాస్ బుక్ గూడ తీసుకుంది. బ్రీఫ్ కేస్ మూసే స్తుండంగా తలుపుమీద ఎవరో తట్టిన చప్పుడు వినిపించింది.

రమేష్ తిరిగి వచ్చాడేమో అని ఆశతో ఆమె తలుపు దగ్గరకు ఒక్క అంగలో చేరుకుంది. గడియతీసి తలుపు తీసింది.

ఆ వచ్చింది రమేష్‌కాదు, కాని ఆ వ్యక్తివంక అచేతనంగా చూస్తూ, ఆశ్చర్యంతో, ద్వేషంతో కొరకొర చూసింది.

"నన్ను లోపలకు రానిస్తావా లేక ఇక్కడ నిలబడమంటావా?" ఆ వ్యక్తి నవ్వుతూ అడిగాడు.

మౌనంగానే పార్వతి అడ్డు తొలగింది. అతడు లోపలకు వచ్చాడు. పార్వతి తలుపుమూసేసి అతడి వెనకే వచ్చింది.

"గ్లాసుతో మంచినీళ్లు అందుకోమ్మా!"

పార్వతి నీళ్ళు తెచ్చి ఇచ్చింది.

"ఎక్కడికో ప్రయాణం అవుతున్నట్టున్నావే! నేను సమయానికే వచ్చానన్నమాట!" అన్నాడు ఆ వ్యక్తి ఖాళీ గ్లాసు క్రింద పెడుతూ.

"బ్రతికి ఉన్నానో, చచ్చానో చూసి పోదామని వచ్చావా?" పార్వతి కర్కశంగా అంది.

"అయితే నీ కోపం ఇంకా చల్లారలేదన్నమాట? ఎంతైనా నేను కన్న తండ్రిని కదా? ఏనాటికైనా రాక తప్పుతుందా నాకు!"

"కన్నతండ్రి! నీ కిష్టంలేని వాడ్ని చేసుకున్నానని నన్ను చనిపోయిన దానిక్రింద ఆనాడే లెక్క కట్టావ్! నా భర్త చనిపోయిన నాడైనా నీవు వచ్చావా? అంతటి కఠినాత్ముడి గుండె కరిగి మళ్ళీ నా గడప త్రొక్కతావని ఎలా అనుకోను!"

"నీవు చిన్నప్పట్నుంచీ మీ అమ్మకున్నంత అహం భావం కలదానివి. ఆ గుణం మధ్యలో పొమ్మంటే పోతుందా? అదీగాక ఆనాడు చేసిన తప్పునే మరోసారి చేయదల్చుకోలేదు. నీ రెండో భర్తగూడ ప్రమాదంలో ఇరుక్కున్నాడని తెలిసి వచ్చాను."

పార్వతికి దుఃఖం ఆగలేదు. తండ్రి కాంతారావు భుజంమీద తల ఆనించి గుండె పగిలేలా ఏడ్చింది.

"ఏడవకమ్మా, ఏడవకు! నేను కలుజేసుకుని రమేష్‌ని ఎలాగైనా విడుదల అయ్యేలా చూస్తాను. మీ మామయ్య లక్ష్మణరావుతో ఇంతకు మునుపే మాట్లాడి వస్తున్నాను. మనింటికి పోదాం పదమ్మా!" ఆమెను అనునయిస్తూ అన్నాడు కాంతారావు.

"మనిల్లు! నేను రాను అక్కడకు! మీ అల్లుడు విడుదలైన రోజున ఇద్దరం కలిసే వస్తాము నీ కిష్టమైతే!" పార్వతి అంది మళ్ళీ.

"నాకు తెలుసు. నీవు జగమొండివి. భర్తకోసం కన్న తండ్రినే కాదని వేరుపడిపోయావ్! మీ అమ్మ చనిపోయాక నేను తిరిగి వివాహం ఎందుకు చేసుకోలేక పోయానంటావ్! నీ గురించే! ఇప్పుడుగూడ నా దగ్గరకు వచ్చి సహాయం అర్థించవని నాకు బాగా తెలుసు. నా బాధ ఇప్పుడు అర్థం

కాదు నీకు. నీ కడుపున నీకంటె అహంభావం గల పిల్లలు పుట్టితే, అప్పుడు తెలిసి వస్తుంది.''

పార్వతి ముఖం సిగ్గుతో వాలిపోయింది. "ఆ రోజా దగ్గరలోనే ఉంది'' అంది నిదానంగా.

"నిజంగానా?'' అని కళ్ళు పెద్దవి చేశాడు కాంతారావు.

"మామయ్య దగ్గరకు పోదాం! ఆయన్ని విడిపించుకోవాలి!''

"అవునవును! ఇంతకీ అతడు ఈ నేరాన్ని చేసి ఉంటాడా?''

"లేదు! ఆయనీ హత్య చేయలేదనే నా నమ్మకం!''

"ఇక బయలుదేరుదామా?'' అంటూ కాంతారావు ఆమె బ్రీఫ్ కేస్ ని చేతిలోకి తీసుకున్నాడు.

# 7

ఇన్ స్పెక్టర్ రాజారావు ఫైల్లోకి చూస్తూ కూర్చున్నాడు. సార్జెంట్ సోమన్న లోపలకు వచ్చి సెల్యూట్ చేశాడు.

"పోలీస్ వ్యాన్ లో ఊరంతా చాటింపు వేయించాం సార్! రమేష్ కి లిఫ్టు ఇచ్చిన స్త్రీ వెంటనే స్టేషన్ కి వచ్చి తన వాఙ్మూలం ఇవ్వాలని. కాని అతడు చెప్పినటువంటి స్త్రీ ఎవరూ ముందుకు రాలేదు. పేపర్లో గూడ ప్రకటన వేయించాం!'' సోమన్న వివరించాడు.

"బహుశా ఆమెకు పేపరు చూసే అలవాటు లేదేమో! అదీగాక మన ఊరినుంచి ఏదైనా పొరుగూరు వెళ్ళిపోవడం మూలాన మన ప్రకటన విని ఉండక పోవచ్చు.''

"అంతేకాదు. పోలీసు కేసులో ఇరుక్కోవడానికి ఆమెగూడ వెనుకాడి ఉండవచ్చు! ఏమంటారు?''

"అవును రమేష్ ఆ స్త్రీని గురించి అబద్ధం చెప్పిఉండడు. అతడు చెప్పినదాంట్లో నిజం ప్రతిధ్వనిస్తోంది. కనుక ఆమె అతగాడు కల్పించిన వ్యక్తి కానేరదు."

"అంతేకాదు సార్! అతడుంటున్న గది యజమానురాలిని విచారించాం. అతగాడి ప్రవర్తన 'నీట్' గానే ఉందని చెప్పింది. అతడి గదిలో బోలెడు పుస్తకాలున్నయ్. డిటెక్టివ్, సాహిత్యం, నాటకాలూ అన్నీ! అతడు పెద్ద సాహిత్యాభిలాషి లాగున్నాడు."

"అతడి మిల్లులో వాకబు చేశావా?"

"చేశాను సార్! అతడ్ని దోషిగా నిర్ణయించటానికి తగిన ఆధారాలు ఏమీ దొరకలేదు. కాకపోతే నేను సినిమా హాలుదగ్గర వాకబు చేశాను కారు ఏక్సిడెంట్ గురించి. అతడు పడిపోయినపుడు చిన్న గుంపు అన్నా చేరి ఉండాలిగదా! మన ప్రకటన చూసి గూడా ఎవరూ ముందుకు రాలేదేమా అని!"

"అతడు హంతునితో పెనుగులాడినట్టు లేదు. ఎందుకంటే అతడి వ్రేలిముద్రలు ఎక్కడా దొరకలేదు. కాని పార్టీలో గెస్టుల్లో ఒకడి ముఖాన బొప్పికట్టి ఉన్నట్టుగా గుర్తు!"

"అవును సార్! అతడి పేరు రామారావు. ఈ ఊళ్లోనే కాలేజీ లెక్చరర్! అతడ్నీ విచారించి వస్తున్నాను. రమేష్ని అందరూ తలా ఒక దెబ్బ వేస్తుండగా రమేష్ తిరగబడి తనను కొట్టడం మూలాన ముఖాన బొప్పి కట్టిందని చెప్పాడు అతడు."

"చనిపోయిన సుందరమూర్తి భార్య కంచి వెళ్ళిందట. ఆమెకూ కబురు వెళ్ళింది. ఆమె ఇంకా రాలేదు!"

"అక్కడ ఆమెకు బంధువులెవరైనా ఉన్నారా?"

"లేరు సార్! ఆమె ఏవో పట్టు చీరలకు ఆర్డరిచ్చిం

దట. వాటిని తెచ్చుకోవడం కోసం వెళ్ళిందట. గత నాలుగైదు రోజుల్నుంచీ ఆమె అక్కడే ఉన్నదట. షణ్ముగ లాడ్జిలో మకాం చేసిందని తెలిసింది.''

''అయితే నీవు కంచికి వెళ్ళి లాడ్జిలో ఆమెను గురించి వాకబు చేయి. అక్కడున్న రోజుల్లో ఆమె చర్యలు అన్నీ తెలుసుకు రావాలి!'' ఇన్‌స్పెక్టర్ రాజారావు అన్నాడు.

''అలాగే సార్!'' సోమన్న సెల్యూట్ చేశాడు.

# 8

జైలు గేటు తాళం తీస్తూండడం చూసి రమేష్ మళ్ళీ తనను ప్రశ్నించటానికి తీసుకు వెడుతున్నారేమో అనుకున్నాడు.

కాని కానిస్టేబుల్ వెనకనే తెల్ల ప్యాంటూ, నల్ల కోటూ వేసుకున్న వ్యక్తి లోపలకు ప్రవేశించటం చూసి అతడు ఆశ్చర్యపోయాడు. ఈ కేసులో సంఘటనలు ఒకదానికొకటి సంబంధం లేకుండా సాగిపోతున్నయ్. ఏ పాపమూ ఎరగని తనను హత్యానేరం క్రింద లోపల బంధించారు. తనకు బెయిల్ ఇచ్చే తాహతుగల మిత్రులు గూడ ఎవరూ లేరు.

మరి, అటువంటప్పుడు తన తరఫున వాదించటానికి ఒక లాయర్ తయారయాడంటే అదిఆశ్చర్యంకాక మరేమిటి?

లాయర్ అతడి దగ్గరకు వచ్చి కర్రల మంచం చివరగా కూర్చున్నాడు.

''నా పేరు లక్ష్మణరావు. నేను క్రిమినల్ లాయర్ని. నీ తరఫున వాదించటానికి వచ్చాను.''

''మీరెవరో నే నెరగను. అంతేకాదు. జీవితంలో కోర్టుకి నిందితుడిగా రావడం ఇదే మొదలు. లాయర్లతో

నాకు ఏనాడూ పని బడలేదు."

"అలాగా! సరే! అసలు విషయానికి వద్దాం! నిన్ను బెయిల్ మీద విడిపించబోతున్నాను."

"బెయిల్ కి ఎంత ఖర్చుపెట్టాలో తెలిస్తే మీరిలా మాట్లాడరు" మొండిగా, మొరటుగా రమేష్ పలికాడు.

"ఆ విషయం నాకు వదిలెయ్! నీవు ఆ ఇంట్లో చోరీ చేశావా?"

"లేదు!"

"హత్యా?"

"లేదు."

"జరిగిన విషయాల్ని దాచకుండా ఒకసారి వెల్లడిస్తావా?"

"తప్పకుండా! పోలీసులకు ఇప్పటి కెన్నిసార్లు చెప్పానో లెక్కలేదు! మీకు మరోసారి చెప్పినందువల్ల నాకు కలిగే నష్టం ఏమీ ఉండదు!" అంటూ తను సినిమాకని బయలుదేరి నప్పట్నుంచీ జరిగిన విషయాలన్నీ ఏకరువు పెట్టాడు.

"పాపం! నిర్దోషివి, నిన్ను తెచ్చి లాకప్ లో పడేశారు. ఈ రెండు రోజుల్లోనే నీవు చాలా నలిగిపోయినట్టున్నావు!" లక్ష్మణరావు సానుభూతిగా అన్నాడు.

"పోలీసులు నేను చెప్పిన విషయాన్ని నమ్మినట్టు లేదు. మీరన్నా నమ్మితే చాలు! నా అదృష్టం బాగుంటే నాకు లిఫ్టు ఇచ్చిన స్త్రీ పోలీసుల దగ్గరకు వచ్చి నేను చెప్పింది నిజమని సాక్ష్యమిస్తే నన్ను వదిలేస్తారు!"

"ఆమె వస్తుందని నీకు నమ్మకముందా?"

"ఇన్ స్పెక్టర్ గాని అతడి అనుచరులు గాని నా మాటల్ని నమ్మినట్టు లేదు. మీరు ఇంత త్వరగా ఎలా

నమ్మేశారు?" రమేష్ ఆశ్చర్యపోయాడు.

లక్ష్మణరావు నవ్వాడు. "నిన్ను డిఫెండ్ చేయటానికి వచ్చినవాడితో అబద్ధం చెప్పవని నా నమ్మకం. పైగా నీ మాటలు వింటుంటే అవి నిజంలాగా ధ్వనిస్తున్నయ్. ఎన్నో కేసుల్ని చూశాం. ఎంతోమంది నేరస్థుల్ని, నిర్దోషుల్ని క్రాస్ క్వొశ్చన్ చేస్తుంటాం! ఏది నిజమో, ఏది అబద్ధమో తెలుసుకోలేకండా ఇన్నాళ్లు ఎలా ప్రాక్టీస్‌లో నిలబడగలం?"

ఆ తర్వాత లక్ష్మణరావు మరికొన్ని ప్రశ్నలు వేశాడు.

"హత్య చేయబడిన సుందరమూర్తితో నీకు పరిచయముందా?"

"లేదు! అతడ్ని చూడటం అదే మొదటిసారి."

"సుందరమూర్తి ధనవంతుడు. అతడి క్రింద నాలుగైదు వ్యాపార సంస్థలున్నయ్. అతడికి అనేక మంది మిత్రులూ శత్రువులూ కూడ ఉండవచ్చు. వారిలో నీవూ ఒకడివేమో అని అడిగాను. అతగాడి వయసు యాభై సంవత్సరాలు ఉంటయ్!"

"అలాగా! అతని శవాన్ని చూస్తే అరవై పైనే ఉంటుందనుకున్నాను" రమేష్ అతడికి అడ్డు తగులుతూ అన్నాడు.

"అతడికి పిల్లలు లేరు. మొదటి భార్య చనిపోయింది. రెండు సంవత్సరాల క్రితం మరో అమ్మాయిని పెళ్ళి చేసుకున్నాడు. ఆమె ప్రస్తుతం కాంచీపురం వెళ్ళిందట!"

"ఇవన్నీ మీకెలా తెలుసు?" రమేష్ ఆశ్చర్యంగా అడిగాడు.

"చనిపోయిన సుందరమూర్తి వీలునామాలో తన ఆస్తికి ఎవరు వారసులో నిర్ణయించాడు. అతగాడి ప్లీడరునుంచి ఆ సమాచారం తెలుసుకున్నాను. పోతే నీవు చెప్పినదంతా

నిజమే! కాని ఒకటి మాత్రం అబద్ధం చెప్పావు!" లక్ష్మణ రావు నవ్వుతూ కంఠస్వరం తగ్గించి అన్నాడు.

రమేష్ ఉలిక్కిపడ్డాడు. "అని ఎలా చెప్పగలరు?"

"నీవు సినిమా చూడటానికి రాలేదు ఆ ప్రాంతంలోకి."

"అవుననుకోండి! కాని ఆ విషయంతో ఈ కేసుకి ఎటు వంటి ప్రమేయంలేదు. నేను అంతక్రితం ఎక్కడున్నానో ఏమి చేశానో ఎవరికీ వెల్లడించ దలుచుకోలేదు. ఆ వివరం మాత్రం నన్నడగకండి. అందుకు ఇష్టమయితేనే నా తరఫు డిఫెన్స్‌కి సిద్ధం కండి!" జవాబిచ్చాడు రమేష్.

లక్ష్మణరావు చిరునవ్వు నవ్వాడు. "నీ కేసు తీసుకునే ముందే నీ వెంత మొండివాడివో బాగా తెలుసు."

"అంతేకాదు. నన్ను విడిపించినందుకు మీకు ఫీజు ఏమీ ఇచ్చుకోలేను గూడా!"

"సరే ఇక వస్తాను!" అంటూ లాయర్ లక్ష్మణరావు లేచాడు.

లక్ష్మణరావు వెళ్ళిపోయాడు. రమేష్ మళ్ళీ తన మంచంలో కూలబడ్డాడు. తను ఇక్కడకు వచ్చి ఎన్ని గంటలయినాయో, లేక ఎన్ని రోజులు నడిచాయో గూడా గుర్తులేదు. సెంట్రీని కేకేసి ఇవాళ్టి తారీకు, టైమూ అడుగుదా మనుకున్నాడు. అంతలోనే మళ్ళీ అతడి చేతిలో చివాట్లు తినాల్సి ఉంటుందని ఊరుకున్నాడు.

ఇతర జైలు గదుల్లోంచి నవ్వులూ, అరుపులూ, తిట్లూ, కేకలూ వినబడుతున్నయ్. ప్రశాంతంగా ఉండే పరిసరాలకు అలవాటుపడ్డ తను ఈ పరిసితుల్లో ఇంకో పదిరోజులు గనుక ఉంటే పిచ్చెక్కేలా ఉంది.

సినిమాల్లో చూసిన జైలు దృశ్యం గుర్తుకు వచ్చింది అతడికి. నేరస్థుడ్ని జైల్లో పెట్టంగానే గేటు చువ్వల్ని ఊపేలా ఉద్వేగంతో ఉపన్యాసాలిచ్చే సీను అతడి మన

సులో సినిమా రీలులా తిరిగింది. శారీరకంగా తను అంత ఉద్వేగాన్ని ప్రదర్శించలేకపోయినా, తన మనసులో మాత్రం అంతకన్నా ఎక్కువ క్షోభగానే ఉంది.

ఎలాగైనా ఇక్కడనుంచి బయటపడి, పార్వతిని కలుసుకుని ఆమెను కష్టపెట్టినందుకు క్షమార్పణ కోరుకునే దాకా తనకు ఊరట కలగదు.

పైగా తను బయటపడిన మరుక్షణంనుంచే, తనకు కారులో లిఫ్టు ఇచ్చిన స్త్రీని వెతికి పట్టుకోవాలి. ఆమె గనుక దొరికితే, తను ఈ కేసులోంచి సులభంగా, బయట పడగలడు.

# 9

రమేష్ కూర్చున్న చోటునుంచి లేచి అసహనంగా అటూ, ఇటూ పచార్లు చేయసాగాడు.

సెంట్రీ గేటు దగ్గరకు రావడంచూసి, తనకు మళ్ళీ ఏవో ఆర్డర్లు జారీచేయడానికి_అటూ, ఇటూ పచార్లు చేయకుండా కూర్చోమనో, మౌనంగా కూర్చుని అయోయకత్వం నటించవద్దనో, చెప్పటానికి వచ్చిఉండాలనుకున్నాడు.

"ఏమయ్యా! నీ తరఫు పెద్ద పెద్ద వ్యక్తులున్నారటగదా! చెప్పనే లేదేం? నీ కెవరూ వెనుకా ముందు లేరని చెప్పావు గదా? నిన్ను బెయిల్ మీద విడుదల చేస్తున్నారు. నడు! నడు!" అన్నాడు లోపలకు వచ్చిన సెంట్రీ.

నమ్మలేనట్టుగా అతడివంకే చూశాడు రమేష్. తను విన్నది కలలోకాదనీ, వాస్తవమేననీ రూఢిచేసుకుని ఇన్స్పెక్టర్ దగ్గరకు నడిచి తన పర్సు వగైరా వస్తువులు తిరిగి తీసుకున్నాడు. జైలు గేటు దాటంగానే లాయర్ లక్ష్మణరావు కనుపించాడు. అతడి ప్రక్కగా నల్లని ఎంబాసిడర్ కారుంది.

"కారులో కూర్చో మిస్టర్ రమేష్!" అన్నాడు లక్ష్మణ రావు.

"క్షమించండి! నేను మీతో రాలేను. అర్జంటుగా ఒక వ్యక్తిని కలుసుకోవాలి!" రమేష్ ఎటో చూస్తూ అన్నాడు.

"ఈ కేసులో ఆ వ్యక్తి ప్రస్తావన రాకుండా జాగ్రత్త పడ్డావుకదూ? ఆ వ్యక్తి నేనా కలుసుకునేది! త్వరపడి ఆ పని చేయకు. నీవు జైల్లోంచి బెయిల్ మీద విడుదలయ్యావ్. కాని నీమీద పోలీసు నిఘా ఉంటుంది. నీ ప్రతి కదలికనూ వాళ్ళు కనిపెడుతూనే ఉంటారు!"

రమేష్ ఒకనిముషం ఆలోచించాడు. "అలాగంటారా? సరే అయితే పదండి!" అంటూ కారులో కూర్చున్నాడు.

కారు ముందుకు సాగింది.

"నా గొడవలో మీకు థ్యాంక్స్ చెప్పాలన్న ఆలోచన రాలేదు. మీ సహాయానికి చాలా కృతజ్ఞుడిని."

లక్ష్మణరావు చిరునవ్వు నవ్వాడు.

"బెయిల్ ఎలా సాధించారు?"

"తర్వాత చెబుతాను!"

"నన్ను ఇప్పుడు ఎక్కడకు తీసుకు వెడుతున్నారు!"

"మరో కేసులో ఇరికించటానికి కాదులే!"

"మీ పరిహాసం చాలు! నేను నా రూమ్‌కి వెళ్ళాలి! కారు ఆపండి!" రమేష్ అరిచాడు.

"చూడు మిస్టర్! నీకు బెయిల్ ఇవ్వటానికి నేను పూచీ పడ్డాను. కనుక నీవు కొన్నాళ్ళపాటు నా అధీనంలో ఉండక తప్పదు. అందువల్ల నీవు నిర్దోషివని కోర్టు ధృవ పరిచేదాకా కొంచెం కంట్రోల్‌లో ఉంచుకో."

"మీరలా కట్టడిలో పెడితే లాభంలేదు! నన్ను కొంత స్వేచ్ఛగా తిరగనివ్వండి, 'ఆమె'ను దొరక పుచ్చుకొని

హంతకు డెవరో బయటకు లాగాలి.''

"హంతకుడెవరో వెదికి పట్టుకోవల్సిన బాధ్యత పోలీసులమీదే ఉంటుంది. మన పనల్లా నీవు నిర్దోషివని ఋజువు చేసుకోవటమే!'' లక్ష్మణరావు వివరించాడు.

"మొత్తానికి మీ ప్లీడరు తెలివి పోనిచ్చుకున్నారుకాదు! ఇంతకీ మీరు నానుంచి ఏం ఆశించి నన్ను విడిపించు తున్నారో చెప్పనేలేదు!''

"ఒక అమ్మాయి నావద్దకు వచ్చి ఈకేసు తీసుకోమని అర్థించింది. ఆ అమ్మాయి పేరు పార్వతి.''

# 10

ఇన్స్పెక్టర్ రాజారావు కాలింగ్ బెల్ నొక్కాడు. మరుక్షణంలో తలుపు తెరుచుకుంది.

ముప్ఫయ్యేళ్ళ స్త్రీ వాకిట్లో నిల్చొని ఉంది. ఆమె ఎర్రగా, అందంగా ఉంది. మెళ్ళో నగలు, రాళ్ళహారాలూ, పట్టు చీరలో పడుచుపిల్లలా కనుపిస్తోంది. ఇన్స్పెక్టర్ వంక ఆశ్చర్యంగా చూసింది ఆమె.

"ఎవరు కావాలండీ!'' అనడిగింది.

"కీర్తిశేషులు సుందరమూర్తి భార్య సుమతిని కలుసు కోవాలని వచ్చాను'' రాజారావు బదులు చెప్పాడు.

"రండి లోపలకు! నేనే సుమతిని!'' అంది ఆమె లోపలకు దారి తీస్తూ.

రాజారావు ఇల్లంతా కలయజూశాడు. బోసిగాఉంది, ఆ లంకంత కొంప.

"నేను ఈమధ్య కంచి వెళ్ళాను, పట్టు చీరెలు తెచ్చు కోవాలని. కాని అనుకోకుండానే వారి మరణంవల్ల, ముందుగానే తిరిగివచ్చాను. అందువల్ల నాకెవ్వరూ లేరు!'' అంది ఆమె, అతడి ఊహను పసిగట్టిన దానిలా.

ఆమె ముఖంలో విచారం ఏకోశానా కనుపించలేదు.

"మీవారి మరణం గురించి సమాచారం కావాల్సి వచ్చాం!"

"అడగండి చెబుతాను!" అంటూనే ఆమె దుఃఖిస్తున్న దానిలా ముక్కు రెండుసార్లు ఎగబీల్చి మరోసారి చీది, కళ్ళు నులుముకుంది.

కుర్చీలో కూర్చుంటున్న రాజారావుకు టేబుల్ మీద అప్పుడే కాఫీ గ్లాసుని తీసిన నీటి మరక కనుపించింది. ఇంట్లో తను తప్ప వేరెవరూ లేరని ఆమె అంటోంది. కాని టేబుల్ మీద గ్లాసు ఉంచటంవల్ల అయిన తడి ఇంకా ఆరలేదు. అయితే తను రావటంవల్ల, అప్పటివరకూ ఆమెతో గడిపిన ఆగంతకుడు తనను చూసి దాక్కున్నాడేమో!

"పాపం! చాలా చిన్నతనంలోనే మీకీ కష్టంవచ్చింది!" సానుభూతిగా అన్నాడు రాజారావు.

"ఏం చేయను చెప్పండి. ఆయన పోయిన నాటినుంచీ కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తున్నాను. ఇంతవరకు ఒక్క కునుకు తీయలేదంటే నమ్మండి."

"అలాగా! అయితే నా ఇన్వెస్టిగేషన్ త్వరగానే ముగిస్తాను."

"ఇంకా ఇన్వెస్టిగేషన్‌లోనే ఉన్నారా? ఎవరినో అరెస్టు చేశారని విన్నాను."

"ఒక వ్యక్తిని అరెస్టు చేశాం. అతడు దొంగతనంగా ఇంట్లోకి జొరబడ్డాడనే నేరారోపణ తప్ప, హత్యా నేరం అతడే చేశాడనటానికి తగిన ఆధారాలు దొరకలేదు.

"ఈరోజే అతడ్ని బెయిల్ మీద విడుదలచేశాం! ఇంతకీ మీవారిని హత్య చేయాల్సిన అవసరం ఎవరికుంటుందంటారు? మీ అనుమానం!"

"వారికి శత్రువులెవరూ లేరనే నా ఉద్దేశ్యం."

"అంటే వారి మిత్రుల్లోనే ఎవరో ఈ పనిచేసి ఉండా లని మీ అభిప్రాయమా?"

"అలా అని నేను అన్నానా? అదీగాక వారి మిత్రుల్లో ఎక్కువ భాగం వయసు మళ్ళినవారే! వారికి కత్తితో దారుణంగా చంపే అవకాశం ఉంటుందని అనుకోను!"

"అంటే మీవారి స్నేహితులందరితో మీకు పరిచయం ఉందా?" ఇన్స్పెక్టర్ అడిగాడు ఆమె వంకే చూస్తూ.

"మీకు పెళ్ళయిందనుకుంటాను. ఆఫీసులో మీకు వస్తున్న కేసులన్నిటి గురించీ విపులంగా మీ భార్యకు చెబుతారా? చెప్పరు! అలాగే వాళ్ళతో నాకూ అట్టే పరిచయంలేదు. నాకు సినిమాలంటే పిచ్చి. నా కాలాన్ని ఎక్కువగా సినిమాలు చూస్తూనే గడిపేస్తాను."

"మీవారు ఈ సంఘటనలో చనిపోయినపుడు మీ రెక్కడున్నారు?"

"నేను కంచి వెళ్ళాను. కామాక్షీ ఆలయంలో నాకు మొక్కుబడి ఉంది. అది తీర్చుకోవటానికి వెళ్ళాను. మా వారు ఈ పార్టీ అయిపోంగానే మద్రాసు వెళ్ళి, అక్కడ వ్యవహారమేదో చూసుకుని నాలుగైదు రోజుల తర్వాత కాంచీపురం వచ్చి నన్ను కలుస్తాననీ, అందాకా నన్ను కంచిలోనే ఉండమనీ చెప్పారు. అలాగే నేను ఆ ఊళ్ళోనే వారికోసం వెయిట్ చేస్తున్నాను. వారు రాలేదు. వారి గురించిన వర్తమానం వచ్చింది."

"థ్యాంక్స్! వస్తానండీ!" అంటూ ఇన్స్పెక్టర్ రాజారావు కుర్చీలోంచి లేచాడు.

# 11

సందుల వెంబడి ప్రయాణించి కారు ఒక ఇంటి ముందు ఆగింది.

ఆ ఇల్లు పాడుబడ్డ పెంకుటిల్లు. ముందు ప్రక్క కప్పు కూలిపోయింది. వెనుక భాగంలో ఇంకా కూలిపోకుండా ఉన్న రెండు గదుల్లో ఆ వ్యక్తి నివాసం కాబోలు అనుకున్నాడు రమేష్.

"కారు నడిరోడ్డులో ఆపితే ట్రాఫిక్ కి అడ్డం! ఇంకా కొంచెం ముందరకు వెళ్ళి కారు ఆపుదాం!" అన్నాడు కాంతారావ్.

"రైట్! మీరు కారుని 'పార్క్' చేసిరండి! ఈలోగా నేను వెళ్ళి అతనున్నాడో లేదో చూసి, అతడుగాని ఇంట్లో ఉంటే, నేను మాట్లాడుతుంటాను!" అంటూ రమేష్ డోర్ తెరుచుకుని కారులోంచి దిగాడు.

దగ్గరకు వేసిఉన్న తలుపు నెట్టుకుని లోపలకు వెళ్ళబోతున్న రమేష్‌ని లోపల్నుంచి ఎవరో వచ్చి ఢీకొన్నారు.

"సారీ!" అంటూనే ఆ వ్యక్తి తలకూడ ఎత్తకుండానే రమేష్‌ని దాటుకుపోయాడు.

రమేష్ గదిలోకి ప్రవేశించాడు. లోపల రెండు కుర్చీలు, ఒక టేబుల్ ఉన్నయ్. కుర్చీలు తిరగబడి ఉన్నయ్. గదినిండా కాగితాలు చిందరవందరగా పడిఉన్నయ్. అంతకుముందు నిముషంలో ఏదో ఘర్షణ జరిగినట్లుగా ఉంది ఆ దృశ్యం.

నేలమీద ఒక వ్యక్తి పడిఉన్నాడు. అతడు ఇంకా మూలుగుతున్నాడు. రమేష్ అతడికి దగ్గరగా వెళ్ళి "రాజూ!" అన్నాడు నెమ్మదిగా.

"అబ్బా! బాధ! రాస్కెల్! నా ప్రాణాలు తోడే

కాడు! అమ్మా!'' అంటూ ఆ వ్యక్తి కళ్ళు మూసుకున్నాడు.

అదే సమయానికి కాంతారావు లోపలకు వచ్చాడు. అక్కడి దృశ్యాన్ని చూస్తూనే "ఏమిటి? ఏం జరిగింది?" అని ఆదుర్దాగా అడిగాడు.

రమేష్ సమాధానం చెప్పేలోపలే తలుపులు నెట్టుకుని పోలీసులు జొరబడ్డారు లోపలకు.

రమేష్, కాంతారావు లిద్దరకూ నోటమాట రాలేదు.

"ఇక్కడేదో హత్య జరిగిందట గదా?" ఇన్‌స్పెక్టర్ రాజారావు అడిగాడు.

రమేష్ తను లోపలకు వస్తుండగా, తనను ఎవరో ఢీకొని బయటకు పారిపోయిన విషయం చెప్పాడు.

"సార్! ఇంకా ఇతగాడికి ప్రాణం పోలేదల్లే ఉంది. ముందు ఇతడ్ని హాస్పిటల్‌కి చేర్చే సదుపాయం చూడండి. బయట నా కారుగూడ రెడీగా ఉంది హస్పిటల్‌కి చేర్చ టానికి'' అన్నాడు కాంతారావు ఇన్‌స్పెక్టర్ వంక చూస్తూ.

# 12

ఇన్‌స్పెక్టర్ రాజారావు తలుపు తట్టాడు. తలుపు తీస్తూనే సుమతి అతడ్ని చూసి ఆశ్చర్యపోయింది.

"మాడమ్! మీ ఆట కట్టింది! మిమ్మల్ని అరెస్టు చేస్తు న్నాను'' అన్నాడు.

"నన్నా? అరెస్టా? ఎందుకు? నేనేం తప్పు చేశానని!''

"ఇంకా బుకాయించకండి! మీ ప్రియుడు కళ్యాణ రావు జైల్లో ఉన్నాడు. మీ రిద్దరూ కలిసి నీ భర్తను హత్య చేసినట్టు వాఙ్మూలం ఇచ్చాడు.''

సుమతి గాంభీర్యం బ్రద్దలైంది. చేతుల్లో ముఖాన్ని కప్పుకుని వలవల ఏడ్చింది.

ఇన్‌స్పెక్టర్ వెనుకనే నడిచి వ్యాన్‌లోకి ఎక్కింది.

"మిస్టర్ రమేష్! ఇక నీవు నిర్దోషివి! అసలు హంతకులు పట్టుబడ్డారు. వాళ్ళను పట్టుకోవడం కోసం, మిమ్మల్ని దోషిగా ఆరోపించాల్సి వచ్చింది. సారీ ఫర్ ది ట్రబుల్!" అన్నాడు ఇన్‌స్పెక్టర్ రాజారావు రమేష్ వంక చూస్తూ.

"అదేమిటి సార్! మీరు చెప్పేది ఆశ్చర్యంగా ఉందే!" అన్నాడు కాంతారావు.

"అవునండీ! ఆ రోజు 'పార్టీ'లోనే నేను అనుమానించాను, విందుకు వచ్చిన అతిథుల్లోనే ఒకరు హంతకులని. పైగా సుందరమూర్తి మరణంతో అతని యావదాస్తీ, సుమారు మూడు లక్షలకు పైగా ఉంది, అదంతా సుమతికే చెందేలా వీలునామా ఉంది.

అందుకే సుమతిపై అనుమానం పోయింది. హత్య జరిగిన రోజున సుమతి కాంచీపురంలో ఉన్నట్టుగా చెప్పింది. మా పోలీసులను అక్కడకు పంపి వాకబు చేయించాను. 'సుమతి' పేరట మరో స్త్రీ, ఆమె ఇంట్లో పనిమనిషి అక్కడ హోటల్లో మకాం చేసినట్టు తేలింది. అంటే సుమతి ఈ ఊళ్ళోనే అజ్ఞాతంగా ఉండిపోయి, తన ప్రియుడి సాయంతో ఈ పని చేసింది. పైగా మరో నిర్దోషిపై ఈ హత్యానేరాన్ని వేయాలని, తెలివిగా రమేష్‌ని తన కారులో తెచ్చి విందు జరిగేచోట వదిలింది.

ఆమెకు ఎలిబీ ఉంది కనుక స్వతహాగా ఆమెనెవరూ అనుమానించరని అభిప్రాయపడింది.

అయితే మీరు రాజుని, రమేష్‌ని అనుసరించమని నియోగించారు గదూ! అతడు రమేష్‌ని కారులో ఎక్కించుకున్న స్త్రీని గుర్తించి ఉంటాడు. హత్యానేరం రమేష్‌పై మోపబడంగానే, రాజు సుమతి దగ్గరకు వెళ్ళి ఆమెను

బెదిరించాడు. 'హత్యా రహస్యం' తనకు తెలుసనీ, ఆమె నుంచి కొంత డబ్బు గుంజాడు. అలాగే కళ్యాణరావు వద్దకు గూడ వెళ్ళి అతడ్ని బ్లాక్ మెయిల్ చేసి మరికొంత లాగాడు.

అయితే కళ్యాణరావు అతడి పీడగూడ వదిలించుకోవడానికి రాజు ఇంటికి వెళ్ళి అతడ్ని పిస్తోలుతో కాల్చి, పారిపోతుండగా మీరు లోపలకు వస్తూ తారసపడ్డారు. అతడు రోడ్డుమీద టెలిఫోన్ బూత్ లోకి వెళ్ళి, ఈ ఇల్లు గుర్తులు చెప్పి, అక్కడేదో హత్య జరిగిందనీ, త్వరగా వస్తే హంతకులు దొరుకుతారనీ చెప్పాడు.

మేం అక్కడకు వచ్చేసరికి మీరున్నారు అక్కడ. రాజు చనిపోలేదు. హాస్పిటల్లో కోలుకున్నాడు సరైన టైమ్లో హాస్పిటల్లో చేరటానికి సాయంచేసినందుకు. రాజు చెప్పిన సమాచారంవల్ల హంతకుల్ని విడివిడిగా ప్రశ్నించేసరికి, వారు తమ నేరాన్ని ఒప్పుకున్నారు.

ఏది ఏమైనా కళ్యాణరావు, సుమతీ ఇద్దరూ చట్టంతో చెలగాటమాడబోయారు. చివరకు వాళ్ళ చేతులే కాలాయి'' ఇన్ స్పెక్టర్ రాజారావు తన కథ ముగించాడు.

—:ఐ పో యిం ది:—

# మాయమైన మాధవి

## ఏ. వీ. మోహన్రావ్

గంట తొమ్మిదయింది.

మోహినీ స్టుడియోలోని రెండో ఫ్లోర్‌లో ఆర్టిస్టులు, టెక్నీషియన్లు హడావుడిగా తమతమ పనులు చేసుకుంటూ తిరుగుతున్నారు. అందరూ క్రొత్త తారలనే పెట్టి తీస్తున్నారు సినిమా. ఆ రోజు షూటింగులో పాల్గొనవలసిన జనమంతా వచ్చేశారు. ఒక్క హీరోయిన్ మాధవి తప్ప.

ప్రొడ్యూసర్ సుబ్బారావు పదిసార్లు సెట్ వెలుపలకు వెళ్ళి చూసొచ్చాడు ఆమె వచ్చిందేమోనని. డైరక్టరు, కెమెరామెన్ ఆమె రానందుకు విసుక్కొంటున్నారు.

"వేషం ఇచ్చిందాకా కాళ్ళావేళ్ళా పడతారు. తీరా ఇచ్చాక ఒక్కరోజు కెమెరాముందు నిలబడతారు సరిగ్గా.

ఆ తర్వాత మొదలవుతాయి వెధవ వేషాలు" కోపంగా అన్నాడు సుబ్బారావు.

"ప్రొడక్షను కారు వెళ్ళిందా?" అడిగాడు డైరెక్టరు.

"లేదండీ! తనగురించి శ్రమ పడొద్దని చెప్పింది. తనే టాక్సీలో వస్తానంది రోజూ. చెప్పినట్లే ఈ వారంరోజులూ వచ్చింది కూడా. ఇవాళ ఏమొచ్చిందో ఇంతదాకా అంతు లేదు!" అన్నాడు సుబ్బారావు గోల్డ్ ఫ్లేక్ సిగరెట్ ముట్టిస్తూ.

"రాత్రేదయినా బుకింగ్ వుండిందేమో?" అందుకున్నాడు కెమెరామెన్.

"ఏం చచ్చిందో? ఇప్పుడు చావు నాకొచ్చి పడింది. పాతవాళ్ళను పెట్టుకుంటే పని సరిగ్గా తెమలదని, క్రొత్త వాళ్ళ కోసం పోతే అప్పుడూ ఇలాగే ఏడుస్తూంది!" అన్నాడు సుబ్బారావు.

"ఆమె లేకుండా ఈ దినం పని జరిగే మార్గం లేదు. ప్రతి పాటూ ఆమెతోనే వుంది. కారన్నా పంపండి సార్!" అన్నాడు అసిస్టెంటు డైరక్టరు.

సుబ్బారావు మేనేజర్ని పిలిచి కారు తీసుకెళ్ళమని చెప్పాడు. తలూపి వెళ్ళిపోయాడు మేనేజరు.

ఆ తర్వాత దాదాపు రెండు గంటలసేపు వెయిట్ చేశారు. మాధవి రాలేదు. ఆమెకోసం వెళ్ళిన ప్రొడక్షన్ కారు కూడా రాలేదు. వీసమెత్తు పని జరగలేదు. కాఫీలు త్రాగుతూ, సిగరెట్లు పీలుస్తూ, తాంబూలాలు సేవిస్తూ సెట్లోవున్న జనమంతా ప్రొడ్యూసర్ డబ్బును హారతి కర్పూరంలా చేస్తూ కూర్చున్నారు.

పదకొండున్నరకు మేనేజరు వచ్చాడు.

"వచ్చిందా?" అడిగాడు సుబ్బారావు.

"ఆవిడ గదిలో లేదండీ!" చెప్పాడు.

"లేదా? ఎక్కడికి వెళ్ళిందట."

"ఎవ్వరూ చూడలేదట. ప్రక్క గదిలో ఎక్స్ట్రా వేషాల వెంకాయమ్మను అడిగాను. ఔన్లో వాళ్ళవాళ్ళు ఎవరో వున్నారని చెప్పిందనీ, ఒకవేళ అక్కడికి వెళ్ళి వుంటుందేమోనంది. ఆ అడ్రసు చెప్పమన్నాను. తనకు సరిగ్గా తెలీదంది. క్రౌన్ టాకీస్ ప్రాంతాల్లో ఎక్కడో వుందా ఇల్లని చెప్పినట్లు గుర్తుగా వుందంది. తిన్నగా అక్కడికి వెళ్లాను. ఆ హాలు చుట్టుప్రక్కలున్న రోడ్లన్నీ తిరిగాను ఆమె కనపడుతుందేమోనని. లాభం లేక పోయింది. విసుగెత్తి వచ్చేశాను" అన్నాడు మేనేజరు.

సుబ్బారావు విని నీరుగారి పోయాడు. కుర్చీలో జేర బడ్డాడు. ఆ రోజు షూటింగ్ కాన్సిల్ చేసినట్లు ప్రకటించారు. అయినా అందరూ భోజనాలు కంపెనీ ఖర్చులోనే చేసుకుని, కంపెనీ కారులో మెల్లగా ఇళ్ళకు వెళ్ళిపోయారు.

ఆఫీసుకొచ్చాక సుబ్బారావు, మాధవి వస్తుందేమోనని ఎదురు చూస్తూ కూర్చున్నాడు. అలా రాత్రి ఎనిమిదింటి దాకా కూర్చున్నాడు. ఆమె రాలేదు. చెప్పా పెట్టకుండా ఎలా వెళ్ళిందో, ఎందుకు వెళ్ళిందో, ఎంత ఆలోచించినా అతని మెదడుకు తట్టలేదు.

గంట ఎనిమిదిన్నర అవుతూండగా "చిత్రలేఖ" సినిమా పత్రిక ఎడిటర్, ప్రొప్రయిటర్, రిపోర్టర్, అన్నీ అయిన మూర్తి వచ్చాడు. అతనికి సుబ్బారావంటే చాలా ఇష్టం. అందరి సినిమావాళ్ళలా గాకుండా, పత్రికల వాళ్ళతో మనసిచ్చి మాట్లాడుతాడు. క్రొత్త వాళ్ళతో సినిమా తీసే పథకానికి అసలు ప్రోత్సహించింది మూర్తే.

"ఏమిటి అలా దిగులుగా వున్నారు?" అడిగాడు మూర్తి.

మాధవి రాకపోవడం, షూటింగు ఆగిపోవడం, వెతికినా కనుపించక పోవడం గురించి వివరంగా చెప్పాడు మూర్తికి సుబ్బారావు. "ఇప్పుడామె నాకు కనుపించకుండా పోతే దాదాపు యాభైవేలు నష్టమొస్తాయి. ఆమెతో ఇంత దాకా షూట్ చేసిన ఆరు రీళ్లు కట్టవుతాయి. నా ఆర్థిక పరిస్థితి మీకు తెలుసు!" అన్నాడు విచారంగా.

మూర్తికి అర్థం కాలేదు. ఉన్నట్టుండి ఆమె ఎలా అంతర్ధానమైందో ఊహించలేక పోయాడు.

"ఆమె దేవ్వూరో ఏమిటో చెప్పిందా?" అడిగాడు మూర్తి.

"లేదు. ప్రస్తుతం ఈ వూరేనంది. తనకు ఎవరూ లేరంది."

"ఇంతకుముందు ఏం చేసేదట!"

"హైద్రాబాద్‌లో క్లబ్‌లో డాన్సు చేస్తుండేదట. ఆ పనిమీద విసుగొచ్చి ఇలా వచ్చేసిందట."

"మీ అడ్వర్టయిజ్‌మెంటు చూసేనా వచ్చింది!" అడిగాడు మూర్తి.

"అవును" అన్నాడు సుబ్బారావు.

మూర్తి ఆలోచించాడు. మాధవితో అతను మాట్లాడాడు. ఆమెకు సినిమా తారగా జీవించడం ఆనందంగానే వున్నట్లు వ్యక్తపరచింది. అందరిలా కాకుండా, జీవితాన్ని పవిత్రంగా, అపనిందలకు దూరంగా వుంచుకోవాలనుకుంటున్నట్లు వెల్లడించింది మాటల సందర్భంలో. మాధవి రూపలావణ్యాలు అపూర్వం అనిపించాయి చూడగానే. నలిగీ నలగని గులాబీలాగా, మనోహరంగా వుందామె సౌందర్యం అనుకున్నాడు మూర్తి.

మాధవి ఫోటోలు వేసి, ఆమె అందచందాల గురించి, నటనాకౌశలాన్ని గురించి చిత్రలేఖలో ఆర్టికల్స్ రాశాడు

మూర్తి. ఎంతోమంది మెచ్చుకుంటూ, ఆమెకు బంగారు భవిష్యత్తు వుందని ఎంకరేజ్ చేస్తూ ఉత్తరాలు రాశారు కూడా.

"ఏమిటి మూర్తీ ఆలోచిస్తున్నావు?"

"మాధవి చాలా మంచిపిల్ల. పనిచేసిన వారం రోజులూ కష్టపడి పనిచేసింది. టైమ్‌కు సెట్‌కు వచ్చింది. అలాంటిది చెప్పా పెట్టకుండా ఎటు వెళ్ళింది. ఎందుకు వెళ్ళింది. ఆమెకే ఆమె ఏదైనా అర్జంటు పనిమీద వెళ్ళవలసి వుంటే మీకు చెప్పకుండా వెళ్తుందని నాకు అనిపించడం లేదు."

"అయితే ఆమెను బలవంతంగా లాక్కుపోయారా?" అడిగాడు సుబ్బారావు.

"అదీ చెప్పలేకుండా వున్నాను."

"ఆమేం చిన్నపిల్లకాదు. ఎవరైనా అలా చేసివుంటే అల్లరిచేసి వుండొచ్చుగా."

"మనం ముందుగానే నిర్ణయానికి రావడం మంచిది కాదు. మరో రోజు చూద్దాం. తిరిగొస్తే సరే! లేకుంటే ఏంచెయ్యాలో నిర్ణయించుకుందాం. మీరుమాత్రం కంగారు పడకండి. ఎవ్వరికీ ఈ విషయాలు చెప్పకండి" అన్నాడు మూర్తి.

"అలాగే! నన్ను నువ్వే కాపాడాలి" అన్నాడు సుబ్బారావు బెంబేలుపడుతూ. మూర్తి ధైర్యం చెప్పి వెళ్ళిపోయాడు.

## 2

సుబ్బారావుకు తెల్లవారిందాకా నిద్రపట్టలేదు. తీస్తున్న సినిమా మధ్యలోనే ఆగిపోయినందుకు అతనికి విపరీతమైన బాధగా వుంది. ఉన్న కాస్త ఆస్తి తెగనమ్మి రంగంలోకి

దూకిన మనిషి కావడంవల్ల సహజంగానే భయంతో దిగాడు. మధ్యలో అనుకోని అవాంతరం అడ్డొచ్చేసరికి మరింత పిరికితనం ఆవహించింది.

భళ్ళున తెల్లారింది. ఎనిమిదింటికి డైరక్టరు, కెమెరామెన్ వచ్చారు. మాధవి గురించి అడిగారు. ఏమీ తెలీదని చెప్పాడు. ఆ రోజంతా చూసి ఆమె వచ్చే సూచనలు లేకుంటే స్టూడియోకు ఫోన్ చేసి సెట్ తీసెయ్యమని చెప్పడం మంచిదన్న ఉచిత సలహా పడేసి, రెండు కాఫీలు త్రాగి, రెండు సిగరెట్లు తగలబెట్టి వెళ్ళిపోయారు.

సుబ్బారావుకు మతిపోయినట్లయింది.

పన్నెండింటికి మూర్తి మళ్ళా వచ్చాడు.

సుబ్బారావును చూడగానే పరిస్థితిలో ఏ విధమైన మార్పు లేదన్న విషయం అర్థమైంది.

"అయితే ఆమె అంతర్థానమైనట్లేగా?" అడిగాడు మూర్తి కూర్చుంటూ.

"అలాగే అనుకోవాలి!" అన్నాడు సుబ్బారావు.

"ఏంచేద్దాం?"

"ఎలాగైనా వెతికి పట్టుకోవాలి. లేకుంటే మునిగిపోతాను."

"ఈ పని మనకి మనం సాధించలేం. పోలీసు రిపోర్టు ఇద్దామా?"

"వద్దు! లేనిపోని అల్లరవుతుంది. డబ్బిచ్చిన డిస్ట్రిబ్యూటర్లు ప్రాణాలు తోడుతారు. అందరి నోళ్ళల్లో పడ్డామంటే ఎగతాళి చేస్తారు. అల్లరిగాకుండా ఆమెను పట్టుకొచ్చి మళ్ళా పని ప్రారంభం చెయ్యాలి. అప్పుడే మన పరువు దక్కుతుంది" అన్నాడు సుబ్బారావు.

"కథ కాస్త మార్చి ఆమె క్యారెక్టరును చంపినట్లు రెండు డూప్ షాట్స్ తీసి పూర్తిచేసేందుకు వీలులేదా?"

"అబ్బే! కథంతా ఆమె చుట్టూ తిరుగుతుంది. అసలామె హీరోని చంపాలి. ఆమెను చంపేకన్నా మనం చావడం ఉత్తమం."

మూర్తి ఆలోచనలో పడ్డాడు. రెండు నిముషాలు మాటపలుకూ లేకుండా కూర్చున్నాడు.

"అయితే ఒక పని చేద్దాం!" అన్నాడు.

ఏమిటన్నట్లు చూశాడు సుబ్బారావు.

"ప్రఖ్యాత ప్రైవేట్ డిటెక్టివ్ సుధాకర్ గారు తెలుసా మీకు. పెద్ద పెద్ద కేసుల్ని పరిశోధించిన ప్రజ్ఞాశాలి. ఆయనకిది పెద్ద విషయంగా వుండదు. ఆయన్ను నియమిద్దాం. అల్లరిలేకుండా పని తెమిలిపోతుంది. అయితే కాస్త ఫీజు ఎక్కువ తీసుకుంటాడు" అన్నాడు మూర్తి.

"అంటే ఏమాత్రం."

"ఖర్చులన్నీ మనం భరించాలి. కనీసం ఐదువేలన్నా ఇవ్వాలి."

"అయితే వెళ్దాం పదండి" అన్నాడు సుబ్బారావు.

అరగంట తర్వాత ఇద్దరూ కారెక్కారు. అంబాసిడర్ కారు అడయారులోని సుధాకర్ బంగాళాముందు ఆగింది. ఆయన ఆఫీసు, ఇల్లు అక్కడే వున్నాయి. కారు పోర్టికోలో ఆపి, దిగి లోనికి వెళ్ళారు.

హాల్లో మూలగా చిన్న బల్లపైన టైప్ మిషన్ వుంది. దాని ప్రక్కనున్న స్టూల్ మీద టెలిఫోన్ వుంది. బల్ల కివతలివేపు రెండు ఫోల్డింగ్ కుర్చీలున్నాయి. ఇద్దరూ వెళ్ళి కూర్చున్నారు.

ప్రక్కనున్న స్వింగ్ డోర్స్ తెరచుకొని అందమైన అమ్మాయి చేతిలో షార్ట్ హాండ్ బుక్ పట్టుకొని వచ్చింది.

"గుడ్ మార్నింగ్ మిస్..." అంటూ ఆగాడు మూర్తి.

"వసంత!" అంటూ కూర్చుంది.

"నేను! 'చిత్రలేఖ' సినిమా పత్రిక ఎడిటర్‌ను. వీరు ప్రగతీ పిక్చర్సు ప్రొడ్యూసర్ గారు. నాపేరు మూర్తి. వారిపేరు సుబ్బారావు. మాకో కేసులో సుధాకర్ గారి సాయం కావలసి వచ్చాం!" అన్నాడు మూర్తి.

"ఏం కేసు?" అడిగింది వసంత టైప్ మిషన్‌లో పేపరు లోడ్ చేస్తూ.

"అందమైన అమ్మాయి అంతర్ధానమై పోయింది. ఆమె ఆచూకీ తెలుసుకోవాలి!" అన్నాడు మూర్తి.

"అలాంటి కేసుల్లో సామాన్యంగా పోలీసులను వాడుకోమని సలహా ఇస్తుంటారు సుధాకర్ గారు. ఆ ప్రయత్నం ఎందుకు చెయ్యకూడదు."

"ఆ వివరాలు వారికి వివరంగా చెప్తాను. అంతా వింటే వారలా అనరు" అన్నాడు మూర్తి.

"ఆల్ రైట్!" అంటూ ఫోన్ తీసి బజ్జర్ నొక్కి తన బాస్‌తో టూకీగా మూర్తి, సుబ్బారావుల గురించి చెప్పింది. వాళ్ళను తీసుకుని వసంతను కూడా లోనికి రమ్మన్నాడు సుధాకర్.

"రండి! వెళ్దాం!" అంటూ లేచింది వసంత.

మూర్తీ, సుబ్బారావు ఆమెను అనుసరించారు.

విశాలమైన ఏ. సి. గది మధ్యలో పెద్ద గాడ్రెజ్ టేబుల్ వెనుక కూర్చుని వున్నాడు సుధాకర్ రివాల్వింగ్ చెయిర్‌లో. వెనుక వేపు గోడకు అమర్చిన బీరువాలనిండా రకరకాల పుస్తకాలు వున్నాయి. గ్రేకలర్ సూట్ లోదుస్తుని వున్నాడు. కట్టుకున్న ఎర్రపూల టై రెపరెపలాడు తూంది సన్నటి గాలి అలకు.

"కూర్చోండి!" అన్నాడు సుధాకర్.

అంతా ఆయన ముందు కూర్చున్నారు.

మూర్తి వివరంగా చెప్పాడు విషయం. సుబ్బారావు

తలాడిస్తూ కూర్చున్నాడు. వసంత పెన్సిల్ షార్ట్‌హాండ్ బుక్ పైన కదులుతూనే వుంది.

"ఆమె పుట్టుపూర్వోత్తరాలు మీకు తెలీవా!" అడిగాడు సుధాకర్.

"తెలుసుకుందామని అడిగినా చెప్పలేదు!"

"మీ పిక్చరులో వేషం వేసినందుకు పారితోషికంగా ఎంతిస్తామన్నారు?"

"ఐదు వేలు!"

"ఏమైనా ఇచ్చారా?"

"వెయ్యి రూపాయలివ్వబోయాను. ఐదొందలు తీసుకుంది. మిగిలింది సినిమా పూర్తయ్యాక ఇమ్మంది."

"మిమ్మల్ని కలిసేనాటికి ఈ వూరొచ్చి ఎన్నాళ్ళయిందో తెలుసా ఆమెకి?"

"అంతకు రెండు దినాలముందే వచ్చానంది. చిత్రలేఖలో నేను వేసిన అడ్వర్టయిజ్‌మెంటు చూసి వచ్చిందట."

"మిమ్మల్ని కలసిన రోజు గుర్తు తెచ్చుకోండి. ఆమె బట్టలు ఎలా వున్నాయి. మేకప్ ఎలా వుంది. డబ్బుకు ఇబ్బంది పడుతున్నట్లు అనిపించిందా?"

"లేదండీ! చాలా ఖరీదయిన చీర కట్టుకుంది. చేతికి రెండు వెడల్పాటి బంగారు గాజులున్నాయి. టాక్సీవాడికి వందరూపాయల నోటిచ్చింది. వాడు చిల్లర లేదన్నాడు. ఆ తర్వాత నేనిచ్చి పంపాను వాడ్ని!"

"ఆమె ఫోటోలు మీ దగ్గర వుండాలి. కొన్ని ప్రింట్లు పంపండి. ప్రయత్నిస్తాను" అన్నాడు సుధాకర్.

"మీ ఫీజు!" అంటూ ఆగాడు సుబ్బారావు.

"అంతా ఆఖరులో చూసుకుందాం. దాన్నిగురించి మీరు కంగారు పడకండి" అన్నాడు సుధాకర్.

"సరే!" అంటూ ఇద్దరూ లేచి శెలవు పుచ్చుకున్నారు.

# 3

"అన్ని పత్రికలు చూశావా?" అడిగాడు సుధాకర్.

"ఇంగ్లీషు, తెలుగు, తమిళం అన్నీ క్షుణ్ణంగా వెతికాను. ఎక్కడా ఆత్మహత్యలు చేసుకొన్న కేసులుగానీ, ఆక్సిడెంటులో చనిపోయిన మనుషుల వివరాలుగానీ లేవు" అంది వసంత.

"నాయర్ భార్యకు ఫోన్ చేసి చెప్పావుగా. అడిగి చూడు అతనేమన్నా చెప్తాడేమో?" అన్నాడు. వసంత లేచివెళ్ళి ఫోన్ చేసింది కమీషనర్ ఆఫ్ పోలీస్ నాయర్‌కు. నాయర్ లైన్లో రాగానే రిసీవరు అందించింది. సుధాకర్, నాయర్ ప్రాణస్నేహితులు.

"వసంత చెప్పిందాన్ని గురించి వాకబు చేయించావా?" అడిగాడు సుధాకర్.

"ఆఁ! ఏ ఆడపిల్లా, అందులోనూ అందమైన ఆడపిల్ల, కారు, లారీలాంటి దానిక్రిందపడి చచ్చినట్లు మాకు రిపోర్టు రాలేదు. అయినా నీకెందు కవసరమయింది ఈ సమాచారం" అడిగాడు నాయర్.

"నాకో కేసు వచ్చింది."

"అది మా దగ్గరకు రాలేదా?"

"లేదు. ఇప్పట్లో రాదుగూడా" అన్నాడు సుధాకర్.

"రాలేదన్న చింత నాకేంలేదు! అయితే కొద్దిరోజులు తమరు బిజీగా వుంటారన్నమాట" అన్నాడు నాయర్.

"అవునేగా! థాంక్స్! అవసరమయితే మళ్ళీ ఫోన్ చేస్తాను" అంటూ ఫోన్ రిసీవరు వసంత కందించాడు. ఆమె దాన్ని క్రేడిల్ పైన పడేసింది.

"కూర్చో!" అన్నాడు వసంతను సుధాకర్.

ఆమె ఎదురుగా కూర్చుంది.

"నీ అభిప్రాయమేమిటి?" అడిగాడు సుధాకర్.

"దేన్ని గురించి?"

"మనం ఒప్పుకున్న కేసు గురించి."

"ఆమె సినిమాల్లో వేషం వేద్దామని వచ్చింది. అందంగా వుంటుందని వాళ్ళమాటల ద్వారా విన్నాను. ఎవరైనా డబ్బుగల మనిషి నెలకు పెద్ద మొత్తం ఇచ్చే పదతిమీద ఉంపుడుకత్తెగా వుండమని అడిగి వుంటాడు. ఆమెకది నచ్చి వుంటుంది. అతనెక్కడో ఆమెను పెట్టి వుంటాడు" అంది వసంత.

"ఆమె ఈ వూళ్ళోనే వుండి, క్షేమంగా వుంటే, షూటింగుకు ఎందుకు రాలేదు. ఒకవేళ నువ్వు చెప్పిన ఛాన్సు తగిలినా, తన్ను నమ్ముకొన్న సుబ్బారావుకు అన్యాయంచేసి పోతుందా?!"

"సినిమాల్లో వేషాలు వెయ్యకూడదని అతను ఆంక్ష పెట్టాడేమో?"

"అలా జరగదు. అతనికి కూడా ఆమె సినిమా తార గావడం ఇష్టంగానే వుంటుంది. ఎందుకంటే ఫలాని తారను వుంచుకున్న మనిషంటే సంఘంలో పెద్ద విలువనుకొనే మనుషులున్నారు" అన్నాడు సుధాకర్.

"మీ అనుమానం ఏమిటి?"

"ఆమె ఉన్నట్టుండి ఇక్కడికి వూడిపడింది. అంతకు ముందు హైద్రాబాద్‌లో ఏదో క్లబ్బులో డాన్సు చేసే దాన్నని చెప్పింది. అక్కడేమన్నా జరిగివుండి, అది ఆమెకు భయకారణమయి వుంటే, ఇక్కడికి పరుగెత్తు కొచ్చిందేమో?" అన్నాడు.

"అటువంటి మనిషి వీలైనంతవరకు పదిమంది దృష్టిలో పడకుండా ఎక్కడైనా రహస్యంగా, అనామకంగా

వుండిపోవాలనుకుంటుంది తప్ప, సినిమాల్లో వేషాలువేసి అనవసరంగా, తన ఉనికిని అందరికి సులభంగా తెలిసిపోయేలా చేసుకుంటుందా?'' అడిగింది వసంత.

సుధాకర్‌కు వసంతంటే ప్రేమేకాదు అభిమానం, గౌరవం కూడా వున్నాయి. కష్టపడి పనిచెయ్యడం, అపాయాలు ఎదురొచ్చినా లెఖచెయ్యకపోవడం, మాత్రమే గాకుండా ప్రతి విషయాన్ని ఎంతో నిశితంగా పరీక్షించి చర్చిస్తుంది. చాలాసార్లు ఆమె ఊహలే రైటయినాయి.

"అయితే ఆమె తన గతం గురించి ఎందుకు చెప్పలేదు. ఉన్నట్టుండి ఎందుకు మాయమైంది?'' అడిగాడు సుధాకర్.

"అది తెలుసుకోవడం మీ పని. అందుకే వాళ్ళు మిమ్మల్ని పెట్టుకుంది!''

"నన్ను మాత్రమే కాదు! నిన్నుగూడా'' అన్నాడు సుధాకర్.

వసంత నవ్వింది.

"ముందు నువ్వు వెళ్ళి మాధవి వుంటూండిన గది చుట్టు ప్రక్కల వాళ్ళను వాకబు చెయ్యి. మద్రాసులో దిగాక ఆమె తిన్నగా అక్కడికే వచ్చి వాలిందా లేక మరెక్కడన్నా వుంటుంటే, ఫలానిచోట గది ఖాళీగా వుందని తెలిసి వచ్చిందా? మొదలైన వివరాలు తెలుసుకుని రా! ఆ తర్వాత ఏంచెయ్యాలో ఆలోచిద్దాం!''అన్నాడు సుధాకర్.

"అలాగే బాస్!'' అంటూ లేచి వెళ్ళింది.

ఆ తర్వాత పదినిముషాలకు సాదా చీర, జాకెట్‌తో మామూలు స్త్రీలా తయారయివచ్చి సుధాకర్ దగ్గర శెలవు పుచ్చుకొని, టాక్సీ ఎక్కి కోడంబాకం పోనిమ్మంది. ఓవర్‌బ్రిడ్జి దాటి కొంతదూరం పోయాక ఆపి, దిగేసి, డబ్బిచ్చింది. టాక్సీ వెళ్ళాక ప్రక్కదారంట నడుచుకుంటూ రంగరాజపురం కొబ్బరితోటలో చెల్లాచెదురుగా

పిచ్చిక గూళ్ళల్లా కట్టుకున్న కొబ్బరి ఆకుల గుడిసెల్లో జొరబడింది.

వెతుక్కుంటూ వెళ్ళి పెద్ద గుడిసె ముందాగింది. అందులో ఆరు గదు లున్నాయి. అరింట్లోనూ కాపురా లున్నాయి. దాని యజమానురాలు వెంకాయమ్మని వాకబు చేసి తెలుసుకుంది.

ట్రంకు పెట్టె పైన కూర్చుని .విజయచిత్ర బొమ్మలు చూస్తూంది వెంకాయమ్మ. దాదాపు యాభయి సంవత్సరా లుంటాయి ఆమెకు.

"మాధవీ! మాధవీ!" పిలిచింది వసంత.

"ఎవరది?" అంటూ లేచొచ్చింది వెంకాయమ్మ. వసంతను చూసి ఎవరయిందీ అర్థంగాక "ఎవరికోసం?" అడిగింది.

"మా మాధవి ఇక్కడే కదండీ వుండటం?" అడిగింది వెంకాయమ్మను.

"అవునమ్మా! వారం రోజుల నాడు అద్దెకు దిగింది. నిన్నటి నుండి రాలేదు గదికి. ఆమెకు వేషం ఇచ్చిన కంపెనీవాళ్ళు తిరిగి పోతున్నారు" అంది వెంకాయమ్మ.

"నిన్న నాకు ఫోన్ చేసి అడ్రసు చెప్పి ఈ దినం రమ్మంది. మా ఇద్దరిదీ ఒక ఊరే! నే లేకున్నా వెంకా యమ్మగారినడిగి తాళం తీసుకొని గదిలో వుండు వస్తాను అని కూడా చెప్పింది నాకు" అంది వసంత.

"ఐతే వస్తుందేమోలే! తాళం ఇచ్చేదా?" అడిగింది.

"ఇవ్వండి!" అంది వసంత.

వెంకాయమ్మ బొక్సోనుంచి తాళంచెవి తీసి ఇచ్చింది. మాధవి వాటా చూపించింది. వసంత తాళం తెరచి లోనికి వెళ్ళింది. గదిలో ఏమీ పెద్ద సామాన్లు లేవు. సూట్ కేస్ మాత్రం వుంది. తలుపును మూసి దాన్ని తెరచింది. ఖరీదైన

చీరలు నాలుగున్నాయి. వాటికి మాచ్ అయ్యే బ్లౌజ్‌లు, బ్రాసరీలు, పెట్టీకోట్స్ వున్నాయి. కాటన్ గౌన్ ఒకటి వుంది. క్రిందున్న న్యూస్ పేపరు క్రింద ఒక ఫోటో కనిపించింది. దాన్ని తీసుకొని చూసింది.

అందమైన అబ్బాయి ఫోటో అది. సూట్ వేసుకొని తీయించుకున్న బస్ట్ ఫోటో అది. వెనకవైపు త్రిప్పి చూసింది. రామా స్టుడియో, లకిడీకా-పూల్-హైద్రాబాదు అన్న రబ్బరుస్టాంపు కనుపించింది. విత్ లౌ టు రోజా అని నల్లటి బాల్ పాయింట్ పెన్‌తో రాసి క్రింద గజిబిజిగా చేసిన సంతకం కనుపించింది. ఆ ఫోటో తీసి హాండ్ బాగ్‌లో వేసుకుంది. సూట్‌కేస్ సర్ది యధాస్థానంలో పడేసి కూర్చుంది.

వెంకాయమ్మ తిరిగొచ్చింది.

"మాధవి రాలేదా?" అడిగింది.

"లేదండీ!" అంది వసంత.

"నేను బెజవాడ నుంచి వస్తూంటే రైల్లో కలిసింది మాధవి. మద్రాసులో నువ్వున్నట్లు ఆమెకు గుర్తులేదా?" అడిగింది వెంకాయమ్మ గుమ్మంపైనే కూర్చుంటూ.

"నా గురించి చెప్పలేదా?"

"తెలిసిన వాళ్లెవరూ లేరంది. సినిమాలో చేరడానికి వస్తున్నానని చెప్పింది. ఎక్కడైనా వుండేందుకు వసతి చూపించమంది. నా వెంట తీసుకొచ్చాను. ఆపిల్ల అదృష్టం బావుంది. తక్కువ హీరోయిన్ ఛాన్సు తగిలింది" అంది వెంకాయమ్మ.

"అలాగా! ఇంట్లో చెప్పకుండా వచ్చేసిందట. అందుకని నా దగ్గరకు రాలేదు. ఎవరికన్నా తెలిస్తే వచ్చి లాక్కెళ్ళతారని భయపడి వుంటుంది. ఆ భయం పోయాక నాకు ఫోన్ చేసింది" అంది వసంత.

"బాగా డబ్బున్నవాళ్ళ లాగున్నారు!" గొణిగింది.

"అవును-వాళ్ళకు చాలా ఆస్తి వుంది."

"వంద రూపాయల నోట్లు చాలా వున్నాయి ఆమె పర్సులో. ఖర్చు కూడా విపరీతంగా చేయడం గమనించాను" అంది వెంకాయమ్మ.

అలా మాట్లాడుతూనే చాలా విషయాలు రాబట్టింది. మూడు గంటలు గడిచిపోయాయి.

"ఇంకా రాలేదే! ఇవాళింక రాదేమో? నేను మళ్ళీ వస్తాను. అదో స్తే అరుణ వచ్చి చాలాసేపు చూసి వెళ్ళిందని చెప్పండి!" అంటూ వెలుపలికొచ్చి, ఆమెదగ్గర శెలవు పుచ్చుకొంది.

మళ్ళీ నడచి కోడంబాకం బ్రిడ్జిదాకా వచ్చి, టాక్సీ ఎక్కి అడయారు పోనిమ్మంది. బంగళాలోకి వెళ్ళగానే చూసింది పోర్టికోలో బాస్ కారు కనుపించలేదు. ఎటో వెళ్ళి వుంటుందనుకొంది. టైప్ రైటర్ ముందు కూర్చుని తను సేకరించిన సమాచారం విపులంగా టైప్ చేసింది. దానికి తను తెచ్చిన ఫోటో పిన్ చేసి పాడ్ లో వుంచుకుంది.

సుధాకర్ లోనికొచ్చాడు.

"హల్లో! వచ్చేశావా?" అన్నాడు గదిలోకి వెళ్తూ.

వసంత తను తయారుచేసిన రిపోర్టు తీసుకుని వెంట వెళ్ళి ఎదురుగా కూర్చుని, అతని ముందు తోసింది.

సుధాకర్ చకచక చదివి, వెనుకనున్న ఫోటోను పరిశీలనగా చూశాడు.

"గుడ్! చాలా సమాచారం సేకరించావ్. నేనుకూడా కొంత సమాచారం తోడాను" అన్నాడు.

చెప్పమన్నట్లు చూసింది వసంత.

"మొన్న సాయంత్రం షూటింగు కాగానే మాధవి

స్టూడియో వెలుపలున్న టాక్సీ ఎక్కి కాంటినెంటల్ హోటల్‌కు పోనిమ్మంది. టాక్సీవాలా ఆమెను అక్కడ దించాడు.''

''తర్వాత...''

''అతను సవారీకోసం ఎదురుచూస్తూ హోటల్ ముందే నిలబడ్డాడట. అరగంట తర్వాత ఇంపోర్టెడ్ ఇంపాలా కార్లో ఆమె ఒక అందమైన యువకుడి ప్రక్కన కూర్చుని అతని మీదుగా వెళ్ళిపోయిందట'' అన్నాడు సుధాకర్.

''ఆ తర్వాత...''

''నేను హోటల్‌లో దూరాను. బేరర్లనూ, రిసెప్షనిస్టునూ, క్రాస్ ఎగ్జామ్ చేశాను. మాధవి ఫోటో చూపించాను. ఎవ్వరూ చూడలేదన్నారు. ఇంపాలా కారు గురించి అడిగాను. హోటల్‌లో నిన్న దాదాపు అరడజనుదాకా వున్నాయట. అవి ఎవరివయిందీ వాళ్ళకు తెలీదట. కార్ల దగ్గర కాపలా వుండే బాయ్‌ని అడిగాను. ప్రతి కార్లోనూ అందమైన జంటలే దిగారనీ, తిరిగి వెళ్ళారనీ చెప్పాడు. నా పరిశోధన అక్కడ ఆగిపోయింది'' అన్నాడు సుధాకర్.

''అయితే ఇప్పుడు మనం ఏం చెయ్యాలి?'' అడిగింది వసంత.

''హైద్రాబాద్ వెళ్దాం! అక్కడేమన్నా సమాచారం దొరుకుతుందేమో చూద్దాం!'' అన్నాడు సుధాకర్.

''ఓ. కే'' అంది వసంత.

ఆ రాత్రి ఫ్లైట్‌లో హైద్రాబాద్ చేరుకున్నారు.

# 4

వసంతను, హైద్రాబాద్‌లో వున్న క్లబ్బులు, పెద్ద హోటల్స్ తిరిగి ఎవరికయినా మాధవిని చూసిన గుర్తుం

దేమో తెలుసుకోమన్నాడు. తను రామా స్టుడియోకెళ్ళి ఆ ఫోటోలోని వ్యక్తి ఎవరో తెలుసుకుంటామనుకున్నాడు.

వసంత వెళ్ళిపోయింది. వెంట కొన్ని మాధవి ఫోటోలు తీసుకెళ్ళింది.

సుధాకర్ టాక్సీలో లకిడికాపూల్ చేరుకున్నాడు. వెతుక్కుంటూ వెళ్ళి రామా స్టుడియోలో అడుగు పెట్టాడు.

ప్రొప్రయిటర్ మంగళూరు బీడీ కాలుస్తూ అకౌంటు పుస్తకం ముందేసుకుని కూర్చున్నాడు. సుధాకర్ వెళ్ళి అతనికెదురుగా వున్న కుర్చీలో జేరబడ్డాడు.

"ఫోటో తీయించుకుంటారా?" అడిగాడతను బీడీ అవతలకు పారేస్తూ.

వద్దన్నట్లు తలూపాడు అడ్డంగా సుధాకర్.

"నాతో పనుందా?" అడిగాడు.

"ఆఁ!"

"చెప్పండి!" అన్నాడు.

"నేను మద్రాసులో మాలాపిక్చర్సు పేరిట సినిమా తీస్తున్నాను. క్రొత్తవాళ్ళు కావాలని పేపర్లో ప్రకటించాను. చాలామంది ఉత్తరాలు రాసి ఫోటోలు పంపారు. మా ఆఫీసులో, పొరపాటుగా ఉత్తరాలు, ఫోటోలూ విడిపోయాయి. వాటిల్లో అందమైన ఫోటో దొరికింది. అడ్రసు పోయింది. కానీ దాని వెనుక ఆ ఫోటో ఎక్కడ తీసిందీ రబ్బరుస్టాంపు వేసివుంది. అందుకే వచ్చాను" అన్నాడు సుధాకర్.

"మా స్టూడియోదా?" అడిగాడు అతను.

"అవును" అంటూ ఫోటో తీసి పెట్టాడు బల్లమీద.

అతను దాన్నందుకుని చూశాడు. చూసిన వెంటనే ఉలిక్కిపడటం గమనించాడు సుధాకర్. వెనక్కి తిప్పి,

చూశాడు. రబ్బరు స్టాంపు చూసి దానిపైన రాసి వుంది కూడా లోలోపలే చదువుకొని, ఫోటో తిరిగి టేబుల్ పైన పడేశాడు.

"నాకతని అడ్రసు కావాలి!" అన్నాడు సుధాకర్.

"తీసింది నేనే! కానీ అతనెవరో నాకు తెలీదు. కార్లో వచ్చాడు. ఫోటో తీయించుకున్నాడు. నాలుగు కాపీలతోపాటు నెగటివ్ కూడా డబ్బిచ్చి తీసుకొన్నాడు. బిల్ కూడా అవసరం లేదన్నాడు. అందువల్లే నాకు బాగా గుర్తుంది" అన్నాడు.

"ఐ. సీ. బాగా ఆలోచించండి. అతనిదీవూరే అయి వుండాలి. అతనికి రాబోయే మంచి అవకాశం అనవసరంగా పోతూంది. అతని అడ్రసు చెప్పగలిగితే, అతన్ని కలుసుకుని మా పిక్చరులో వేషం ఇస్తారని చెప్పానంటే ఎగిరి గంతేసి, మీరు చేసిన సహాయానికి తగిన ప్రతిఫలం ఇస్తాడు. గుర్తు తెచ్చుకునేందుకు ప్రయత్నించండి" అన్నాడు సుధాకర్.

"సారీ! నాకు అడ్రసులతో అవసరం ఎప్పుడూ వుండదు. వాళ్ళకై వాళ్లు చెప్తే తప్ప మరెవ్వర్నీ అడగను" అన్నాడతను.

"అయితే మీవల్ల నాకు సాయం లభించదంటారా?" అడిగాడు సుధాకర్ లేస్తూ.

"క్షమించండి! నే నీ విషయంలో నిస్సహాయుణ్ణి" అన్నాడు అతను.

సుధాకర్ దిగి రోడ్లోకొచ్చి నిలుచున్నాడు.

అంగట్లోనుండి అతను గబగబ వచ్చి "చూడండీ! ఒకవేళ నేను అతన్ని మళ్ళీ చూస్తే మీ గురించి చెప్పగలను. మీ రిక్కడే వుంటారా? లేక మద్రాసు కెళ్ళిపోతారా?" అడిగాడు. సుధాకర్ అతని వంక విస్తుపోతూ చూశాడు.

"రెండ్రోజులుంటాను."

"మీ అడ్రసు చెప్పండి. గుర్తొచ్చినా, లేక అతను కనుపించినా మీకు తెలియపరుస్తాను," అన్నాడు అతను.

"హోటల్ బ్లూ మూన్ రూం నెంబరు అరొందలా ఆరు. విశ్వనాథ్ అని అడగండి" అన్నాడు సుధాకర్.

"అలాగే!" చెప్పాడు అతను వెళ్ళిపోతూ.

సుధాకర్ తిన్నగా హోటల్ కు చేరుకున్నాడు. వసంత రాత్రి ఒంటిగంటకు వచ్చింది.

"ఏమయినా తెలిసిందా?" అడిగాడు సుధాకర్.

"ఆఁ! చాలా తెలిసింది?" అంది కూర్చుంటూ.

"చెప్పు!" అన్నాడు ఉత్సాహంగా.

"ఈగల్ బార్ అండ్ రెస్టారెంటులో మాధవి కాబరే డాన్సర్ గా పనిచేసిందట. ఆమె వెళ్ళిపోయి నెలపైగా అయిందని సర్వర్ చెప్పాడు. కాని ఆమె పేరు మాధవి కాదని రోజాని చెప్పాడు" అంది వసంత.

"ఇంకా ఏం తెలుసుకున్నావ్?"

"నాకు ఈ విషయాలు చెప్పిన సర్వర్ ఇంటి అడ్రసు సంపాదించుకొచ్చాను. అతను పగటిపూట ఇంట్లోనే వుంటాడట. మనం ఒకమారు వెళ్ళి కలుసుకుంటే సంగతులు ఇంకా ఎక్కువ తెలుస్తాయనుకుంటాను" అంది వసంత.

"గుడ్! తిన్నగా ఈగల్ బార్ కి వెళ్ళావా లేక మరేదైనా క్లబ్ కు వెళ్ళావా?"

"లేదు. అది ఐదోది. మిగిలిన నాలుగు చోట్ల నాకేం సమాచారం తెలీలేదు. కానీ నాలుగో హోటల్ లో సర్వర్ ఈగల్ బార్ లో చూడమన్నాడు" అంది వసంత.

"నువ్వు మాధవి సారీ రోజాను గురించి ఎందుకు వాకబు చేస్తున్నదీ అతను అడిగాడా?"

"ఆఁ! మా చెల్లెలని చెప్పాను" అంది వసంత.

"నా మీద నువ్వే నయం. నేను వెళ్ళినచోట సమాచారం రవంతకూడా దొరకలేదు. కానీ నా అనుమానం నిజమైతే, మనమీద త్వరలోనే దాడి జరుగుతుందని పిస్తుంది" అన్నాడు సుధాకర్.

"అయితే మనం జాగ్రత్తగా వుండాలంటారు?"

"ఆఁ! ఎక్కువ జాగ్రత్తగా వుండాలి!" అన్నాడు సుధాకర్.

ఇద్దరూ చెరో మంచంపైన పడుకున్నారు. తిరిగి తిరిగి వుండటంవల్ల వెంటనే నిద్రపట్టేసింది.

సుధాకర్ మళ్ళీ కళ్ళు తెరచేసరికి కిటికీలోంచి సూర్య కిరణాలు మంచంమీద పడుతున్నాయి. లేచి కూర్చుని ఒళ్ళు విరచుకున్నాడు. ఎదురుగా టీపాయిపైన రెండు చిన్న ఫ్లాస్కులు కనుపించాయి. మూత తీసి చూశాడు. కాఫీ పొగలు కక్కుతోంది.

ఆర్డరివ్వకుండానే కాఫీ ఎవరు తెచ్చి పెట్టారో అర్థం కాలేదు. వెళ్ళి తలుపులు తీసి పరీక్షగా చూశాడు. గాడ్రెజ్ తాళం ఏల్ లైపుది వుంది. అంటే తియ్యడం, వెయ్యడం, లోపలా బయటకూడా చెయ్యొచ్చు.

ఫోన్ తీసి రిసెప్షను పిలిచి కాఫీ ఎవరు పంపారని అడిగాడు. అతను మీరే పంపమన్నారుగదండీ అనటంతో అనుమానం ఎక్కువయింది. లేచి సూట్ కేసు తెరచి అందులోంచి ఎర్ర లిట్మస్ పేపరు ముక్కొకటి త్రుంచి ఫ్లాస్కు మూత తీసి వేశాడు. పైకి తేలి నీలంగా మారి పోయింది. అంటే అందులో ఏదో కలిసివుందన్న విషయం అర్థమైంది.

వసంత లేచింది. సుధాకర్‌ను చూసి "ఎంత సేపయింది లేచి?" అడిగింది.

"ఇంతకుముందే లేచాను!" చెప్పాడు సుధాకర్.

"కాఫీ తెప్పించారా?" అడిగింది.

"లేదు! మన మిత్రులు మనకోసం విషంకలిపి పంపారు!" అన్నాడు జరిగింది వివరంగా చెప్తూ సుధాకర్.

విని విస్తుపోయింది వసంత.

"పెద్ద ప్రమాదం తప్పింది!" అంది ఊపిరి పీల్చుకుని.

"జరిగిందాన్ని బట్టి మన పరిశోధన సరయిన మార్గం లోనే సాగుతోందనుకోవాలి. మనకు కావలసిన మనుషులే మనల్ని చంపేందుకు ప్రయత్నించారు. అంటే వాళ్లెవరో ఇక్కడే వున్నారు!" అన్నాడు సుధాకర్.

"మద్రాసుకు ట్రంకాల్ చేసి మాధవి జాడేమైనా తెలిసిందేమో కనుక్కుందామా" అడిగింది వసంత.

సుధాకర్ ట్రంకాల్ బుక్ చేశాడు.

కాలకృత్యాలు తీర్చుకుని వచ్చేసరికి కనెక్షను దొరికింది మద్రాసుతో. మాధవి జాడ తెలీలేదని చెప్పాడు ప్రొఫ్యా సర్ సుబ్బారావు.

ఇద్దరూ డ్రెస్ చేసుకుని క్రిందికొచ్చారు. రెస్టారెంటు లోనే టిఫిను తిని కాఫీ త్రాగి వెలుపలికొచ్చి ఆటో రిక్షా ఎక్కారు.

వసంత అడ్రసు చెప్పింది.

ఆటో అడ్డదిడ్డంగా అటూ ఇటూ అరగంట తిరిగి ఒక యింటి ముందాగింది. అక్కడప్పటికే చాలా మంది జనం గుమిగూడి వున్నారు. ఒక పోలీసువాన్ కూడా వుంది దగ్గర్లోనే ఆగి.

సుధాకర్ ఒకతన్ని పిలిచి "ఏమయింది" అని అడిగాడు.

"లక్ష్మయ్యను ఎవరో తుపాకీతో కాల్చి చంపారు" చెప్పాడు.

"అతనే మనకు కావలసిన మనిషి" అంది వసంత.

"అతను ఇంకా వివరాలు చెప్పకుండా నోరుమూసే శారు" అన్నాడు సుధాకర్.

"ఇప్పుడు మనమేం చేద్దాం?" అంది వసంత.

"గుట్టుగా వెళ్ళిపోదాం!" అన్నాడు సుధాకర్.

ఇద్దరూ తిరిగి ఆటో ఎక్కారు.

లకిడీకాపూల్ పోనిమ్మన్నాడు సుధాకర్. ఆటో స్పీడందుకుంది. మళ్ళీ రామా స్టూడియో ముందాపించి దిగి లోనికి వెళ్ళాడు. ఉదయంవేళ కావడంవల్ల జనం ఎవ్వరు లేరు. ప్రొప్రయిటరు మాత్రం కూర్చుని వున్నాడు.

సుధాకర్‌ను చూడగానే లేచి నిలబడి "రండి! రండి!" అన్నాడు.

"ఏమయినా గుర్తొచ్చిందా?" అడిగాడు సుధాకర్.

"లేదండీ!" అన్నాడు అతను.

"మీ పేరు నాకు తెలీదు! నిన్న నేను మీకు చెప్పిన్దంతా అబద్ధం. నా పేరు సుధాకర్. ప్రైవేట్ డిటెక్టివ్‌ను. ఒక కేసు సందర్భంగా ఇక్కడికొచ్చాను. అది తేలందాకా వెళ్ళను. నేరస్తులతోపాటు వాళ్ళకు సాయంచేసిన వాళ్ళకు కూడా ఇనుపబేడీలు తగిలించాకే వెళ్తాను. ఆ విషయం చెప్పేందుకే వచ్చాను" అన్నాడు సుధాకర్.

అతను కంపించిపోయాడు.

"నా కెందుకండీ చెప్పడం! నాకేం తెలీదు!" అన్నాడతను.

"నీకేం తెలుసో, ఏం తెలీదో నాకు తెలియదనుకోవద్దు. నీకై నువ్వు నిజం చెప్పావంటే ఏ కష్టం రాకుండా చూస్తాను. లేదంటే ఆ ఫలితం నువ్వే అనుభవిస్తావ్!" అన్నాడు సుధాకర్. ఆ తర్వాత అక్కడ క్షణం ఆగ

కుండా వచ్చేశాడు ఆటో వద్దకు. ఎక్కి కూర్చుని హోటల్ కు పోనిమ్మన్నాడు. ఆటో కదలింది. వేగం అందుకుంది.

ఉదయం తనపైన జరిగిన విష ప్రయోగానికి కారకుడీ ఫోటో స్టూడియో వాలాయేనని గట్టి నమ్మకం ఏర్పడింది. తను చూపించిన ఫోటోలోని వ్యక్తి ఎవడో అతనికి తెలిసుండాలి. తను వచ్చి చేసిన ఎంక్వాయిరీ గురించి చెప్పి, తనెక్కడుంటున్నదీ కూడా అతనే చెప్పి వుండాలి. లేకుంటే తన అడ్రసు తెలిసిన మనిషి వేరే ఎవ్వరూ లేరు.

ఆటో హోటల్ కు వచ్చింది. దిగి డబ్బులిచ్చి పంపి రిసెప్షనులోకి వెళ్ళాడు సుధాకర్. వసంత తిన్నగా గదికి వెళ్ళిపోయింది.

ఆ దినం ఉదయం కాఫీ గదికి తెచ్చిన సర్వరును తన వద్దకు పంపమని చెప్పాడు రిసెప్షనిస్టుకు సుధాకర్. అతను అలాగే పంపుతానన్నాడు. కాసేపు టెలిఫోన్ కనెక్షను వంక గమనించి చూశాడు. మనస్సులోనే ఏదో గొణుకున్నాడు. వెలుపలికొచ్చి తిన్నగా లిఫ్టువద్దకు నడిచాడు.

"ప్రొద్దున కాఫీ తెచ్చింది నువ్వేనా?" అడిగాడు సుధాకర్ ఎదురుగా నిలబడ్డ పొట్టి వ్యక్తిని.

"నేనేసార్!" అన్నాడు అతను.

"నీ పేరు!"

"యాదగిరి సార్!"

"ఎక్కడుండేది?"

"ఇక్కడే సార్!"

"నువ్వు తెచ్చిన కాఫీలో విషం కలిసివుంది. నువ్వే కలిపావా?" సుధాకర్ గద్దించి అడిగాడు.

"నాకేం తెలీదు సార్!"

"నిజం చెప్పు! లేకుంటే నీమీద పోలీసు కంప్లయింట్

యిస్తాను. నువ్వే కలిపావా? లేక మరెవరన్నా కలప మన్నారా?''

''అదేం లేదు సార్! నేను కాఫీ తీసుకొని పైకొచ్చాను. ఒకతను వరండాలో తారట్లాడుతూ కనుపించాడు. కాఫీ ఆరొందలా ఆరుకేనా అని అడిగాడు. అవునన్నాను. వేడిగా వుందాని అడిగాడు మళ్ళీ. దానికీ అవునన్నాను. అతనక్కడే నిలబడ్డాడు. నేను గది తలుపు నెట్టాను. రాలేదు.మీరు నిద్రపోతున్నారేమోనని ట్రే అక్కడే పెట్టి డూప్లికేట్ తాళంకోసం వెళ్ళాను. తిరిగొచ్చేసరికి అతను లేడు. బహుశా అతనే కాఫీలో విషం కలిపి వుంటాడు'' అన్నాడు యాదగిరి.

''అతన్ని చూస్తే మళ్ళీ గుర్తుపట్టగలవా?'' అడిగాడు సుధాకర్.

''సులభంగా గుర్తుపడతాను సార్!'' చెప్పాడతను.

''అయితే నువ్వెళ్ళు పిలిచినప్పుడురా!'' చెప్పిపంపాడు.

యాదగిరి వెళ్ళిపోయాడు.

వసంతతో చాలాసేపు తర్జన భర్జన చేశాడు సుధాకర్ కేసు వివరాలు. ఆ రాత్రి కిద్దరూ ఈగల్ బారుకు వెళ్ళాలని నిశ్చయించుకున్నారు.

# 5

ఆ రోజు రాత్రి తొమ్మిదింటికి బార్‌లో అడుగు పెట్టారు. వెళ్ళి ఒక మూల టేబుల్ వారగా కూర్చున్నారు.

భాయ్ రాగానే డ్రింక్స్, కోడిబిర్యానీ ఆర్డరుచేశాడు సుధాకర్. దూరంగావున్న స్టేజిపైన కాబరేడాన్సు ప్రారంభమయింది. సన్నగా మ్యూజిక్ స్టీరియో స్పీకర్ల లోంచి వినపడుతోంది.

విస్కీ చప్పరిస్తూ డాన్సు చూడసాగాడు సుధాకర్.

సర్వర్లంతా ఉన్నట్టుండి హడావుడి పడసాగారు. స్టేజికి దగ్గరగావున్న టేబుల్ ముందు కూర్చున్న విజిటర్సును అక్కడ్నుంచి బ్రతిమలాడి లేపి మరోచోట కూర్చోపెట్టారు. ఆ టేబుల్ కనపడకుండా నాలుగు వేపులా స్క్రీన్‌లు తెచ్చి అడ్డుపెట్టి చిన్న గదిలా చేశారు.

అంత హడావుడి ఎందుకు జరుగుతుందో అర్థంకాలేదు సుధాకర్‌కు.

సర్వర్లను పిలిచి అడిగాడు.

రాణీ రత్నకుమారి ఈ దినం బార్‌కు వస్తున్నట్లు ఫోన్ చేసింది. ఈగల్ బార్ అండ్ రెస్టారెంటు ఆమెదే. సిటీలో కెల్లా ఖరీదైన దిదేనన్నాడు. అండర్ గ్రౌండ్‌లలో జూదం, ఫస్ట్ ఫ్లోర్‌లో వ్యభిచారం యథేచ్ఛగా సాగిపోతుంటాయనికూడా చెప్పాడు.

పదినిమిషాల తర్వాత ఉలెన్ సూట్ ధరించిన అందమైన పొడవుపాటి కుర్రాడు ముందు నడుస్తూంటే అతని వెనుకగా రాణీ రత్నకుమారి నడచి రాసాగింది. ఆమె వెనుక ఇద్దరు దాసీలు వున్నారు. రత్నకుమారి కాళ్ళకు అడ్డంపడుతూ తెల్లటి బొచ్చు కుక్క నడవసాగింది. ఆ కుర్రాడేదో ఆమెకు చెప్తున్నాడు. ఆమె విని నవ్వుతూంది. వసంత కూడా ఆమెనే గమనించసాగింది. వాళ్ళు బాగా దగ్గరకొచ్చారు. ఆ కుర్రాడ్ని చూశాడు సుధాకర్. ఎక్కడో చూసినట్లనిపించింది. మెదడుకు పదును పెట్టాడు. జేబులోవున్న ఫోటో వెలుపలికి లాగాడు. అందులోవున్నది అతనే. ఏ విధమైన అనుమానంలేదు. సుధాకర్ కళ్ళు ఆనందంతో మెరిశాయి.

వసంత చెవిలో మెల్లగా ఏదో చెప్పాడు సుధాకర్. ఆమె లేచి వెలుపలకు వెళ్ళింది. సుధాకర్ డ్రింకు త్రాగుతూ కూర్చున్నాడు.

రత్నకుమారి మొహాన బొట్టులేదు. ఆమె భర్త పోయాడేమో ననుకున్నాడు. వసంత లోనికొచ్చింది. వచ్చి తన సీట్లో కూర్చుంది.

"చూశావా?" అడిగాడు సుధాకర్.

"తెల్ల ఇంపాలా కారుంది. అది రాణీ రత్నకుమారిదని అక్కడున్న వాచ్ బాయ్ చెప్పాడు."

సర్వరు కోడిబిర్యానీ తెచ్చిపెట్టాడు.

పదిరూపాయల కాగితం జేబులోంచి తీశాడు సుధాకర్. సర్వరుకు అందిస్తూ "నాకు కావలసిన వివరాలు చేప్తే ఇది నీదే!" అన్నాడు.

ఠక్కున దాన్ని లాక్కుని "అడగండి!" అన్నాడు వాడు.

"ఇక్కడ కాదు! నీ డ్యూటీ ఎప్పుడు ముగుస్తుంది."

"తెల్లారి ఆరింటికి."

"అయితే నువ్వు ఈ రోడ్ చివరనున్న పోస్టాఫీసు దగ్గరుండు. నేనొచ్చి పిల్చుకుపోతాను. నాకు కావలసిన వివరాలు మొత్తం నీ ద్వారా తెలిస్తే పెద్ద కాగితం ఇస్తాను" అన్నాడు సుధాకర్.

"అలాగే సార్!" అన్నాడు సర్వరు.

"ఆ రాణీ గారి ముందు నడిచిన సూట్ వాలా ఎవరు?"

"అతనే రమేష్‌బాబు. ఒకప్పుడు దీనికి మేనేజర్. ఇప్పుడు ఓనరు సార్!" అన్నాడు,

"సరే నువ్వెళ్ళి నీ పని చూసుకో!" అన్నాడు సుధాకర్.

సర్వరు వెళ్ళిపోయాడు.

సుధాకర్ తింటూనే గమనించసాగాడు. స్క్రీన్ల మధ్యనున్న టేబుల్ వైపు సర్వర్లు ఆసులో దారంలా తిరుగుతూనే వున్నారు. వాళ్ళేం తాగుతున్నారో, ఏం

తింటున్నారో అంతుపట్టలేదు. అలా దాదాపు మూడు గంటల కాలం గడిచిపోయింది. రాణీ రత్నకుమారి వెలుపలకు వచ్చింది. ఆమె కాళ్ళదగ్గరకు కుక్క తారట్లాడు తూంది. ఆమె ప్రక్కనే రమేష్‌బాబు నడవసాగాడు. ఆమెకన్నా అరడుగు ఎత్తున్నట్లనిపించింది సుధాకర్‌కు. వాళ్ళు టేబుల్స్ మధ్యనుంచి వెళ్ళారు వెలుపలకు.

సుధాకర్ లేచాడు. వసంతకూడా అనుసరించింది. ఇద్దరూ చేతులు పట్టుకుని రాణీగారి వెనకాలే వెలుపలి కొచ్చారు.

ఇంపాలా కారెక్కింది రాణి. అది కదులుతుంటే చెయ్యి ఊపుతూ నిలబడ్డాడు రమేష్. సుధాకర్ అతనితో మాట్లాడుదామనుకున్నాడు. అది సరయిన టయిమ్ కాదని మానుకుని, అక్కడే ఆగివున్న టాక్సీ ఎక్కాడు. వసంత కూడా ఎక్కింది. టాక్సీని హోటల్‌కు పోనిమ్మన్నాడు.

రాత్రి నిద్రపోలేదు. ఐదింటికల్లా డ్రెస్ చేసుకుని ఒంటరిగా బయలుదేరాడు. వసంతను జాగ్రత్తగా వుండమని చెప్పాడు. ఈగల్ బార్ వున్న రోడ్ చివరనున్న పోస్టాఫీసు ముందు నిలుచున్నాడు. చలి ఎక్కువగా వుంది. సిగరెట్ ముట్టించాడు.

ఆరయింది. సర్వరు రాలేదు. ఏడు దాటింది. అతని జాడలేదు. ఓపికగా ఎనిమిదింటిదాకా చూశాడు. అప్పటికీ రాకపోవడంతో ఇంక అతను రాడని తీర్మానించుకున్నాడు. అతనికయి అతనే రాలేదా? లేక తన్ను కలుసుకుంటాడని తెలిసి రానీకుండా చేశారాని ఆలోచించసాగాడు. అక్కడ నిలబడి లాభంలేదని టాక్సీ ఎక్కి తిన్నగా లకిడీకాపూల్ కొచ్చాడు. రామా స్టూడియోలో కడుగుపెట్టాడు.

స్టూడియో ఓనరు బిల్లులు రాసుకుంటున్నాడు. తలెత్తి చూశాడు సుధాకర్‌ను.

"నువ్వు చెప్పకున్నా ఆ ఫోటోవాలను కలుసు కున్నాను" అన్నాడు సుధాకర్.

"ఎక్కడ?" అడిగాడు.

"ఈగల్ బార్ లో."

"ఎప్పుడు?"

"రాత్రి!"

"అతనితో మాట్లాడావా?" అడిగాడతను భయంగా.

"మాట్లాడాను. నా అడ్రసు నీకెవరిచ్చారని అడిగాడు. నీపేరు చెప్పాను. చాలా సంతోషించాడు. నీకు తగిన బహుమానం ఇస్తానన్నాడు" అన్నాడు సుధాకర్.

అతనికి ముచ్చెమటలు పోశాయి.

"అతన్ని గురించి నీకు నేనేమీ చెప్పలేదు. బుకా యించకు" అన్నాడు.

"బుకాయింపు కాదు. నిజం. అతని పేరు రమేష్. మొన్నటిదాకా రీగల్ బార్ కు మేనేజరుగా వుండేవాడు. ఈ మధ్య దాని ఓనరయినాడు. రాణీ రత్నకుమారి దగ్గర బార్ ను కొన్నాడు. ఈ వివరాలు చాలా? ఇంకా చెప్పాలా?" అడిగాడు సుధాకర్.

అతను తెల్లపోతూ పక్కన ఫోన్ అందుకుని ఏదో నెంబరు డయల్ చేశాడు. కనెక్షను రాగానే అతని పేరూ స్టుడియో పేరూ చెప్పి, గొంతు చించుకుని చెప్ప సాగాడు తనకేం తెలీదని. అవతలి అతను చెప్పిన మాటలు సుధాకర్ కు వినిపించలేదు. అతన్ని వదలి వెలుపలకొచ్చి టాక్సీ ఎక్కి హోటల్ కు వెళ్లాడు.

గదికి వెళ్ళగానే వసంత "మీకు ఫోన్ వచ్చింది మద్రాసునుంచి నాయర్ చేశాడు" చెప్పింది.

"ఏమిటి విశేషాలు?" అడిగాడు కూర్చుంటూ.

"మాయమైన మాధవి కనుపించిందండి."

"ఎక్కడ?"

"ఎన్నూరుదగ్గర సముద్రపు బ్యాక్ వాటర్‌లో ఆమె శవం తారుడబ్బాలో తేలియాడుతూందట. చేపలు పట్టే వాళ్ళు చూసి శవాన్ని పోలీసులకు అప్పగించారట. సుబ్బారావు, మూర్తి వెళ్ళి చూశారట. ఆమె మాధవని గుర్తు పట్టారుట కూడా!" చెప్పింది వసంత.

"ఎలా చనిపోయింది తెలిసిందటనా?"

"ఆఁ! గొంతు నులిమి చంపారట. ఆమె పిడికిట్లో ఒక ఖరీదైన గోల్డ్ లాకెట్ వుందట. దానిపైన ఆర్ అనే ఇంగ్లీషు అక్షరం కూడా వుందట. మిమ్మల్ని త్వరగా వచ్చెయ్యమని చెప్పారు, నాయర్" అంది వసంత.

"ఐ. సీ" అంటూ తలూపాడు.

"మీరెళ్ళిన పనేమయింది?"

"ఆ సర్వరు రానేలేదు!"

"అయితే అతన్ని కూడా హతమార్చి వుంటారు" అంది వసంత.

"మనం మద్రాసు వెళ్ళి ప్రయోజనం లేదు. కథానాయకులు ఇక్కడే వున్నారు. మాధవిని చంపిన హంతకుడ్ని పట్టుకున్నాకే మనం వెళ్ళేది," అంటూ ఫోన్ తీసుకుని మద్రాసుకు నాయర్‌కు ఫోన్ చేశాడు సుధాకర్.

కనెక్షను దొరకగానే వివరాలు మాట్లాడి, మాధవి శవం ఫోటోలు రెండు సాయంత్రం ఫ్లైట్‌లో ఎవరిద్వారానన్నా పంపమని కోరాడు. నాయర్ అలాగే పంపుతానని హామీ ఇచ్చాడు.

పేపరు వాళ్ళకిచ్చేందుకోసం న్యూస్ ఐటమ్‌లా మాధవి హత్య గురించి వివరాలు తయారుచేసి రెండు కాపీలు రాయించాడు వసంత చేత. ఫోటోలు సాయంత్రం చేరాయి. తను రాయించిన రిపోర్టును, ఫోటోను, పర్స

నల్‌గా వెళ్ళి రెండు లోకల్ పేపర్ల ఆఫీసుల్లో డెలివరీ చేశాడు.

పోలీసు హెడ్‌క్వార్టర్సులో వున్న తన ఫ్రెండు డి.ఐ.జి.దిగంబరరావును కలుసుకుని, తనొచ్చిన పని గురించి వివరంగా చెప్పి, ఈగల్‌బార్ గురించి, అందులో ముఖ్యంగా రమేష్‌బాబు, రాణీ రత్నకుమారి గురించి వీలైనంత సమాచారం అందించమని కోరాడు. మరుసటి దినం వస్తే తప్పక తీయించి వుంచుతానని హామీ ఇచ్చాడు.

# 6

మర్నాడు డి.ఐ.జి. దిగంబరరావును సుధాకర్ కలుసుకున్నాడు.

కాఫీలు త్రాగాక "నేనడిగిన ఇన్‌ఫర్మేషన్ సంపాదించారా?" అడిగాడు సుధాకర్.

"ఆఁ! రమేష్ అన్నతను ఈగల్‌బార్‌కు మానేజర్‌గా వచ్చాక అక్కడ రెండుసార్లు పోలీసు రైడింగ్ జరిగింది. గాంబ్లింగ్, వ్యభిచారం జరుగుతున్నా యక్కడ. కానీ పెద్దవాళ్ళెవరో వాళ్ళమీద కేసుపెట్టకుండా అడ్డుపడ్డారు. రాణీ రత్నకుమారి భర్తయిన రాజా రవిచందర్ ఈమధ్యనే హత్య కాబడ్డాడు. హత్య చేసింది అతని సర్వెంటేనని సనాక్ష్యంగా ఋజువయింది. కానీ అతను పరారయినాడు. అందువల్లేమీ చేయలేకపోయాం," అన్నాడు డి.ఐ.జి.

"మానేజర్‌గా పనిచేసే రమేష్ ఉన్నట్టుండి ఈగల్‌బార్‌ను ఎలా కొనగలిగాడో నాకు అర్థంకావడంలేదు. ఇది రాజా రవిచంద్ర గారు బ్రతికివున్నప్పుడే కొన్నారా .లేక చనిపోయాక నా?" అడిగాడు సుధాకర్.

"నాకు తెలీదు" అన్నాడు డి.ఐ.జి.

"రవిచంద్రగారి నెలా హత్యచేశాడు సర్వెంట్!"

"ఆ సర్వెంట్ భార్యను రవిచంద్రగారు బలవంతంగా అనుభవించాడట. ఆమె ఆ అవమానం భరించలేక తోటలో వున్న నూతిలో దూకి ఆత్మహత్యా చేసుకుంది. ఈ విషయం ఒక ఉత్తరం రాసిపెట్టింది. దాన్నిచూసి అతను రెచ్చిపోయాడు. రవిచంద్రగారు తోటలో తిరుగుతూంటే తుపాకీతో కాల్చి చంపాడు. ఆ తర్వాత అతనుగూడ దూకి పారిపోవడం వంటమనిషి చూశాడు. అతని సాక్ష్యంకూడా నమోదు చేశాం."

"ఆ టైమ్‌లో రత్నకుమారి ఇంట్లో లేదా?"

"లేదు! బెంగుళూరు కెళ్ళింది. ఆమె హోటల్‌కు ఫోన్ చేసి చెప్పాం. వెంటనే వచ్చేసింది."

"గుడ్! ఇందులోనే ఏదో తికమక వుంది. నాకా ఫైలివ్వండి. క్షుణంగా పరిశీలించి తిరిగి మీకు పంపిస్తాను," అన్నాడు సుధాకర్.

డి.ఐ.జి. అందించాడు.

సుధాకర్ దాన్ని బ్రీఫ్ కేసులో సర్దుకున్నాడు. హోటల్‌కు తిరిగొచ్చాడు. వసంతకు చెయ్యవలసిన పనులన్నీ వివరంగా చెప్పాడు. ఏదైనా సహాయం అవసరమైతే డి.ఐ.జి. దిగంబరరావును కలుసుకోమని పురమాయించాడు. తను తిన్నగా ప్లేన్‌లో బెంగుళూరు కెళ్లాడు.

ఇంపీరియల్ హోటల్‌లో మకాం పెట్టి, రత్నకుమారి ఫోటో చూపించి ఆమె అంతకుముందు ఆ హోటల్‌లో దిగిందాని వాకబుచేశాడు. రిసెపనిస్టు, రూం భాయ్స్, క్లీనర్లు ఎవ్వరూ ఆమెను గుర్తుపట్టలేకపోయారు. వాళ్ళకు తన దగ్గరున్న మాధవి ఫోటో చూపించాడు. వాళ్ళు చూసి ఆమె రత్నకుమారి అని ఘంటాపథంగా చెప్పారు. అక్క—

డింకేమీ చేయవలసింది లేకపోవటంతో తిన్నగా మద్రాసు వచ్చాడు.

నాయర్ భాయ్‌ని కలుసుకొని అంతదాకా తను తెలుసుకొన్న విషయాలన్నీ వివరంగా చెప్పాడు. లాకెట్ తెప్పించి చూశాడు. అతని పర్మిషన్ తీసుకొని దాన్ని జేబులో వేసుకున్నాడు.

"నీకు మరో విషయం చెప్పడం మరచాను. పోస్ట్‌మార్టం రిపోర్టు వచ్చింది. మాధవి చనిపోయేముందు గొంతుదాకా విస్కీ త్రాగిందని డాక్టరు అభిప్రాయపడ్డాడు. ఆమె గొంతునొక్కి చంపారట. గొంతుమీద ప్రెజర్ ఉపయోగించగానే ఆమెకు ఉచ్ఛ్వాసనిశ్వాసలు ఆగిపోయాయట. ఆ తర్వాత ప్రాణంపోయిందట. అన్నింటినీ మించి ఆమెకు మూడోనెల గర్భమట" అన్నాడు నాయర్.

"రియల్లీ పిటీ! ఆమెను చంపింది ఎవడో క్రొత్తమనిషయి వుండడానికి వీల్లేదు. బాగా తెలిసిన మనిషే అయి వుండాలి. నమ్మి మోసపోయి వుంటుందామె" అన్నాడు సుధాకర్.

# 7

సుధాకర్ రెండోరోజు ఉదయానికల్లా హైద్రాబాద్ తిరిగొచ్చాడు. హోటల్ గదికి తాళం వేసి వుంది. వెళ్ళి రిసెప్షన్లో అడిగాడు. వాళ్లు తాళం తనుకివ్వలేదని చెప్పారు. ముందురోజు రాత్రికూడా అతనితో వున్న స్త్రీ గదికి రాలేదని చెప్పాడు భాయ్. డూప్లికేటు తీసుకుని తలుపులు తెరచి గదిలోకి ప్రవేశించాడు.

వసంత ఏమయింది? రాత్రెందుకు గదికి తిరిగి రాలేదు?

ఆమె ఏమైనా ఆపదలో చిక్కుకుందేమోనని సుధాకర్ మనస్సు కలవర పడింది. వసంత అతని దగ్గర పన్నెండేళ్ళ

నుండీ పని చేస్తూంది. అంత సులభంగా కోరి అపాయం తెచ్చుకోదు. ఆమె ఎక్కడనో క్షేమంగానే వుంటుం దన్న ధైర్యంతోపాటు, హంతకుల ముఠా చేతుల్లో చిక్కి పోయిందేమోనన్న బెంగ మరోప్రక్క కలగసాగింది.

తనెక్కడకు వెళ్తున్నదీ తెలిపే నోట్ ఏమీ రాసి పెట్టినట్లు కనుపించ లేదు. రాత్రంతా రాకుండా ఎక్క డుండి వుంటుందాని ఊహించసాగాడు. అతనికే ఆలో చనా రాలేదు.

మధ్యాహ్నం మూడింటిదాకా వసంత కోసం ఎదురు చూశాడు. ఆమె జాడ లేదు. డ్రెస్ మార్చుకున్నాడు సుధాకర్. ముసలి జమీందారులా పద్ద పెద్ద దుబ్బ మీసాలు ధరించి, గోల్డ్ ఫ్రేమ్ అద్దాలు పెట్టుకున్నాడు. లావుపాటి చేతికర్ర తీసుకున్నాడు. డి. ఐ. జి. దిగంబర రావుకు ఫోన్ చేసి పెద్ద షెవర్లెట్ కారు తెప్పించు కున్నాడు. దిగి క్రిందికెళ్ళి కారెక్కి తనే డ్రైవ్ చేసు కొంటూ ఈగల్ బార్ కు వెళ్లాడు.

కారాంగగానే భాయ్ వచ్చి తలుపు తీశాడు. సుధాకర్ దిగి, లాక్ చేసి తాళాలు కోటుజేబులో వేసుకుని కర్ర సాయంతో మెల్లగా అడుగులు వేసుకుంటూ మెల్లె క్కాడు.

బార్ లోకి అడుగుపెట్టబోతూ కుడివేపువున్న గదికి తగిలించిన బోర్డుకేసి చూశాడు. దానిపైన మేనేజింగ్ డైరక్టరు అని రాసివుంది. అటుకేసి నడిచాడు. తలుపు ముందు లావుపాటి మనిషి కూర్చుని కునికిపాట్లు పడు తున్నాడు. కర్రతోనే అతని వీపుమీద తట్టాడు. అతను నిద్ర వదలించుకునేందుకు తల అటూ ఇటూ విదలించుకుని లేచి నిలబడ్డాడు.

"మీ అయ్యగారున్నారా?" అడిగాడు సుధాకర్.

"ఉన్నారు" చెప్పాడు అతను.

"గొల్లపాళెం జమీందారు కుటుంబరావని చెప్పు. అర్జంటుగా మాట్లాడాలి" అన్నాడు సుధాకర్.

అతను లోనికి వెళ్ళి రెండు నిముషాల్లో తిరిగొచ్చి "అయ్యగారు రమ్మంటున్నారు" అన్నాడు.

సుధాకర్ తలుపు త్రోసుకుని లోనికెళ్ళాడు.

రమేష్‌బాబు విస్కీ గ్లాసు టీపాయిపైన పెట్టి "స్వాగతం! సుస్వాగతం!! రండి! కూర్చోండి!!" తూలుతూ ఆహ్వానించాడు.

సుధాకర్ వెళ్ళి అతని కెదురుగా వున్న సోఫాలో జేరబడ్డాడు.

"ఏంకావాలి?" అడిగాడు రమేష్.

"రేపు రాత్రికి పెద్ద పార్టీ ఒకటి ఇవ్వాలనుకుంటున్నాను. చాలామంది మిత్రులు, పెద్దపెద్ద అధికార్లు వస్తారు. ఫారిన్ మందు కావాలి. వీలైతే పదిమంది ఫామిలి గరల్స్ కావాలి. ఇక తిండి సంగతి సరేసరి. ఏర్పాటు చెయ్యగలరా?" అడిగాడు సుధాకర్.

"ఈ ప్రపంచంలో నేనేదైనా ఏర్పాటు చెయ్యగలను. అయితే ఖర్చుకు వెనకాడకుండా వుండాలి! అంతే!!"

"డబ్బు నాకు సమస్యకాదు. ఎంత కావాలి?"

"ఎంతమందొస్తారు."

"ఇరవై మంది వుంటారు."

"మనిషికి వెయ్యి ఛార్జి చేస్తాను. రీజనబుల్" అన్నాడు రమేష్.

"అంత చీపనుకోలేదు నేను" అన్నాడు సుధాకర్ లెఖలేనట్లు.

"అంతా అడ్వాన్సుగా ముందే ఇవ్వాలి."

"ఓ. కే. చెక్కు రాసిచ్చేదా?"

"క్యాష్ లేదా?"

"ఈ రోజుల్లో అంత క్యాష్ పెట్టుకొని ప్రాణాలు పోకుండా పదిమందిలో తిరగగలమా?"

"చెక్కయినా ఫర్వాలేదు. రాసివ్వండి" అన్నాడు రమేష్.

"ఇలాంటి హోటల్ ఒకటి పెట్టాలని నా కన్నాళ్ళనుండో వుంది. కానీ మానేజ్ చేసేందుకు సరయిన మనిషి కావాలి. దీనికేమాత్రం పెట్టుబడి పెట్టారు."

"దాదాపు ఏడు లక్షలయిందట. నేను రెండు లక్షలకు కొన్నాను" అన్నాడు విస్కీ వొంపుకుంటూ.

"చీప్‌గా కొట్టేశావే!"

"వాళ్ళు మానేజ్ చేసుకోలేక నష్టాలు వస్తుంటే భరించలేక నాకిచ్చారు. నేనుఅమ్మేద్దామనుకుంటున్నాను."

"ఎంత కమ్ముతావ్?"

"ఆరులక్షల కిస్తాను" అన్నాడు రమేష్.

"నువ్వు కొన్నది రెండు లక్షలకే నన్నావ్. అంటే పదిదినాల్లో నాలుగు లక్షలు లాభం అన్నమాట!" అడిగాడు సుధాకర్.

"దీన్ని జాగ్రత్తగా, తెలివిగా నడుపుకుంటే నెలకు పాతిక వేలు ఆదాయం వస్తుంది."

"ఇది ఆరులక్షల రూపాయలు విలువచేస్తుందా?"

"అంతకన్నా ఎక్కువ చేస్తుంది. మీకు స్మగ్లింగ్ వ్యాపారం లాటిదుంటే నిర్భయంగా సామాను దాచుకునేందుకు అండర్ గ్రౌండ్ గదు లున్నాయి. అండర్ గ్రౌండ్ నుండే తప్పించుకొని వెళ్ళడానికి మార్గం కూడా వుంది."

"చూపించు. నచ్చితే కొంటాను."

"కొంటానంటే చూపిస్తాను. చూపించాక కొననంటే

ఒప్పుకోను" అన్నాడు రమేష్.

"ఐతే రేపు పార్టీ అయ్యాక నా నిర్ణయం చెప్తాను" అన్నాడు సుధాకర్.

"గుడ్! ఆలోచించుకోండి" అన్నాడు రమేష్.

సుధాకర్ చెక్ రాసిచ్చాడు, మద్రాస్ బేంక్ పైన ఇరవై వేల రూపాయలకు. రమేష్ అందుకున్నాడు. ఆ తర్వాత ఇద్దరూ కరచాలనం చేసుకున్నారు. సుధాకర్ తిరిగొచ్చి కారెక్కాడు.

కారు తిన్నగా రాణీరత్నకుమారి ఇంటికి పోనిచ్చాడు. ఊరి వెలుపల శివార్లలో వుంది బంగళా. చుట్టూ ఇరవై ఎకరాల ఖాళీ జాగాలో రకరకాల చెట్లున్నాయి. గేటు వద్ద నుండి బిల్డింగుకు దగ్గర దగ్గర అరమైలు దూరం వుంది.

కారు పోర్టికోలో ఆపి సుధాకర్ బజర్ నొక్కాడు. గుమ్మం తలుపు తెరచాడు తెల్లటి యూనిఫాంలో వున్న సర్వెంట్.

"రాణీగారున్నారా?" అడిగాడు సుధాకర్. వున్నట్లు తలూపాడు వాడు.

"గొల్లపాళెం జమీందారును. పేరు కుటుంబరావు. మీ అమ్మగారితో చెప్పు అర్జంటు పనిమీదొచ్చానని" అన్నాడు సుధాకర్.

అతను కూర్చోమని సోఫా చూపించి మేడపైకి వెళ్ళి పోయాడు. ఆ తర్వాత ఐదు నిమిషాలకు దిగి క్రింది కొచ్చాడు.

"అమ్మగారు పది నిముషాల్లో వస్తారు" చెప్పాడు అతను.

సరేనని తలాడించాడు. టీపాయిపై నున్న మాగజైన్ తీసి బొమ్మలు చూస్తూ కూర్చున్నాడు.

రాణీరత్నకుమారి దిగి క్రిందికొచ్చింది సుధాకర్‌కు నమస్కరించింది.

"కూర్చో అమ్మా!" అన్నాడు సుధాకర్.

"మీ పేరు నేనెప్పుడూ వినలేదు! నాతో ఏదో పనుందన్నారుట. చెప్పండి" అంది రత్నకుమారి పట్టుచీర పేటంచు సర్దుకుంటూ మునివ్రేళ్ళతో.

"మీ హీరో నేనూ కలిసి చదువుకున్నాం. వరే వరే అని పిలుచుకొనే వాళ్ళం. వాడ్ని మీ సర్వెంట్ ఎవరో హత్య చేసినట్లు పేపర్లో చదివాను. వాడి మొదటి భార్యతో రెండుసార్లు నా ఎస్టేటుకు వచ్చి రెండుసార్లు మకాం వేసి పోయాడు. మిమ్మల్ని తీసుకు రానేలేదు" అన్నాడు సుధాకర్ అంతా కల్పించి చెప్తూ.

"నా పెళ్ళయి ఆరు మాసాలయింది. ఇంతలోనే ఈ ఆపద ముంచుకొచ్చింది. నన్నిలా అన్యాయం చేసి వెళ్ళిపోయారు" అంది రత్నకుమారి.

"బాధ పడకమ్మా!" అంటూ ఓరడించాడు.

"ఇంతకూ నాతో ఏం పనుండి వచ్చారో చెప్పనే లేదు" అంటూ గుర్తు చేసింది రత్నకుమారి.

"ఈగల్ బార్‌కు వెళ్ళా నీదినం. అదింకా మీ దేనను కున్నాను. అమ్మేశారటగా. అతని పేరేదో చెప్పాడు. ఆఁ! రమేష్ అనుకుంటాను. అతను దాన్ని అమ్ముతా నన్నాడు."

"మీరు కొంటారా?"

"కొందామనే! అయితే ఆరు లక్షలు చెప్తున్నాడు."

రత్నకుమారి మాట్లాడలేదు.

"మీరు అతనికి దాన్ని రెండు లక్షలకే అమ్మినట్లు తెలిసింది. నా దగ్గర నాలుగు లక్షలు ఎక్కువ ఇస్తాటా

లనుకుంటున్నాడు. అంత చీప్ గా అమ్మేయడానికేమైనా కారణాలున్నాయా?" అడిగాడు సుధాకర్.

"అంటే మీ ప్రశ్న నాకర్థంకాలేదు."

"ఎలాగోలా వదిలించుకుందామనుకున్న పరిస్థితుల్లో మీరు అమ్మేశారేమోనన్న అనుమానం వచ్చింది. ఎక్కువ డబ్బిచ్చి లేనిపోని తలనొప్పి కొని తెచ్చుకోవడ మాత్రం దేమోనన్న భయంతో మిమ్మల్ని సంప్రదించాలని వచ్చాను" అన్నాడు సుధాకర్.

"ఆయనుండగా అన్నీ ఆయన చూసుకునేవారు. నాకు వీటి గొడవలు తెలీవు. అక్కడన్ని రకాల జూదాలు జరుగుతుంటాయట. ఆ సమానం పోలీసులతో పని. ఆడ దాన్ని. ఆ గొడవలు పడలేనన్న భయంతో ఇంతదాకా మేనేజరుగానున్న ఆ రమేష్ కు అమ్మేశాను" అంది రత్న కుమారి.

"అంతేగదా?" అడిగాడు సుధాకర్.

"అంతే!" అంది రత్నకుమారి.

సర్వెంట్ రెండు కప్పుల కాఫీ ట్రేలో పెట్టు కొచ్చాడు. ఇద్దరూ తాగారు. "రవిచంద్ర లేకుంటే ఇల్లంతా చిన్న బోయినట్లుంది!" అన్నాడు లేస్తూ.

# 8

సుధాకర్ వెళ్ళగానే ఫోన్ తీసుకుని ఈగల్ బార్ కు రింగ్ చేసింది.

అవతలి వేపునుండి "హల్లో!" అన్న శబ్దం వినిపించ గానే "ఎవరు? రమేషేనా?" అడిగింది.

"ఆఁ!" అన్నాడు రమేష్.

"నీకా క్లబ్ ఇచ్చింది లాభానికి అమ్ముకునేందుకు కాదు! బతకడానికి" అంది కోపంగా రత్నకుమారి.

"నా పని చచ్చేట్లుంది. పోలీసులు, డిటెక్టివ్‌లు చుట్టు కుంటున్నారు. వాళ్ళల్లో ఒకతెను తెచ్చి క్లబ్‌లో దాచి పెట్టాను. నా గొడవ బైట పడకముందే ఇక్కడ్నుంచి మకాం ఎత్తేదా మనుకుంటున్నాను. నీ పాపం కూడా పండకముందే ఎటైనా వెళ్ళిపో!" సలహా ఇచ్చాడు రమేష్.

"నోర్ముయ్యి! నేనెవరో తెలిసే మాట్లాడుతున్నావా? నాకున్న డబ్బుతో ఎవరి నోరైనా మూయించగలను" అంది రత్నకుమారి.

"సరే! నీ పాట్లు నువ్వు పడు. నేను క్లబ్ అమ్మి డబ్బు తీసుకుని ఎటైనా వెళ్ళిపోతాను" అన్నాడు.

"నో! నేనొప్పుకోను. అలా చేశావంటే నేనే నిన్ను పట్టిస్తాను. నాకు లేనిపోని ఆశలు పెట్టావ్. వాడు కున్నావ్. మనకు అడ్డుండగూడదని నా భర్తను చంపించావ్. ఇంత చేశాక ఇప్పుడు నీ సుఖం చూసుకుంటానంటే చూస్తూ వదిలేస్తాననుకోకు. నీ పిచ్చి ఆలోచనలు కట్టిపెట్టు. బుద్ధిగా బార్ నడుపుకుంటూ వుండు" అంది రత్నకుమారి.

"నాతో అనవసరంగా తలపడకు. నీ బ్రతుకు బజారున పడేస్తాను" బెదిరించాడు రమేష్.

"అదీ చూద్దాం! ముందా ఆడమనిషిని వదిలించుకో. లేకుంటే ఆమెకోసం వెతుకుతూ వస్తారు పోలీసులు. అప్పుడు చిక్కిపోతావ్" అంది రత్నకుమారి.

"నేనేం చెయ్యాలో నాకు చెప్పనవసరం లేదు" అంటూ రేష్‌గా ఫోన్ క్రేడిల్‌పైన పడేసిన చప్పుడు కావడంతో రత్నకుమారి ఫోన్ క్రింద పెట్టింది.

# 9

రాత్రి పదిగంటలయింది.

సుధాకర్ నల్లటి సూటు ధరించాడు. హోటల్ గదికి తాళం వేశాడు. క్రిందికొచ్చి కారెక్కి గత్నకుమారి ఇంటికి పోనిచ్చాడు. బంగళాకు దూరంగా కారాపి దిగాడు. చిన్న పెన్ టార్చి తీసుకొని కాంపౌండ్ గేట్ దగ్గర కొచ్చాడు. దూరంగా వున్న బంగళాలో లైట్లు ఆరిపోయి వున్నాయి. అంటే అంతా నిద్రకు ఉపక్రమించి వుండాలనుకున్నాడు సుధాకర్. గోడవారగా నడచి బంగళా వెనక్కి వెళ్ళాడు.

కాంపౌండ్ గోడదూకి తోటలోకి అడుగుబెట్టాడు. అతను దూకిన ప్రదేశానికీ, బంగళాకు దాదాపు అరమైలు దూరం వుంది. టార్చిలైటు వేసుకుంటూ నడిచాడు. వంద గజాలు పోయాక సర్వెంట్ క్వార్టర్సు కనుపించాయి. వాటికి దగ్గరో బావి కనుపించింది.

బట్టలు విప్పిపెట్టాడు. డ్రాయరు, బనీనుతో చేదతాడు పైనున్న కొయ్యకుకట్టి నీళ్ళలోకి వదిలాడు. మెల్లగా త్రాడు పట్టుకొని క్రిందికి దిగాడు. చాలాదూరం దిగాడు. నీళ్ళు కాళ్ళకు తగిలాయి. తాడు పట్టుకొని లోనికి మునిగాడు. నీళ్ళంతో లోతు లేకపోవటంతో త్వరగానే అడుగు తగిలింది. కాళ్ళతో నేలంతా తడిమాడు. కాళ్ళకు మెత్తగా తగిలింది. లోనికి వంగి కూర్చుని చేతులతో తడిమాడు. మనిషి ఆకారం తాలూకు చేతులూ కాళ్ళు తగిలాయి. విపరీతమైన వాసన వేసింది. ఆ వాసననుబట్టే బావిలోకి దిగాడు సుధాకర్. శవం బాగా కుళ్ళిపోయి వుంది.

శవంచుట్టూ చేతులతో వెతికాడు. పొడవుపాటి తుపాకీ తగిలింది. దాన్ని చేతికి తీసుకుని పైకివచ్చాడు.

నీళ్ళమీద త్రాడు పట్టుకుని కూర్చుని కాసేపు రెస్ట్ తీసుకున్నాడు. ఆ తర్వాత దన్ముపట్టి త్రాడు ఆధారంగా చేసుకుని మెల్లగా గోడకు కాళ్ళు తన్నిపట్టి పైకి ఎక్క సాగాడు. పాగాలు బాగా తడిసి వుండటంతో జర్రున క్రిందకు జారిపోయాడు. నీళ్ళల్లో పడిపోకుండా తట్టుకున్నాడు. తుపాకీ పట్టుకుని పైకి రావడం చాలా కష్టమైంది సుధాకర్‌కు. తంటాలుపడి అరగంట తన్నుకులాడి పైకిచేరాడు తుపాకీతో సహా. కోటు జేబులోంచి జేబురుమాలు తీసుకుని తలంతా బాగా తుడుచుకున్నాడు. మళ్ళీ సూట్ యథాప్రకారం వేసుకుని, సర్వెంట్ క్వార్టర్సువైపు వచ్చాడు. లోపల లైటు వెలగసాగింది.

సుధాకర్ దాన్ని చూచి విస్తుపోయాడు. అంతకు ముందు తను వస్తూ చూశాడు. లైట్లు ఆరిపోయి వున్నాయి. తను బావిలో దిగి పైకొచ్చేసరికి లైట్లు వెలుగుతూ కనుపించాయి. అంటే ఎవరో వచ్చి వుండాలనుకున్నాడు. చెట్ల చాటున నక్కి దాక్కుంటూ మెల్లగా క్వార్టర్ గోడవార చేరాడు. అక్కడ్నుంచి చప్పుడు చెయ్యకుండా ముందుకు కదలి కిటికీవద్దకు పోయాడు. అద్దాల తలుపులు మూసి వున్నాయి.

లోనికి చూశాడు.

అక్కడి దృశ్యం అతన్ని ఆశ్చర్యంతో ముంచివేసింది. రమేష్‌ను పెడరెక్కలు కట్టివున్నారు. అటూ ఇటూ ఇద్దరు లావుపాటి మనుషులు వున్నారు. అతని కెదురుగా రత్నకుమారి నిలబడివుంది. మగపిల్లాడిలా పాంటు, షర్టు వేసుకుంది. చేతిలో లెదర్ హంటర్ పట్టుకొని వుంది.

లోపలి వాళ్ళ సంభాషణ చెవి ఒగ్గి వినసాగాడు సుధాకర్.

"నిన్నిలా ఎందుకు చేశానో తెలుసా?" అడిగింది రత్న కుమారి.

"తెలుసు. ఒళ్ళు అమ్ముకొని బ్రతికే నిన్ను రాజా రవిచంద్ర అర్ధాంగిగా చేసి అందలం అందించిన నేరానికి నాకు నువ్వు బహుమానం ఇచ్చేందుకు" అన్నాడు రమేష్.

"శౌర్యయ్యా! నువ్వేంటి చేసింది. నా అందం నాకా అందలం ఎక్కే అవకాశం కలిగించింది" అంది రత్న కుమారి.

"నన్నెందుకు రప్పించావ్?"

"బుద్ధి చెప్పేందుకు."

"ఏమని?"

"నా మాట వింటూ, నా చేతిక్రింద నీళ్ళు త్రాగుతూ వుంటానని మాటిస్తే నిన్ను వదిలేస్తాను. లేకుంటే నిన్ను రెండు రకాల బాధ పెడతాను."

"అదేదో వివరంగా చెప్పు!"

"ఒకటి నా మనుషులచేత నిన్ను కత్తులతో కండ కండ ఒలిపించి కాకులకు, గ్రద్దలకు వేస్తాను. లేదంటే ఈగల్ బార్‌లోని లక్ష్మయ్యను, రాంసింగ్‌ను నువ్వెలా చంపించిందీ వివరంగా పోలీసులకు తెలియజేసి తిన్నగా ఉరికంబ మెక్కించే ఏర్పాట్లు చేస్తాను. నువ్వేది కోరు కుంటావ్" అడిగింది రత్నకుమారి.

"నిస్సహాయుణ్ణిచేసి చంపడం పెద్ద గొప్పకాదు. ఇక నా గురించి పోలీసులకు చెప్పాక నీవుమాత్రం సుఖంగా వుంటావని అనుకోకు. నాతోపాటే నువ్వూ ఉరికంబ మెక్కుతావ్?" అన్నాడు రమేష్.

"ఎందుకు?"

"నీ భర్తను తుపాకీతో కాల్చి చంపినందుకు."

"అలానని ఎవ్వరూ ఋజువు చెయ్యలేరు. నా భర్త

చనిపోయిన రోజు నేను ఇక్కడ లేనేలేను.''

''రోజా నీ పేరుమీద నటించింది. ఆమె ద్వారా నీకు అపాయం రాకుండా వుండేందుకు ఆమెను నమ్మించి మోసం చేసి చంపాను. ఆ వివరాలన్నీ నేను పోలీసులకు చెప్పగలను'' అన్నాడు రమేష్.

''అంతటి ఘనుడివని తెలిసే ఇలా నమ్మించి పిలిపించింది నన్ను. నువు ఈ దినం నుండి నా ఖైదీవి. బుద్ధొచ్చిందని చెప్పి లెంపలేసుకున్న దాకా నిన్నిక్కడే వుంచి నీళ్ళు కూడా ఇవ్వకుండా మాడుస్తాను'' అంది రత్నకుమారి.

ఆ తర్వాత ఆమె వెలుపలకు వచ్చేసింది. ఆమె వెంట అనుచరులందరూ కూడా వెలుపలికి వచ్చారు. తలుపులకు తాళం పెట్టారు. అక్కడ్నుంచి కదిలి బంగళా వైపు వెళ్ళిపోయారు.

సుధాకర్ నిల్చుని అంతా పరిశీలించి చూశాడు. తాళాలు పగులగొట్టి రమేష్‌ని వదిలించుదామనుకున్నాడు. కానీ అతను తనతో సహకరిస్తాడన్న నమ్మకం కలగలేదు. కారణం అతను మూడు హత్యలు చేసిన హంతకుడు గావటమే.

ముందు వసంతని విడిపించడం అవసరమనిపించింది. ఆ తుపాకీ తీసుకుని మెల్లిగా బయలుదేరాడు కాంపౌండు గోడవేపు. చెట్లచాటున నక్కుతూ మనుషుల అలికిడి విని పిస్తుందేమోనని మాటమాటకీ ఆలకించి వింటూ దూరాన్ని వెనక్కు నెట్టుకుపోవడం మొదలుపెట్టాడు.

కాంపౌండు గోడ రెండు చేతుల్తోటి అందుకుని బలమంతా కాళ్ళలోకి తెచ్చుకుని ఎగిరాడు. కాళ్ళు పైకి రాలేదు. ఎవరో క్రిందకు గుంజినట్లు తోచింది. పట్టు జారి పోయింది. దబ్బున పడిపోయాడు. అంతకుముందు రమేష్‌ని కట్టిపడేసిన ఇద్దరూ కనుపించారు. చీకట్లో కూడా వాళ్ల

కళ్ళలోని ఎరుపు చింతనిప్పల్లా కణకణ మండుతూ కను
పించింది.

"ఎవరు నువ్వు?" అడిగాడొకతను.

"మీరెవరు?" అడిగాడు సుధాకర్ వాళ్ళను.

"నీ ముగుళ్ళం" అన్నారిద్దరూ కసిగా.

"పెళ్లాడుతారా?"

"అఁ! రా!" అంటూ నాలుగు చేతులు ముందుకొచ్చాయి. సుధాకర్ అడుగు వెనక్కు వేశాడు. వాళ్ళు పైకి దూకారు. పిల్ల మొగ్గ వేశాడు సుధాకర్. ఇద్దరితలలూ గోడకు తగిలాయి. ఠక్ మన్నాయి.

వాళ్ళ మెదళ్లు చిట్లిపోయి వుండాలనుకున్నాడు, ఆ దెబ్బకు. ఇంక లేవటం అసాధ్యమనుకొని వాళ్ళకేసి చూశాడు. ఏమీ జరగనట్లు పైకి లంఘించి, సుధాకర్ రెక్కలు చెరొకటి పట్టుకున్నారు రెండు చేతుల్తో. కుడి కాళ్లు నడుంపైన పెట్టి బలంగా గుంజారు.

నడుము పెళపెళ మంది. వెన్నుపూస జాయింట్లు ఊడిపోయినట్లు తోచింది సుధాకర్ కు. సుధాకర్ నేలవాలాడు. ఒకడు సుధాకర్ కి అటూ ఇటూ రెండు కాళ్లు పెట్టి వంగి, రెండు చేతులూ గొంతుపైన పెట్టాడు నొక్కేందుకు.

"ఏం చేస్తున్నావురా?" అడిగాడు ప్రక్క నున్న రాడీ.

"చంపుతున్నాను" అన్నాడు వాడు.

"వద్దు! అమ్మగారికి చూపిస్తే మంచిది. వీణ్ణి కూడా పట్టుకెళ్ళి ఆ కొట్లో పారేసి తాళం పెడదాం!" అన్నాడు.

అతని సలహా నచ్చినట్లుంది. గొంతుపైన వేసిన చేతులు తీశాడు. సుధాకర్ ముక్కుపుటాలు పెద్దవి చేసి గాలి పీల్చుకున్నాడు గుండెల నిండా. ఇద్దరూ అతన్ని లేవ

నెత్తి, తన్నుకుంటూ, త్రోసుకుంటూ సర్వెంట్ క్వార్టర్సు వైపు లాక్కెళ్లారు.

ఒకడు తాళం తీసి, తలుపు తెరిచాడు.

రెండోవాడు సుధాకర్‌ను లోనికి తోశాడు.

మళ్ళీ తలుపులు బిడాయించారు. గొళ్లెం లాగి తాళం కప్ప తగిలించి, చెవి అందులో పెట్టి త్రిప్పారు.

సుధాకర్ దగ్గిర చేజిక్కించుకున్న తుపాకీ మోసుకుని బంగళా వేపు బయలుదేరారు.

# 10

వసంతకు స్పృహ వచ్చింది. కళ్ళు తెరచి చూసింది. కిటికీలాంటి దేదీలేదు. మెట్లు మాత్రం కనుపించాయి. మెల్లగా లేచి మెట్లెక్కింది. వాటి చివర్న తలుపుంది. అది తాళం వేసివుంది. ఆ ఏర్పాటును బట్టి తను నేలమాళిగలో కట్టిన గదిలో వున్నానన్న విషయం అర్థమైంది.

జరిగింది గుర్తుకు తెచ్చుకోసాగింది.

సుధాకర్ వెళ్ళిన తర్వాత, తను రాత్రి ఎనిమిదింటికి ఈగల్ బార్‌కు వచ్చింది. బార్‌లో రామా స్టుడియో ఓనరు కనుపించాడు. తను వెళ్ళి కూర్చోగానే మిగిలిన ఖాళీ కుర్చీల్లో ముగ్గురు రౌడీలు వచ్చి కూర్చున్నారు. లేచి పోదామనుకుంది ముందు. కానీ వాళ్ళకు భయపడి వెళ్ళి నట్లుగా వుంటుందని సందేహించి కూర్చుందక్కడే.

విస్కీ తెప్పించుకున్నారు.

త్రాగుతూ, అడ్డదిడ్డంగా వాగుతూ వుండిపోయారు. ఒకడు తన చెయ్యి పట్టుకున్నాడు. మరొకడు లేచి వీపు పైన చెయ్యి వేశాడు. ఇంకొకడు గ్లాసులో విస్కీ పోసి త్రాగమని అందించాడు. అందర్నీ తిట్టి వెళ్ళిపోదామని లేచింది.

వెళ్ళనీకుండా చుట్టూ నిలబడ్డారు. తను చాలా ప్రమాద స్థితిలో చిక్కుకున్నట్లు తెలుసుకొంది.

"హెల్ప్! హెల్ప్!!" అని అరిచింది.

అంతమంది జనంలో ఎవ్వరూ ముందుకు రాలేదు ఆ రౌడీల బారినుండి తన్ను రక్షించడానికి. అంతా బొమ్మల్లా జరుగుతున్నది చూస్తూ వినోద కాలక్షేపం చెయ్యసాగారు.

ఉన్నట్టుండి లైట్లారిపోయాయి.

తన్ను ఎవరో ఎటో బలవంతంగా లాక్కుపోతున్నట్లు గమనించింది. శరీరంలోని శక్తినంతా కూడగట్టుకొని వాళ్ళతో పోరాడింది. కానీ లాభం లేక పోయింది. మూడు మగమృగాల బలం ముందు సహజంగానే అబలయిన తను ఓడిపోక తప్పలేదు.

లైట్లు వెలిగాయి.

తనచుట్టూ ముగ్గురు రౌడీలున్నారు.

ఎదురుగా రాకింగ్ ఛెయిర్‌లో కూర్చుని సిగరెట్ త్రాగుతూ రమేష్ కనుపించాడు.

"నువ్వే ప్రఖ్యాత డిటెక్టివ్ సుధాకర్ అసిస్టెంటు వసంత వన్న విషయం ఈ దినమే తెలిసింది. ఎవరో నా గురించి వాకబు చేస్తున్నారని రామా స్టుడియో మూర్తి చెపితే పోలీసు లనుకున్నాను. కాఫీలో విషం కలిపి పంపాను. తెలివిగా అపాయం తప్పించుకున్నారు. నా మనుషులకు డబ్బు ఎరచూపి నేను చేసిన దురాగతాల గురించి సమాచారం సేకరించ ప్రయత్నించారు" అన్నాడు రమేష్.

"వాళ్ళిద్దర్నీ చంపావుగా?" అడిగింది.

"తప్పు! అలాగనకు. చంపించాను. అంతే."

"అంతే అయినా ఆ నేరాలకు శిక్షంతా నీ నెత్తినే పడుతుంది. తెలుసా?" అడిగింది తను.

"ఈ తల చాలా విలువైనది. దీనిపైన శిక్షలు పడ కుండా తగిన రక్షణలు ఎప్పుడో చేసి వుంచుకున్నాను. నిన్నూ, నీ బాస్‌ను యమలోకం పంపానంటే నాకెదురు లేదు. అందుకు తగిన ఏర్పాట్లు చేశాను. ఇంతకి వాడేడి!"

"నీ గొంతును బిగించేందుకు ఉరిత్రాడు తయారు చేసు కుని వచ్చేందుకు వెళ్ళాడు" అంది తను కోపంగా.

"ఎప్పుడొస్తాడు?"

"తెలీదు!"

"మంచిదే! రాగానే అతన్నికూడా ఇక్కడే పిల్చు కొస్తాను. ఇద్దర్ని కలిపి చంపుతాను. అంతదాకా నా ఖైదీగా వుండు" అన్నాడు రమేష్.

రౌడీలు ముగ్గురూ లాక్కుపోయారు ఇంకో గదిలోకి. తన కాళ్ళూ చేతులు పట్టుకున్నారు కదలకుండా. ఇంకో కతను ఏదో మందు సిరంజి ద్వారా లోని కెక్కించాడు. మందు లోపల కెక్కగానే స్పృహపోయింది.

పోయిన స్పృహ మళ్ళీ ఇప్పుడే వచ్చింది.

సుధాకర్ తిరిగి వచ్చివుంటే ఈ పాటికి తనకీ చెరసాల నుండి మోక్షం జరిగుండాలి. మరి రాలేదేమో. వెళ్ళిన పనులుకాక ఆగిపోయారేమోననుకుంది.

కడుపులో ఆకలి బయలుదేరింది.

మళ్ళీ వెళ్ళి తలుపు తట్టింది.

తలుపులు తెరచుకున్నాయి.

ఎదురుగా రాక్షసుడిలాంటి మనిషి ప్రత్యక్షమయినాడు.

"ఏం కావాలి?" అడిగాడు.

"ఆకలవుతూంది. తినేందు కేమయినా తెచ్చిపెట్టు" అంది వసంత.

"నీకేం పెట్టొద్దన్నారు" అన్నాడతను.

"ఎటూ నన్ను చంపుతారు. చంపాక ఆకలి తెలీదు.

ప్రతిక్షణం లేచే ఆకలవుతూనే వుంటుంది. ఆ బాధ భరించడం ఎంత కష్టమో నీకు తెలీదు. నాకు చాలా ఆకలిగావుంది. ఏమైనా తెచ్చిపెట్టు” గోముగా అడిగింది వసంత.

వాడు ఆమె మాటలతీరుకు చల్లబడ్డాడు. మెదడులో పిచ్చి కోరికలు రేగాయి.

“నీకేం కావాలన్నా తెచ్చిపెడతాను. నాకు ఏం కావాలంటే అది ఇస్తావా?” అడిగాడు నఖశిఖ పర్యంతం గమనిస్తూ.

“ఇస్తాను. నాకు అన్నం, కారం బాగా వేసిన సాంబారు మజ్జిగ తెచ్చిపెట్టాలి. నోరు బాగా రుచి చెడివుంది” అంది వసంత.

అలాగే అంటూ అతను వెళ్ళిపోయాడు.

పది నిముషాల తర్వాత ఒక గిన్నెలో సాంబారు, మరో గ్లాసులో మజ్జిగ పట్టుకొని ఒంటిగిన్నె క్యారియర్‌లో అన్నం పెట్టుకొచ్చాడు.

“తిను! త్వరగా తిను!” అన్నాడు అతను ఎదురుగా కూర్చుని.

వసంత సాంబారు గిన్నె వాసన చూసినట్లే, ఉడుకుగా మొహంమీద పడేట్లు కొట్టింది. అదంతా కళ్ళలోకి పోయి మంట పుట్టుకొచ్చిందతనికి. “అమ్మో మంట!” అంటూ డాన్సు చెయ్యనారంభించాడు.

వసంత వడివడిగా వెలుపలికొచ్చి తలుపులు మూసి గొళ్ళెం పెట్టింది. అక్కడ్నుంచి సునాయాసంగా రెండు నిముషాల్లో వీధిలోకి రాగలిగింది. టాక్సీ ఎక్కి హోటల్ పేరు చెప్పి పోనిమ్మంది.

ఆఘమేఘాలమీద వెళ్ళింది టాక్సీ. దిగి రిసెప్షనులో డబ్బు తీసుకుని టాక్సీవాలాకు చెల్లించి, గదికి వెళ్ళింది. టీపాయ్‌పైన కాగితం పెట్టివుంది. తీసుకొని చదువుతుంది.

సుధాకర్ తనకోసం రాసివుంచాడు. తను రాణీ రత్న కుమారి ఇంటికి వెళ్తున్నాననీ, ఒకవేళ తను తిరిగొచ్చి ఉత్తరం చూస్తే వెంటనే డి.ఐ.జి. దిగంబరరావును కలుసుకోవలసిందని వుందందులో.

బట్టలు మార్చుకుని పర్సులో కొద్దిగా డబ్బు, చిన్న రివాల్వరు పెట్టుకొని క్రిందకు దిగివచ్చింది. టాక్సీ మాట్లాడుకుని డి.ఐ.జి. ఇంటి అడ్రసు చెప్పి పోనిమ్మంది.

దిగంబరరావు వసంతను చూచి ఆమె తన్ను పరిచయం చేసుకోగానే కూర్చోబెట్టి అంతా విన్నాడు.

"నన్నేం చెయ్యమంటావ్!"

"సుధాకర్ గారు రత్నకుమారి గారింటికి వెళ్ళారు. వారు టైం పది గంటలని రాశారు. ఇప్పుడు దాదాపు తెల్లవారస్తూంది. అంటే ఆయనేదో ఆపదలో చిక్కుకొని వుండి వుంటారు. మనం తగిన బలగంతో అక్కడికి పోవడం అవసరమనిపిస్తూంది" అంది వసంత.

"అలాగే వెళ్దాం!" అంటూ లోనికెళ్ళి రెండు మూడు ఫోన్ కాల్స్ చేసి, డ్రెస్ వేసుకునివచ్చి జీపు ఎక్కి కూర్చున్నాడు. వసంత కూడా ఎక్కింది.

* * *

వేకువఝాము ప్రాంతంలో సుధాకర్ కు ఒళ్ళు తేలికగా వున్నట్లనిపించింది. లేచి కూర్చున్నాడు. రమేష్ అటూ ఇటూ పచార్లు చేస్తూ కనుపించాడు.

"డిటెక్టివ్ వు నువ్వేనా?" అడిగాడు.

"నేనే!"

"నీ అసిస్టెంటును నా హోటల్ లో బంధించాను_నేను నీ చేతిలో బందీగా చిక్కాను" అన్నాడు రమేష్.

"నువ్వు ఎండమావుల వెంటపడ్డావని ఇప్పటికయినా

అరథమైందా? ఆమె మాయలోపడి మాధవిని అనవసరంగా హత్యచేశావ్. ఎందుకు?" అడిగాడు సుధాకర్.

"మాధవీ, రత్న ఈగల్ క్లబ్ లో డాన్సు చేసేవాళ్ళు. ఇద్దరూ దాదాపు ఒకలాగే వుండేవాళ్ళు. మాధవి నన్ను ప్రేమించింది. రత్న కూడా ప్రేమించింది. నన్ను కాదు ఈగల్ బార్ ఓనర్ రవిచంద్రగారి దగ్గరున్న డబ్బును. నేను మాధవిని ప్రేమించలేకపోయాను. రత్న నన్ను ఆకట్టుకుంది. రవిచంద్రకు, ఆమెకు పరిచయం చేశాను. వాళ్ళిద్దరూ రాసక్రీడల్లో తేలియాడుతుండగా దొంగతనంగా ఫోటోలు తీయించాను. వాటి సాయంతో ఆయన్ను భయపెట్టి రత్నను పెళ్ళిచేసుకునేట్లు చేశాను.

ఆ తర్వాత అతని ఆస్తి కాజెయ్యాలన్న ఆశపుట్టింది. అతను ఛస్తే మొత్తం రత్నకే వస్తుంది. మాధవిని ప్రేమించినట్లు నటించి రత్న పేరుమీద ఆమెను బెంగుళూరుకు పంపాను. ఒక రాత్రి రత్న సర్వెంట్ దుస్తులు వేసుకొని రవిచంద్ర తోటలో తిరుగుతుండగా చంపేసింది. తర్వాత సర్వెంట్ ను చంపి, శవానికి బండకట్టి బావిలో పారేసింది. మాధవిని రప్పించాను.

రత్న అప్పుడే బెంగుళూరునుండి వచ్చినట్లు నటించింది. పోలీసుల అనుమానం సర్వెంట్ పైన వెళ్ళేట్లు తప్పుడు సాక్ష్యాలు చెప్పించాం. దాంతో వాళ్ళు ఆ సర్వెంట్ ను వెతుక్కోవడంలో పడిపోయారు.

మాధవి నన్ను పెళ్ళి చేసుకోమంది. రత్న అందుకు వ్యతిరేకించింది. ఆమెకు విషయం చెప్పకుండా మద్రాసు పంపాను. నేను కూడా కొంత డబ్బు తీసుకొని త్వరలోనే వచ్చి కలుసుకుంటున్నాను. అప్పుడప్పుడూ కాంటినెంటల్ హోటల్లో హైద్రాబాదునుండి సురేష్ అనే

అతను వచ్చాడేమో అడిగి తెలుసుకుంటూండమని చెప్పాను.

త్వరలో రాకుంటే రత్న పేరుతో తను బెంగుళూరులో మకాం వేసిన విషయం పోలీసులకు చెప్తానంది. దాంతో మేమిద్దరం భయపడ్డాం. ఆమెను నేనే చంపి ఎన్నూరు దగ్గర నీళ్ళల్లో పారేశాను. ఆ తర్వాత జరిగింది మీకు తెలుసు'' అన్నాడు రమేష్.

అంతలో తలుపులు తెరచుకొన్నాయి.

ఎదురుగా డి.ఐ.జి. దిగంబరరావు, వసంత కనిపించారు. రత్నకు బేడీలు వేసివున్నారు.

సుధాకర్ ''పాపం సుబ్బారావు మాధవి మాయ మయిందనుకున్నాడు. ఆమెను హత్య చేశారని తెలిస్తే గుండె ఆగి మరణిస్తాడేమో'' అన్నాడు.

అందర్నీ జీపెక్కించి సెంట్రల్ జైలువైపు పోనిమ్మన్నాడు దిగంబరరావు.

సుధాకర్, వసంత కారెక్కి హోటల్‌కు బయలుదేరారు.

—: ఐపోయింది :—

# అంతఃపుర రహస్యం

కంచర్ల రమణ

"అమ్మా!" అమ్మా!"

గావు కేకలు పెడుతూ ఇంట్లో అడుగు పెట్టాడు సీతాపతి.

"ఏమిరా! ఎందుకురా కేకలు?" వంటింట్లో పని చేసుకుంటున్న తల్లి దుర్గాబాయి కేక పెట్టింది.

"రామంగాడు ఉత్తరం రాసాడే హైద్రాబాదు నుంచి" అంటూ వంటింట్లో ప్రవేశించి, తల్లికి చేరువగా ఓ పీట లాక్కుని కూచున్నాడు సీతాపతి.

"ఏమిట్రా! ఏమి రాసాడేమిటి?" అడిగిందామె, తను చేస్తున్న పని మధ్యలోనే ఆపేసి.

"సబిన్స్పెక్టరు సెలక్షను లిస్టులో నా పేరు మొదట్నే ఉందట. ఇదుగో రాసాడు చూడు" అంటూ ఆమె

ముఖానికి దగ్గరగా ఉత్తరం పెట్టి, స్నేహితుడు రాసిన ఉత్తరంలోని వాక్యం వేలితో చూపించాడు సీతాపతి.

దుర్గాబాయి ఉత్తరంలోకి చూసింది. అలుక్కుపోయిన అక్షరాలు అవుపించగానే తను కళ్ళజోడు పెట్టుకోలేదని తెలుసుకుంది.

ఉత్తరం చదివే ప్రయత్నం విరమించుకుని "నువ్వు చెప్పేవుగదురా. చాలులే... మంచి వార్త చెప్పావురా నాయనా! మన కష్టాలు గట్టెక్కాయిరా" అంటూ ఆమె తన కంట్లో ఉబికిన ఆనంద బాష్పాల్ని చీరచెంగుతో ఒత్తుకుంది.

"అంతటితో అయిపోలేదమ్మా!" సీతాపతి వదనంలో విషాద మేఘాలు తొంగిచూసాయి.

దుర్గాబాయి మనస్సు కలుక్కుమంది ఒక్కక్షణం, కొడుకు మొహంలో దిగులు కనిపించగానే.

"ఏం నాయనా! లిస్టులో మొదటే ఉందిగా నీ పేరు. నీకుగాక ఇంకెవరికిస్తారు ఉద్యోగం?" అందామె.

"ఉన్న పోస్టులు పదిహేను. మనకున్న మంత్రులు పాతిక మంది. సెలక్షన్ ప్రకారం మనకా పోస్టు రావాలంటే, మనకో మంత్రిగారి సిఫార్సు కావాలిట. ఆ విషయం కూడా రాసాడు రామం" వివరించాడు, తన విచారానికి కారణం.

"అయితే, యేంచేద్దామనుకుంటున్నావు నాయనా?" అడిగిందామె, ఆనందంతో ఎంత త్వరగా పొంగిపోయిందో, అంత త్వరగా తగ్గిపోతూ.

"నాకేం పాలుపోవడంలేదమ్మా. నాకున్న అర్హత లేమిటో చెప్పి ఏ మంత్రిగారి కాళ్ళమీదోపడి బ్రతిమాలడానికి నా కభ్యంతరంలేదు. అయితే, ఏది నిర్ణయించుకో

డానికైనా ముందు హైద్రాబాదు పోయి రావాలి''
చెప్పాడు సీతాపతి దిగులుగా.

''హూఁ...''

ఆమె దీర్ఘంగా నిశ్వసించింది. సగంలో వదిలేసిన తన పని తిరిగి చేయడానికి ఉపక్రమించింది.

అయిదునిముషాలు నిశ్శబ్దంగా దొర్లాయి, తల్లీ కొడుకుల మధ్య.

''ఇంతకీ యేమాత్రం ఉండాలి?'' అడిగిందామె.

''రెండు వేలు కావాలి కనీసం.''

''అంతెందుకురా?''

''మంత్రిగార్ని తృప్తిపరిచే శక్తి మనకెలాగూ లేదు గాని ఆ క్రింద వాళ్ళనయినా కాస్త సంతోషపరచాలి.''

''ఎక్కడ్నుంచి తేగలంరా ఆ మొత్తం?''

''ఆ మాట నే నడుగుదామనుకుంటుంటే, నువ్వే నన్ను అడుగుతున్నావా?''

''ఆఖరి బంగారపు పిసరు వరకూ అమ్మేసాం. ఇల్లు యేనాడో అమ్మిపారేసాం నీ చదువుకోసం. ఎప్పుడో ఉద్యోగం వస్తుంది, అప్పు యివ్వండి అంటే ఎవరిస్తారు ఏ హామీ లేకుండా? నువ్వే ఆలోచించు!''

''అందుకే, డబ్బు వడ్డీకి తేవద్దు. ఇప్పుడు మనం కనీసం వడ్డీ డబ్బులు చెల్లించే స్థితిలో కూడా లేము. ఉద్యోగం వచ్చేక, తీర్చే పద్ధతిమీద మనకు అప్పు యిచ్చేవాళ్ళు లేరా?''

''నీకు తెలియని వారెవరున్నారా?'' అతడి కళ్ళల్లోకి చూస్తూ అందామె.

''మన బంధువుల్లో యెవరూ లేరంటావా?''

''బంధువులు!'' అంటూ ఆమె నిస్పృహగా పెదవి విరిచి ''మనం పచ్చగా ఉన్నప్పుడు అందరూ వాళ్ళే.

మీ నాన్నగారు పోగానే మన పరిస్థితి చెడిందని తెలియగానే ఒక్కరూ కనిపించలేదు" అందామె.

"అసలే ఇబ్బందుల్లో ఉన్నవాళ్ళని ఇంకా ఇబ్బంది పెట్టడమెందుకని వాళ్లు మనల్ని కనికరించి వదలి పెట్టారేమో!... అయినా, మనం ఏనాడయినా వాళ్ళ నడిగి చూశామా?"

"లేదనుకో... అయినా నీ అదృష్టం ఎలాగుందో! ఆ ప్రయత్నంకూడా చెయ్యి."

"అయితే, ముఖ్యమైన మన బంధువుల పేర్లు చెప్పు. వాళ్ళు కాదంటే, ఇంకొకరివద్ద ప్రయత్నిద్దాం."

"ముందు కోటపాడు వెళ్ళు. మీ నాన్నగారున్న రోజుల్లో వాళ్లు తరచుగా వచ్చేవారు మనింటికి. మీ నాన్నగార్ని రామయ్యగారు 'అన్నయ్యా!' అని పిలిచి గౌరవించేవారు. అంతేగాదు. బంధుత్వం కూడా ఉంది. రామయ్య భార్య అనసూయ మా పెత్తల్లి కూతురు. నీకు పిన్ని అవుతుంది."

"అయితే, రేపే, ఆ వూరు వెళ్తాను" సీతాపతి అన్నాడు నిశ్చయంగా.

## 2

కోటపాడు గ్రామానికి రెండు దిక్కుల నుంచి పోవచ్చును. అయితే, యెటునించి వెళ్ళినా, బస్సుదిగాక, పన్నెండు మైళ్ళు పొలాల గట్లమీద, మట్టిరోడ్డుమీద నడవక తప్పదు.

సీతాపతి ఎన్నడూ ఆ వూరు పోలేదు. మార్గమధ్యంలో కనిపించే వాళ్ళను అడిగి తెలుసుకుంటూ నడవసాగాడు.

శీతాకాలం.

ఎండలో, పొలాలగట్లమీద నడవడం అతనికి హాయిగా, సుఖంగా ఉంది.

బస్సుదిగిన తరువాత, మూడున్నరగంటల్లో కోటపాడు చేరుకున్నాడు సీతాపతి.

అది కుగ్రామం కావడం వలన, రామయ్యగారి ఇల్లు కనుక్కోవడం కష్టం కాలేదు అతడికి.

సీతాపతిని చూడగానే ఎంతో సంబరపడిపోయారు, రామయ్య, అనసూయమ్మ.

మధ్యాహ్నం భోజనాలన్నీ అయ్యాక, తనెందుకు వచ్చిందీ వారికి తెలియచేసాడు.

సీతాపతి అడిగిన సొమ్ము ఇవ్వడానికి రామయ్య తన సంసిదత తెలియజేసాడు. అయితే వారం రోజుల వ్యవధి కావాలన్నాడు.

"నువ్వు తప్పకుండా ఇస్తానంటే, వారం రోజుల తర్వాత వస్తాను బాబాయ్" అని ఆ సాయంకాలమే సీతాపతి తిరుగు ప్రయాణం కట్టబోయాడు.

"అదేమిటి బాబూ! వెంటనే వెళ్ళిపోతానంటున్నావు. ఈ నాలుగు రోజుల కోసం ఇంటికివెళ్ళి మళ్ళా రావాలా. ఉండిపో బాబూ! ఏకంగా డబ్బుతోనే వెళ్ళువుగాని" అంది అనసూయమ్మ.

అయినా, సీతాపతి ముగమాటం చూపాడు.

"రేపు ఉదయం ఒకాయన పట్నం వెళ్తున్నాడు. నాలుగు రోజులుండి వస్తావని మీ అమ్మకు కబురు పంపిస్తాలేరా. నీ అమ్మ గురించి బెంగపడకు. అయినా మనలో మనకు మొగమాటాలేమిటి?" అన్నాడు రామయ్య కూడా.

దాంతో సీతాపతి కోటపాడులో ఉండిపోక తప్పలేదు.

గ్రామ జీవితం గురించి ఎవరో చెప్పుకోగా వినడమే గాని, ఊహ తెలిసిందగ్గర్నుంచీ సీతాపతికి అనుభవంలేదు. అలాంటిది ఇప్పుడు గ్రామ జీవితం ఎలావుంటుందో ప్రత్యక్షంగా చూసే అవకాశం వచ్చింది.

ఆ వూళ్ళో ఉన్న నాలుగు రోజుల్లో గ్రామ జీవితాన్ని అధ్యయనం చేయడానికి నిశ్చయించుకున్నాడు సీతాపతి.

కోటపాడు వూరికి వచ్చేముందు త్రోవలో ఎన్నో గ్రామాలగుండా ప్రయాణం చేసాడు తను.

కాని, అదేమిటో, కోటపాడు వూళ్ళో ప్రవేశిస్తుంటే, అతని గుండెలు ఝల్లుమన్నాయి, అర్థంగాని భయంతో రోమాలు నిక్కబొడుచుకున్నాయి.

అలాంటి అనుభూతికి కారణమేమిటో తెలుసుకోవాలని పించింది అతడికి. కాని, తను వచ్చిన పనిమీద ధ్యాసలో ఆ విషయం మరపున బడింది.

అయితే, మధ్యాహ్నం విశ్రాంతి కోసం మంచంమీద చేరినప్పుడు ఆ విషయం మళ్ళా జ్ఞప్తికి వచ్చింది.

ఆ వూరికి ఏదో ప్రత్యేకమైన వాతావరణం ఉందని పించింది అతడికి.

పెద్ద పెద్ద ఊడలు దించి విశాలంగా పందిరిలా అల్లుకు పోయిన మర్రిచెట్లున్నాయి ఊరిచుట్టూ. ఊరికి ఒకప్రక్క చెరువుంది. చెరువు గట్లమీద ఒత్తుగా పెరిగిన తుమ్మచెట్లు. చింపిరి జుత్తులు విరబోసుకుని నించున్న పిశాచాల వరుసల్లా ఉన్నాయి.

సీతాపతిని ఇంకా భయపెట్టింది, ఊరి ముందరి శ్మశానం. విసిరేసినట్లుగా నాలుగు గోరీలు అక్కడక్కడ వున్నా, ఆ వాతావరణాన్ని భయంకరంగా చేసింది, సీతాపతి ఊళ్ళోకి వస్తుంటే మండుతున్న చితి.

సాయంకాలం ఆరున్నరయింది. నిద్రలేచి, మొహం కడుక్కునేసరికి, టిఫిను కాఫీ తయారుచేసి ఇచ్చింది అనసూయమ్మ.

లోకంలోవున్న ఆకలంతా అతడి కడుపులోనే వుందని పించింది సీతాపతికి.

ఆవురావురు మంటూ టిఫిను ప్లేటు రెండు నిముషాల్లో ఖాళీ చేసేసాడు. కాఫీ త్రాగడం పూర్తిచేసేసరికి, ఆత్మారాముడు శాంతించి నట్టనిపించింది.

చెప్పుల్లో కాళ్ళు దూర్చుతూ "అలా మన పొలంవరకు పోయి వద్దాం రారాదూ" అన్నాడు రామయ్య.

"అలాగే బాబాయ్! పద" హుషారుగా లేచాడు సీతాపతి.

"ఎందుకు లెద్దురూ వాడ్ని చలిలో త్రిప్పుకు రావడం? వెచ్చగా వాడ్ని యింటివద్ద కూచోనీండి" అంది అనసూయమ్మ, రామయ్య మాటకు అభ్యంతరం చెప్తూ.

"అలాగంటే ఎలాగే! సున్నితం పనికిరాదు. రేపు వాడు సబిన్స్పెక్టరు కూడా కాబోతున్నాడు" అని అనసూయమ్మకు సమాధానం యిచ్చి "రావాలని లేకపోతే ఉండిపో. నేను వెళ్తానులే" అన్నాడు రామయ్య సీతాపతివైపు తిరిగి.

"వస్తాను బాబాయ్! పద!" అంటూ బయలుదేరాడు సీతాపతి, రామయ్యవెంట.

శుక్లపక్ష చంద్రుడు వెన్నెలలు చిందిస్తున్నాడు.

దట్టంగా అల్లుకుపోయిన మర్రిచెట్ల నీడలు, ఆకుల సందుల్లోంచి చొచ్చుకువచ్చిన వెన్నెల కాంతులు కలగాపులగంగా వారు నడుస్తున్న దారిమీదపడి విచిత్రమైన అనుభూతి కలిగిస్తోంది సీతాపతికి.

తోటదాటి వెలుపలికి వచ్చారు. కనుచూపుమేర వరకూ పొలాలు.

దూరంగా ఎన్నో వంపులు పోయిన కొండల వరుస.

ఒక్కక్షణం ఆగి, ఆ దృశ్యాన్ని తదేకంగా చూడాలనిపించింది సీతాపతికి.

ఆగి, ఒక్కసారి అటునుంచి యిటు కలయజూసాడు.

కుడివైపు తిరగబోయేసరికి, అక్కడో పెద్ద మిట్ట, మిట్టమీద ఓ రాతి భవంతి ఒంటరిగా వింత భీతి గొల్పుతూ అవుపించింది.

సీతాపతి గుండె ఒక్క క్షణం నిలిచినట్టయింది. తను ఊర్లో ప్రవేశిస్తున్నప్పుడు కలిగినప్పటి అనుభూతే రెట్టించిన తీవ్రతతో కలగసాగింది.

ఏమిటిది? ఎందు కిలా ఫీలవుతున్నాడు తను?

"బాబాయ్! ఎవరి దా యిల్లు?" సీతాపతి గొంతు వణికింది అప్రయత్నంగా.

"భయపడుతున్నావుట్రా" అని సీతాపతివైపు ఒక్క క్షణం విచిత్రంగా చూసి "అది జమీందారు వీరాజీగారి మేడ. చాలా బావుంది కదూ!" అన్నాడు రామయ్య.

"బావుంది! కాని పచ్చని కోటుమీద నల్లచారలున్న పులిని చూసినప్పటి అనుభూతి కలుగుతోంది" చెప్పాడు సీతాపతి.

"నిత్యమూ ఆ మేడను చూస్తున్న మాకే అలాగుంటుంది. ఇహ, నీ కలా అనిపించడంలో ఆశ్చర్యం యే మాత్రంలేదు" సీతాపతి అనుభవాన్ని ధృవపరిచాడు రామయ్య.

"యేమిటి బాబాయ్! అలా మనకి కనిపించడానికి కారణ మేమిటి?...ఆ భవంతి వెనుక ఏదైనా చరిత్ర ఉందా?"

"ఉంది. పద! నడుస్తూ చెప్పుకుందాం."

మళ్ళా నడక ఆరంభించారు యిద్దరూ.

"ఆ మేడను యిప్పటికీ అందరూ వీరాజీ మేడ అని పిలుస్తారుగాని, ఇప్పుడాయన లేరు. ఓ రోజున రాత్రి యెప్పటిలా తన పడకగదిలో ప్రవేశించిన వాడల్లా,

మర్నాడు ఉదయం మంచంమీద కనిపించలేదు. ఉన్న పళంగా అదృశ్యమైపోయాడు. నలుగురూ చెప్పుకునే మాటేమిటంటే, ఆ భవంతిలోని దెయ్యాలే అతడ్ని ఎత్తుకు వెళ్ళిపోయాయని."

"మేమిటీ దెయ్యాలు యెత్తుకుపోయాయా?" సీతాపతి ఆశ్చర్యానికి అంతులేదు.

"ఏమో? అదీ అందరూ చెప్పుకునేది. నిజం యేమిటో ఎవ్వరికీ తెలీదు."

"అయితే, ఆ యింట్లో ఎవరూ ఉండడంలేదా?"

"లేకేం ఉంటున్నారు. వీరాజీగారి మూడో భార్య రత్నమాల; యిద్దరు ముగ్గురు నవుకర్లు, మేనేజరు రమా కాంత్ ఉంటున్నారు."

"వీరాజీని యెత్తుకుపోయిన దెయ్యాలు, వాళ్ళను యేమీ చెయ్యడంలేదా?"

"లేదు. ఆమె మహాభక్తురాలు. ఉదయం లేచాక, గంట సేపయినా, దైవపూజ చెయ్యకుండా, దినచర్య ఆరంభించదు. అందువల్లనే ఆ దెయ్యాలు ఆమెను అల్లరి పెడ్తున్నాయటగాని, హానికలిగించలేక పోతున్నాయి."

"అలాంటి దెయ్యాలు దేవులాడే కొంపలో ఊరికి చివ రగా ఉండడం యెందుకు? ఊర్లో ఓ యిల్లు కట్టుకొని ఉండవచ్చుగా."

"'నా భర్త కట్టించిన యిల్లు యిది. వారు యిక్కడే అదృశ్యమైపోయారు. నాకేం జరిగినా ఫరవాలేదు. నా శేషజీవితం యిక్కడే గడుపుతాను' అంటుంది రత్న మాల."

"ఆవిడ అంత వైరాగ్యం మాట్లాడుతోంది. ఆవిడ అంత ముసలావిడా?"

"అబ్బే కాదు. ఆవిడకు మహా ఉంటే, ముప్పై అయి

దేళ్ళుంటాయి. ఆవిడకు యిరవై అయిదేళ్ళుండగా ఆమెను పెళ్ళాడి తీసుకొచ్చారు పీరాజీగారు. ఆవిడకు ముప్ఫై యేళ్ళు రాగానే, ఆయన కనిపించకపోవడం జరిగింది. గత అయిదేళ్ళుగా ఆమె ఆ యింట్లో ఉంటోంది.''

''అలాంటి మంచివాళ్ళు యింకా యీ లోకంలో ఉండబట్టే, నీతి, న్యాయానికి విలువ ఉంది'' రత్నమాల మీద తనకు కలిగిన గౌరవభావం వ్యక్తపరిచాడు సీతాపతి.

''నువ్వు చెప్పింది నిజంరా'' వంత పలికాడు రామయ్య.

రామయ్య పొలం వచ్చింది.అక్కడున్న పనివాడితోతను చెప్పడానికి వచ్చిన విషయాలన్నీ చెప్పాడు రామయ్య.

మళ్ళా తిరిగి ప్రయాణం కట్టారు సీతాపతి, రామయ్య.

# 3

ఆ రాత్రి సీతాపతి కంటికి నిద్ర కరువైంది. అతడి కళ్ళముందు పీరాజీగారి మేడ అవుపించసాగింది.

ఠీవిగా, దర్జాగా, అందంగా సిల్కు బట్టల్లో మెరిసి పోతున్న ఒక వ్యక్తి తన పడకగదిలోకి వెళ్ళి తలుపులు మూసి, మంచంమీద నిద్రపోయాడు.

సరిగ్గా అర్ధరాత్రి అయ్యాక, నల్లని ఆకారంలేని నీడలు అతని చుట్టూచేరాయి.

అవి అతని గొంతుపట్టి నులుముతుంటే, అతని గొంతు పెగలడంలేదు. అంతే! అయిదు నిముషాల్లో అతని ప్రాణాలు అనంతవాయువుల్లో లీనమైపోయాయి.

అంత ఘాతుకం జరిగినట్టు ప్రక్క గదిలోఉన్న రత్నమాలకు కూడా తెలీదు.

ఆ తరువాత పీరాజీ మృతదేహాన్ని గాలిలో అవలీలగా యెగరేసి, కిటికీ ద్వారా బయటకు తీసుకెళ్ళి పోయాయి.

మర్నాడు తూర్పున వెలుగురేఖలు విచ్చుకోగానే,

యెప్పటిలా భర్తకు కాఫీ తెచ్చింది ట్రేలో.

చేరవేసి ఉన్న భర్త గది తలుపులు తోసుకుని లోనికి అడుగు పెట్టింది.

ప్రతిరోజూ తను వెళ్ళే వేళకు, యింకా నిద్రాదేవిని గాఢంగా కవుగిలించుకుని నిద్రపోయే భర్త ఆవాళ మంచంమీద లేడు.

'ఆశ్చర్యంగా ఉందే!' అని అనుకుంటూ ఆమె గదంతా కలయజూసింది.

భర్త వీరాజీ అక్కడ గదిలో లేడు.

తోటలోకి పోయి షికార్లు కొడుతున్నాడేమోనని గది కిటికీవద్దకు పోయి తోటలోకి తొంగి చూసింది.

ఆయన అక్కడా లేడు.

పనివాళ్ళ నందర్నీ పిలిపించి, అయన యెక్కడికైనా వెళ్తున్నట్టు చెప్పి వుంచారా అని ప్రతి పనివాడ్ని పేరు పేరునా పిలిచి అడిగింది. లాభంలేక పోయింది.

తమకేమీ తెలియదన్నారు పనివాళ్ళు.

తన భర్త మునుపెపుడూ అలా ప్రవర్తించ లేదు. చెప్పలేని దిగులుతో ఆమె గుండె బరువెక్కింది.

గేరేజీలో కార్లు రెండూ వున్నాయి. గుర్రపుసాలలో గుర్రాలున్నాయి.

ఆయన యెక్కడికి వెళ్ళినట్టు?

ఆమె నేలమీద పడి పసిపాపలా పొర్లి పొర్లి యేడవ సాగింది.

రోజులూ, నెలలూ గడిచిపోయాయి. భర్త తిరిగివస్తాడన్న ఆశ మొన్న మొన్నటివరకూ మినుకుమినుకు మంటున్నా ప్రస్తుతం కొడిగట్టింది.

వీరాజీ యెక్కడికి వెళ్లాడో, యేమిటో ఆచూకీ లేదు.

ఆ భవంతిని పట్టి దేవులాడుకున్న దెయ్యాలే ఆయన్ని

మాయం చేసుండాలన్న సంగతి ఆమెకు రూఢి అయ్యింది.

ఆమె గుండె రాయి చేసుకుని మోడుబ్రతుకు బ్రతక సాగింది.

కన్నీళ్లు చారలుగట్టిన ఓ విషాదవదనం సీతాపతి కళ్ళ ముందు కనిపించి అదృశ్య మయ్యింది.

రత్నమాల మీద అంతులేని సానుభూతితో అతని హృదయం నిండిపోయింది.

ఇంతకూ, వీరాజీని యెత్తుకుపోవాల్సిన అవసరం యెందుకొచ్చింది ఆ దెయ్యాలకు?

వీరాజీ మీద కసి బూనాయా?

అంటే, వీరాజీ వాటిని యేదో చేసి ఉండాలి. ఐతే, యేమిటది?

దెయ్యాలు నిజంగా కసి దీర్చుకున్నాయా?

మొదట్నుంచీ, ఆ భవంతిలో దెయ్యాలున్నాయా? లేక మధ్యలో, వీరాజీ మీద కసి దీర్చుకోవడానికి అక్కడకు చేరాయా?

ఏది యేమైనా, యింత విచిత్రమైన గాథ తను విన లేదు యింతవరకూ.

లెక్కలేనన్ని ప్రశ్నలతో సీతాపతి బుర్ర వేడెక్కి పోయింది.

తెల్లవారుఝామున మాత్రం చిన్న కునుకు పట్టింది.

సూర్యుడు ఆకాశంలో బాగా లేచి, యెండ చురుగ్గా దిగేసరికి, ఇంకా తను మంచాన్ని కరిచిపెట్టుకుని ఉండడం మంచిది కాదనుకున్నాడు. లేచి కాలకృత్యాలు తీర్చుకున్నాడు.

అనసూయమ్మ ఇచ్చిన ఫలహారం తిని, కాఫీ త్రాగాడు.

"బాబాయ్! మొదట్నుంచీ ఆ భవంతిలో దెయ్యాలుండేవా? లేక యీ మధ్యనే వచ్చాయా?" అడిగాడు

రామయ్యను.

"ఓరి!...రాత్రంతా ఆ యింటి గురించే ఆలోచిస్తూ ఉండిపోయావా?" అన్నాడు రామయ్య నవ్వి.

రామయ్య అలా అడిగేసరికి, సిగ్గుతో తల వంచుకున్నాడు సీతాపతి. సమాధానంగా చిరునవ్వు మాత్రం నవ్వి ఊరుకున్నాడు.

"వీరాజీ గొప్ప రసికావతంసుడు. అందమైన ఆడది అతని కంటబడితే చాలు నయ్యానో, భయానో, డబ్బు యెరజూపో అనుభవిస్తేగాని వదిలేవాడు కాదు. అతడు బలాత్కారం చేసి చెరచి వదిలేసిన స్త్రీలు ఆత్మహత్య చేసుకొని, దెయ్యాలై అతడ్ని చంపి కసి తీర్చుకున్నాయంటారు జనం. అతడి వుద్దేశంలో, ఆడదంటే మగవాడికి పడక సుఖం అందించే వస్తువు" రామయ్య చెప్పాడు.

"అలాంటప్పుడు పెళ్ళెందుకు చేసుకున్నాడు?"

"ఏముంది. తనకూ ఓ వంశోద్ధారకుడు కావాలి గదా! కొందరు యేమంటారంటే, అతడి విశృంఖలత్వమే అతడ్ని నిర్వీర్యుడ్ని చేసి, పిల్లలు కలగకుండా చేసిందని. అయితే, అతనికి దొరికిన భార్యలందరూ మహాపతివ్రతలు. అతడేం చేసినా పల్లెత్తు మాటనకుండా, తమకు సంతానం కలగకపోవడం తమ లోపంవల్లనే అని చెప్పుకునే వారు."

"అయితే దెయ్యాలు కసిబూని చంపడం నిజమేనన్న మాట?"

"అంతే అనుకోవాలి మరి. అందమైన స్త్రీలను అనుభవించి తీరాలన్న అతని బలహీనత అతనిచేత ఎన్నో దుర్మార్గాలు చేయించింది. అందుకే, అతన్ని దెయ్యాలెత్తుకుపోయాయని వినగానే 'శని విరగడైంది' అని ప్రజలు సంతోషించారు తప్ప ఒక్కరూ బాధ పడలేదు."

"రత్నమాల కూడా బాధ పడలేదంటావా?"

"ఆవిడెందుకు బాధ పడదూ. ఎంత చెడ్డవాడయినా, అతడామెకు దేవుడు ప్రసాదించిన భర్త. పైగా అతడ్నే ఆమె దైవసమానుడిగా చూసుకుంటోంది. సహజంగా ఆవిడ ఎంతో దుఃఖించింది."

"ఒక్కసారి వీరాజీగారి భవంతి చూడాలని వుంది బాబాయ్."

"అలాగే వెళ్ళు! ఆవిడ చాలా మంచిది. అతిథులంటే ఆవిడ ఎంతో ఆదరిస్తుంది. అక్కడకు పోయి యిలా రామయ్య బంధువునని చెబితే, ఎంతో ప్రేమగా చూస్తుంది."

## 4

వీరాజీ ఆ భవంతిని కట్టించడం విషయంలో గొప్ప సౌందర్యాభిరుచి చూపించాడనే చెప్పుకోవాలి.

చుట్టూ సమతలంగా ఉన్న ప్రదేశంలో అమాంతంగా పొడుచుకువచ్చిన రాతి మిట్ట. మిట్ట మీదిభాగం మళ్ళా సమతలంగా ఉంది. అక్కడ కట్టించాడు ఓ రాతిమేడ. మిట్టపైకి పోవడానికి రోడ్డు వేయించడానికి పగల గొట్టించిన ఆ మిట్ట రాళ్లే చాలామట్టుకు ఉపయోగ పడ్డాయి, ఆ భవంతి కట్టడంలో.

పెద్ద ఫలపుష్పవనానికి మధ్య మూడంతస్తుల భవనం ఠీవిగా ఆకాశంలోకి లేచిఉంది.

మధ్యాహ్నం మూడు దాటాక, సీతాపతి వీరాజీ భవంతికి వెళ్లాడు.

రాత్రిపూట ఆ భవనం, ఒక కన్నుమాత్రం తెరచి వుంచి నిద్రపోతున్న రాకాసిలా అవుపించింది గాని, పగలు అపూర్వ సౌందర్యాలు చిందిస్తూ అద్భుతంగా కని పించింది.

వీరాజీని మనస్సులో మెచ్చుకోకుండా ఉండలేక పోయాడు సీతాపతి.

ఇనపగేటు దాటి తోటలోకి ప్రవేశించగానే, తోటలో ఓ మూల పని చేసుకొంటున్న వృద్ధుడొకడు సీతాపతిని చూసి ముందుకొచ్చి "ఎవరు బాబూ మీరు? ఏంకావాలి మీకు?" అని సౌమ్యంగా, గౌరవంగా అడిగాడు.

అంతటా ఆవరించి ఉన్న నిశ్శబ్దం ఒక్కసారి ముసలాడి మాటలతో భగ్నమయ్యేసరికి, సీతాపతి త్రుళ్ళిపడ్డాడు, అనూహ్యంగా.

కాని, క్షణంలో సంబాళించుకుని, "నేను రామయ్య అన్నగారి అబ్బాయిని. భవంతిని చూడాలని వచ్చాను" చెప్పాడు సీతాపతి.

"ఇక్కడ చూసేదేముంది బాబూ! దెయ్యాలకొంపే!" వృద్ధుడు పేలవంగా నవ్వి అన్నాడు.

"ఇంట్లో యేమీ తోచక, చూద్దామని వచ్చాను. మీ అమ్మగారు యేమైనా అంటారా?"

"అబ్బే! ఆవిడ యేమీ అనరు బాబూ! నేనే అంటున్నా ఇక్కడ చూసేదేముందని...అమ్మగారితో చెప్పమంటూరా?"

"చెప్పిరా!...జమీందారుగారి భవనం అంటే కథల్లో చదువుకోవడం తప్ప యెన్నడూ చూళ్ళేదు... చూడాలని ఉంది. భవనం ఒక్కసారి చూస్తానని చెప్పు."

"అలాగే. దానిదేం భాగ్యం. అమ్మగారికి చెప్పివస్తాను" అని వృద్ధుడు మెల్లగా భవంతిలోకి వెళ్తుంటే, తోటను చూస్తూ వుండిపోయాడు సీతాపతి.

అయిదు నిముషాలు పోయాక వెనక్కి వచ్చాడు వృద్ధుడు.

"బాబూ! అమ్మగారు మిమ్మల్ని తీసుకురమ్మన్నారు

లోనికి'' అన్నాడు సీతాపతితో.

సీతాపతి వృద్ధుడి వెనకనే లోనికి వెళ్ళాడు. ఒక పెద్ద వరండా, ఒక హాలు, మూడు గదులు దాటించి సీతాపతిని ఓ గదిలోనికి తీసుకెళ్ళాడు వృద్ధుడు.

అక్కడో స్త్రీ-సుమారు ముప్ఫై అయిదేళ్ళ వయస్సున్నామె, మెత్తని సోఫాలో వెనక్కి జారగిలబడి కూర్చుని వుంది. ఆమే వీరాజీ మూడో భార్య రత్నమాల అయ్యుంటుందని అనుకున్నాడు సీతాపతి.

ఆమె ఎదుట సీతాపతిని వదిలేసి వృద్ధుడు వెనక్కి వెళ్ళిపోయాడు.

"రా! బాబూ! కూచో!'' అంటూ ఆమె తన కెదురుగా ఉన్న కుర్చీ చూపించింది.

"థేంక్సండీ'' అంటూ ఆమె వైపే చూస్తూ ఉండిపోయాడు, యెలా ఆమెతో సంభాషణ ఆరంభించాలో తెలీక.

ఆమెకు ముప్ఫయి అయిదేళ్ళున్నప్పటికీ, ఆమె సౌందర్యం చెక్కు చెదరలేదు.

ఆమె చూపులు, నిశ్చలంగా అవుపిస్తున్నా, ఆమె కళ్ళల్లో నడిసముద్రపు గాంభీర్యం ఉంది.

ఆమె నుదుట కుంకుమబొట్టు మెరుస్తూ ఉంది! ప్రస్తుతం తన యెదుట తన భర్త లేకపోయినప్పటికీ, యెక్కడో సజీవంగానే వున్నాడన్న ఆమె ప్రగాఢ విశ్వాసం చాటి చెపుతోంది, ఆ బొట్టు.

నీలంరంగు బార్డరున్న తెల్ల సిల్కు చీర కట్టుకుందామె. అదే రంగు జాకెట్టు వేసుకొంది.

ఆమె మొహం చూడగానే, ఆమె ఒక గొప్పింటి ఇల్లాలని ఎవరూ ప్రత్యేకంగా చెప్పకుండానే అర్థమవుతుంది.

"రామయ్య నీకు బాబాయి అవుతాడా?" అంటూ ఆమే సంభాషణ మొదలుపెట్టింది, సీతాపతి పడుతున్న ఇబ్బంది తెలుసుకుని.

"అవునండీ! అంతేగాదు. అనసూయమ్మ మా అమ్మకు స్వయానా పెత్తల్లి కూతురు" గబగబా అనేసాడు సీతాపతి, అవకాశం దొరికింది గదా అని.

"ఏం చదువుకున్నావు బాబూ?"

"బి. ఏ వరకూ చదువుకున్నానండి. ఈ మధ్య సబ్ఇన్స్పెక్టరు పరీక్షకు కూడా వెళ్ళాను. హైద్రాబాదునుంచి మా స్నేహితుడు ద్వారా తెలియ వచ్చిందేమిటంటే, సెలక్షన్ లిస్టులో నా పేరు మొదట ఉందట."

"చాలా సంతోషం బాబూ!" అని ఆవిడ ఊరుకుంది, ఇంకేం మాట్లాడాలో తెలీక.

ఈ లోపున పనిమనిషి ట్రేలో కాఫీలు తీసుకొచ్చింది. సీతాపతికి ఓ కప్పు అందించి, రత్నమాలకు రెండో కప్పు అందించి వెళ్ళిపోయింది.

కాఫీ త్రాగాక "ఇలాంటి భవంతులు యెప్పుడూ చూళ్ళేదండి. చూడాలని వచ్చాను. మీ కభ్యంతరం లేకపోతే చూస్తాను"' చెప్పాడు సీతాపతి, తను వచ్చిన పని గురించి.

"అలాగే బాబూ!" అంటూ చప్పట్లు చరిచింది ఆమె. మరునిముషంలో అక్కడో పనివాడు ప్రత్యక్షమయ్యాడు.

"మేనేజరు రమాకాంత్ గారిని పిలు" అని పనివాడ్ని ఆజ్ఞాపించింది.

"అలాగేనమ్మా" అంటూ పనివాడు వెళ్ళిపోయాడు.

రెండు నిముషాలు పోయాక, తెల్లగా, పొడుగ్గా, సెమీసూటులో ఉన్న నలభై యేళ్ళ వ్యక్తి వచ్చి "పిలిచారట!" అని అన్నాడు, అతి అణుకువగా.

"చూడండి రమాకాంత్ మనకు అతిథులు రావడమే అరుదు. ఈ అబ్బాయి మన భవంతి చూస్తాడుట. చూపించండి" అని మేనేజరుకు చెప్పి "వెళ్ళు బాబూ! వారితో పోయి భవంతి అంతా చూడు" అని అంది సీతాపతివైపు తిరిగి.

"థేంక్స్" అని సీతాపతి చెప్పి, బయటకు కదలి వెళ్ళిన రమాకాంత్ ను అనుసరించాడు.

## 5

రమాకాంత్ విచిత్రమైన వ్యక్తిలా అవుపించాడు సీతాపతికి.

త్రోవ పొడుగునా యజమానురాలు రత్నమాలమీద విసుక్కుంటూనే ఉన్నాడు.

"గతిమాలి ఈ ఇంటికి మానేజరుగా వుండిపోయాను. ఈ పూట ఏ కూర వండించాలన్నది కూడా నాకే చెప్తుంది ఆవిడ. చూడండి! మీకు ఈ ఇల్లు చూపించడానికి నేనే దొరికానా! ఈ ఇంటినిండా నచ్చేంతమంది పనివాళ్ళున్నారు. వాళ్ళల్లో యే ఒక్కర్నయినా పిలిచి ఇల్లు చూపించమన వచ్చుగా" అన్నాడు సీతాపతితో.

"సారీసర్! మీకు ఇబ్బంది కలిగించాను. వెనక్కి వెళ్ళిపోదాం పదండి" అన్నాడు సీతాపతి, అనవసరంగా తన వల్ల రమాకాంత్ కు ఇబ్బంది కలిగిందన్న బాధ కన్పరుస్తూ.

వెంటనే తన చిరాకు తగ్గించుకుని "దయచేసి మీరా పనిమాత్రం చెయ్యకండి. నాకు మాట వస్తుంది" అన్నాడు రమాకాంత్.

భవనంలోని ఒక్కో గది— మూసివున్నవి తెరచి కూడా చూపించసాగాడు రమాకాంత్.

వీరాంజీకి క్లాస్ట్రోఫోబియా ఉందేమో? పాతిక కుటుం

బాలు కాపురం ఉండేలా కట్టించాడు ఆ భవనం.

మూడు అంతస్తుల్లోనూ, మొత్తం ముప్పై పెచిలుకు విశాలమైన గదులున్నాయి. ప్రస్తుతం వాటిలో చాలా మటుకు తాళాలు వేసి, మూసి వున్నాయి.

గదులనిండా వాటికి సరిపడా ఫర్నిచర్ ఉంది. మేడ మీద రెండో అంతస్తులో ఓ గదిలో గోడకు నిలువెత్తున ఓ అందమైన పురుషుడి చిత్రపటం వుంది.

ఆ పటం వీరాజీదే అయ్యుంటుందని, అది వీరాజీ పడకగది కావచ్చునని ఊహించాడు సీతాపతి.

ఆ మాట మేనేజరు రమాకాంత్ ను కూడా అడిగేసాడు.

"ఆఁ ఇదేనండి ఆ గది. ఇక్కడే ఆ బాబుని దెయ్యా లెత్తుకుపోయాయి... దెయ్యాలంటే వేరే యేమీ లేవు... ఆ బాబు చేసిన పాపాలే" అన్నాడు మేనేజరు విసుగ్గా, కోపంగా.

"అయితే, వీరాజీ అంత దుర్మార్గుడుటండీ?" అన్నాడు సీతాపతి, రమాకాంత్ యేం చెప్తాడో తెలుసుకోవాలని పించి.

"మెల్లగా అంటారేమిటండీ. అతని కంటబడి అతని క్రింద నలగకుండా మిగిలిపోయిన అందమైన స్త్రీ లేదంటే అతిశయోక్తి కాదు. కొత్త కొత్త ఆడపిల్లల్ని తీసుకు రావడానికి అతనికి ఏజంట్లు ఉన్నారు దేశంలో అక్కడక్కడ. వీరాజీగారి సరదాలు లెక్కలేనన్ని ఉన్నాయి. ఈ భవంతి ఒక బృందావనంలాగు, తానో కృష్ణుడులాగు భావించేవాడు. తన సరదాలు తీర్చుకోవడానికి తెచ్చిన ముండలు ఉండడానికే ఇన్ని గదులు కట్టించాడు. ఒంటి మీద ఒక్క నూలుపోగయినా లేకుండా, తనూ తన ప్రియురాళ్ళు, యీ భవంతిలో తిరగడం అంటే ఆయనకో పెద్ద సరదా. తాను బాత్ టబ్ లో కూచుంటే, తన

ప్రియురాళ్లు నగ్నంగా వచ్చి తన ఒళ్లు తోమి నీళ్లు పొయ్యాలి. తనకు కావల్సిన స్త్రీతో సంగమించేటప్పుడు తన గదిలోకి పోయి రహస్యంగా కానివ్వ దలుచుకునే వాడుకాడు. తక్కిన ప్రియురాళ్లు చూస్తుండగా, బాహాటంగా, దీపాల కాంతిలో, తను కోరిన స్త్రీని రమించే వాడు" చెప్పాడు రమాకాంత్.

"అలాంటి వాడ్ని ప్రజలు యెలా సహించి ఊరు కున్నారు?"

"ఊరుకోక యేంచేస్తారు. పైగా, నోరుమూసు క్కూచోడంవల్ల అంతా లాభమే. తన కూతురిదో, చెల్లెలిదో, అఖురుకు పెళ్ళాందో శీలంపోతే పోయిందిగాని, రాత్రికి రాత్రి వందలకొద్దీ రూపాయలు వచ్చి తమ చేతుల్లో ఎలా వచ్చి పడతాయి. ఒకవేళ డబ్బువద్దని, రోషం తెచ్చుకుని ఎవడైనా అతడ్ని ఎదిరించితే, ఆ వ్యక్తిని గంటల్లో యీ భూమిమీద ఉండకుండా చేసే వాడు, తన కిరాయి మనుషులచేత."

"అంత స్త్రీ చాపల్యం గలవాడుగదా వీరాజీ. అతని ఆరోగ్యం దెబ్బతినలేదా?"

"ఏమో. ఉక్కు కండరాలతోటి, ఇనప తీగల్లాంటి నరాలతోటి పుట్టినట్టుగా వుండేవాడు. తనలోని కామం కొడిగట్టకుండా మందులు వాడేవాడిని అనుమానం. బహుశా ఇందువల్లనే, తన భార్యలవల్ల సంతానం పొంద లేక పోయాడు. రెండు ప్రక్కలా వెలిగించిన కొవ్వొత్తిలా త్వరలో నిర్వీర్యుడైయాడు."

"అయితే నిస్సందేహంగా, అతడ్ని దెయ్యాలే ఎత్తుకు పోయాయంటారు?"

సీతాపతి ఆ ప్రశ్న వేయగానే, నిరాఘాటంగా, ఉత్సాహంగా చెప్పుకుపోతున్న రమాకాంత్ ఏదో

రసాయన మార్పు హఠాత్తుగా వచ్చినట్టు, మారిపోయాడు.

తనను తాను నిగ్రహించుకుని, మొహం చిరాగ్గా పెట్టి "ఎందుకండీ, మీ కా అనవసర విషయాలు? ఏదో భవంతి చూస్తానన్నారు. చూసి వెళ్ళిపోండి" అన్నాడు రమాకాంత్.

అతడి మాటలకు సీతాపతి బిక్కచచ్చిపోయాడు.

"సారీసర్! మిమ్మల్ని నొప్పించాను" అంటూ క్షమాపణ చెప్పుకున్నాడు.

సీతాపతి భవంతి చూడడం అయిపోయింది. రమాకాంత్ తో దిగువకు వచ్చి రత్నమాలకు థేంక్స్ చెప్పాడు.

ఓపిగ్గా, తనకు భవంతి అంతా చూపినందుకు, పనిలో పనిగా. రమాకాంత్ కు కూడా ధన్యవాదాలు చెప్పాడు.

బయటి గేటువరకూ రమాకాంత్ కూడా వచ్చి, సీతాపతిని సాగనంపాడు.

భవంతి వదలి మిట్టదిగి వస్తున్నాడన్న మాటేగాని, సీతాపతి ఆలోచనలన్నీ అదృశ్యమైన వీరాజీ చుట్టూ పరిభ్రమించసాగాయి.

తన అకృత్యాల ద్వారా, వీరాజీ ఎంతో మంది శత్రువుల్ని తయారుచేసుకొన్నాడు. వీరాజీ వాళ్ళ చేతిలో దిక్కుమాలిన చావుఛస్తే, అతడ్ని దెయ్యాలు ఎత్తుకుపోయాయనుకోవడం లేదుగదా ప్రజలు?

వీరాజీ వంటి దుర్మార్గుడు కనిపించడం లేదంటే, హర్షించేవారు ఎక్కువగాని, 'అయ్యో పాపం' అని అతడి గురించి బాధపడి ఆరాతీసే వాడుండడు.

కాని, ఎవరుచెప్పినా, వీరాజీ దెయ్యాల ప్రభావంవల్లనే మాయమయ్యాడంటున్నారు.

అయితే, వీరాజీ అదృశ్యమయ్యాక, ఆ దెయ్యాలు అమాయకుల్ని అల్లరి పెట్టడంలో అర్థమేమిటి?

ఆ దెయ్యాల సంగతేమిటో తను తెల్సుకోవాలి. తనను ఒక్క రాత్రి ఆ ఇంటిలో రత్నమాల ఉండనిస్తే, దెయ్యాల తోటి అనుభవం యెలాగుంటుందో తనకు తెలుస్తుంది.

గిరుక్కున వెనక్కు తిరిగి, భవనంవైపు వెళ్ళాడు సీతాపతి. ఇందాకటి ముసలివాడు అవుపించాడు మళ్ళా.

"అమ్మగారితో ఓ విషయం మాట్లాడాలనుకుని మర్చిపోయాను. ఓసారి మళ్ళా మీ అమ్మగారి వద్దకు తీసుకెళ్తావా?" అన్నాడు సీతాపతి ముసలివాడితో.

"అలాగే బాబూ! రండి" అంటూ లోనికి తీసుకెళ్ళాడు ముసలివాడు సీతాపతిని.

రత్నమాల మునుపటి గదిలోనే ఉంది. ఏవో కాయితాలు చూస్తోంది దీక్షగా.

"క్షమించండి. మిమ్మల్ని ఓ విషయం అడుగుదామనుకుంటున్నాను" అన్నాడు సీతాపతి గదిలో అడుగు పెడూనే.

"యేమిటది?" అడిగింది రత్నమాల తలెత్తి, నొసలు చిట్లిస్తూ.

"ఇప్పటికీ ఈ భవంతిలో దెయ్యాలున్నాయంటారా?" అడిగాడు సీతాపతి అతిసౌమ్యంగా.

"ఉన్నాయి. ఇప్పటికీ, మమ్మల్ని నానాహింసలు పెట్టాలని చూస్తున్నాయి" చెప్పింది రత్నమాల, చిర్నవ్వు మొహంమీద ధరిస్తూ.

"నాకు. వాటిని చూడాలని వుందండి" కుతూహలం కన్పరుస్తూ అన్నాడు సీతాపతి.

"చూడ్డానికి అవి కంటికి కనిపిస్తే గదా?" అందామె.

"అది గాదండి. దెయ్యాల గురించి నేనిలాంటి కథలు వినలేదండి యెప్పుడూ. వాటిని చూడకపోయినా, అవి వచ్చినప్పుడు యెలాంటి అనుభూతి కలుగుతుందో తెలుసు

కోవాలని ఉంది'' వివరించాడు తన మనసులోని కోరిక.

''క్రూరాడివి నీకు తెలీదు బాబూ! అవి చాలా ప్రమాద కరమైనవి. వీరాజీగార్ని సజీవంగా యెత్తుకు పోయాయి. అవి అతడ్ని ఏం చేసాయో, యేమో, వారు మళ్ళా అవు పించలేదు నా కళ్ళకు. వారు బ్రతికే వున్నారని, ఎప్పటి కయినా నా కళ్ళకు అవుపిస్తారని నా విశ్వాసం. అందుకే, యింకా బొట్టు పెట్టుకుంటున్నాను.''

''ఫరవాలేదండి. మీకు తెలీదు. నేను బాక్సింగ్ ఛాంపియన్‌ని. అంతేగాదు. కర్రసాము, కత్తిసాముగూడా వచ్చు. అంత సులువుగా ఆ దెయ్యాలకు నేను లొంగను'' చెప్పాడు సీతాపతి ధైర్యంగా.

''అది కాదు బాబూ! నీకేదైనా ప్రమాదం జరిగితే మాకు మాట వస్తుంది. నువ్వు యీ వూరు చుట్టంచూపుగా వచ్చావు. అందుకని అలా అంటున్నాను.''

''ఫరవాలేదండి. నన్ను నేను రక్షించుకోగలను. ఈ ఊళ్ళో ఉన్న నాలుగు రోజులూ మీ భవనంలో రాత్రి పూట ఉండడానికి అనుమతి యివ్వండి'' అన్నాడు సీతా పతి బ్రతిమాలుకుంటున్నట్టుగా.

''సరే బాబూ!'' అందామె.

అదే సమయంలో మేనేజర్ రమాకాంత్ అక్కడకు వచ్చాడు.

''అరె! గేటువరకూ సాగనంపి వచ్చానే. మళ్ళా ఎప్పుడొచ్చారు యిక్కడికి?'' ఆశ్చర్యంగా అడిగాడు రమాకాంత్ సీతాపతిని చూసి.

సమాధానంగా చిరునవ్వు నవ్వాడు సీతాపతి.

''చూడండి మేనేజర్. ఈ కుర్రాడు నాలుగు రోజులు మన భవంతిలో ఉండాలనుకుంటున్నాడు. మేడమీది గది ఒకటి యీయనకు యివ్వండి'' ఆదేశించింది రత్నమాల.

"ఏమిటి? యీ దెయ్యాల కొంపలో ఉంటారా? అర్థంలేని సాహసం చేస్తున్నారు" అన్నాడు రమాకాంత్ సీతాపతి వైపు తిరిగి.

"అవన్నీ మీకన్నా ముందు నేను చెప్పాను లెండి. దెయ్యాల్ని చూడాలని తెగ ఉబలాట పడుతున్నాడు. ఏర్పాట్లు చెయ్యండి" ఆజ్ఞ ప్రమోగింది ఆమె కంఠంలో.

కోపంతో యెర్రబారిన మొహంతో రత్నమాలను చూస్తూ "అ కుర్రాడేదో తెలివితక్కువగా అంటే, దానికి మీరెలా అంగీకరించారు" అన్నాడు రమాకాంత్.

"అనవసరంగా వాదనలు పెంచకండి. నేను చెప్పింది చెయ్యండి" అందామె శాంతంగా. కాని, అందులో ఆమె అధికారం సుస్పష్టమైంది.

"చేస్తాను. చెయ్యనూ...అందుకేగా నేను యిక్కడ వున్నదీ..." మొహం చిటమటలాడించుకుంటూ అక్కడ్నుంచి కదిలిపోయాడు మేనేజరు.

"బాబూ! ఇవాళ రాత్రే వచ్చేయదల్చుకున్నావా? పక్క బట్టలు వేరే తెచ్చుకో నక్కరలేదులే...అన్ని యేర్పాట్లు మేనేజరే చేస్తాడు. వెళ్ళి యింటివద్ద చెప్పిరా" అందామె సీతాపతి వైపు తిరిగి.

"చాలా థేంక్సండీ!" అంటూ ఆనందాన్ని వ్యక్తం చేసాడు సీతాపతి.

ఇంటివద్ద చెప్పి రావడానికి బయలుదేరాడు.

## 6

రాత్రిపూట వీరాజీ భవంతిలో సీతాపతి పడుకోవడానికి, రామయ్య అనసూయమ్మలు ఎంతమాత్రమూ ఒప్పుకోలేదు.

తనకేమీ ప్రమాదం కలగదనీ, తనను తాను రక్షించుకోగలననీ, వార్ని నమ్మించి ఒప్పించేసరికి సీతాపతి తల

ప్రాణం లేచొచ్చినట్లనిపించింది.

రాత్రిపూట వేసుకునే బట్టలు మాత్రం చిన్న సంచిలో పెట్టుకుని, దీపాలు వెలిగించే వేళకు వీరాజీ భవంతికి చేరుకొన్నాడు సీతాపతి.

అప్పటికి అతనికి కేటాయించబడ్డ గదిని, పనివాళ్ళు తుడిచి, వాసయోగ్యంగా సిద్ధంచేసి ఉంచారు.

వీరాజీ అదృశ్యమయ్యాక, భవనంలో కొన్ని గదులు మాత్రమే వాడుతూ, మిగతా వాటికి తాళాలు బిగించి ఉంచుతున్నారు.

సీతాపతికి ఇచ్చిన గదికూడా అలా మూసిఉంచిన గది కావడం వలన, ముక్కి వాసన వేస్తోంది కొంచెం. పనివాళ్లు అందుకే అగరొత్తులు వెలిగించి, గది నలుమూలలా వుంచారు.

జనరేటరు సాయంతో కరెంటు దీపాలు వెలుగుతున్నాయి భవంతిలో, దేదీప్యమానంగా.

తనకివ్వబడిన గదిని పరిశీలనగా చూసాడు సీతాపతి. గదిలో ఓ మూలగా పందిరిమంచం ఉంది. దానిపైన శుభ్రమైన దుప్పటి పరచబడి ఉంది. మంచానికి కాస్త దూరంలో ఓ టేబులు, రెండు కుర్చీలు ఉన్నాయి.

గోడలకు వుడెన్ పానలింగ్ ఉంది. రెండు మూడు తైల వర్ణచిత్రాలు గోడల్ని అలంకరించి ఉన్నాయి.

ఓ మూల గోడల్లో బిగించిన చిన్న స్పీకరుంది.

"ఎందుకదీ?" అడిగాడు సీతాపతి, అక్కడున్న పనివాడ్ని.

"అప్పుడప్పుడు పాటలు విన్పిస్తారండి. మీరు వినాలంటే, యిలా అనండి" అంటూ ఆ స్పీకర్ని ఎలా వాడుకోవాలో వివరించి చెప్పాడు పనివాడు.

"ఒహో! అలాగా. వీరాజీగారు గొప్ప విలాస పురు

షుడే నన్నమాట" వ్యాఖ్యానించాడు సీతాపతి.

"అవును బాబూ! వీరాజీ గారున్నప్పుడు యీ భవంతి నిజంగా ఇంద్రభవనంలా ఉండేది. ఎప్పుడూ పార్టీలే. ఎప్పుడూ విందులే. అందమైన అమ్మాయిల్ని అనుభవించి తీరాలన్న బలహీనతే ఆయనకు లేకపోయి వుండే ఆయన చాలా మంచివాడు బాబూ!" చెప్పాడు పనివాడు.

శూన్యంలోకి చూస్తూ ఏవేవో జ్ఞాపకాల్ని సంతరించుకుంటున్న అతడి చూపుల్ని బట్టి, పనివాడి కళ్ళల్లో గతం కదులాడుతోందని అర్థం చేసుకున్నాడు సీతాపతి.

"నువ్వు ఆ వీరాజీగారు ఉన్నప్పుడు ఉండేవాడివా?" అడిగాడు సీతాపతి.

"అఁ...ఉండేవాడ్ని బాబూ!" జవాబిచ్చాడు పనివాడు.

"ఆయన్ని నిజంగా దెయ్యాలెత్తుకుపోయాయంటావా?"

"ఏమో బాబూ! తెల్లవారేసరికి ప్రక్కమీదున్న మనిషి కనిపించలేదంటే యేమనుకోవాలి."

"అంటే, యీ ఇంటిలో మొదట్నుంచీ దెయ్యాలుండేవన్న మాట?"

"అబ్బే లేదు బాబూ! వీరాజీగారు మాయమవడానికి రెండు మూడు నెలల నుంచి, దెయ్యాలు దాపురించాయి ఇక్కడ."

"ఆ దెయ్యాల్ని నువ్వెప్పుడైనా చూసావా?"

"లేదు బాబూ! రాత్రి పదయ్యేసరికి ఎవరి గదుల్లోకి వారు పోయి తలుపులు బిడాయించుకుంటాం. అవి చేసే అల్లరి, గంద్రగోళం అంతా యింతా కాదు. ఇహ బయటికొచ్చి చూసే ధైర్యం ఎవరికుంటుంది? ఒక్కసారి ఓ పనివాడు యేం జరుగుతుందో చూడాలని బయటకొచ్చాడు.

చచ్చేటట్టుగా కొరడా దెబ్బలు తిన్నాడు. మర్నాడు నూట అయిదు డిగ్రీలతో జ్వరం వచ్చింది. అవాళ సాయంకాలమే చచ్చిపోయాడు వాడు.”

పనివాడు అలా చెప్పగానే సీతాపతి గుండెల్లో ఎందుకో భయం సన్నగా తలెత్తింది. అయినా, యేమిటవుతుందో చూద్దాంలే అని మొండిగా అనుకున్నాడు.

“అయితే, అయ్యగారు అవుపించక పోవడం దెయ్యాల వల్లనే నంటావ్?”

“అవునండీ!” అంటూ పనివాడు ఇంకా యేమో చెప్పబోతుంటే “ఒరే! రాముడూ!” అంటూ బయటనుంచి రమాకాంత్ పిలుపు వినిపించింది.

“వస్తున్నా బాబూ!” అంటూ పనివాడు బయటకు వెళ్ళిపోయాడు.

ఆ తరువాత రెండు క్షణాలు పోయాక “కొట్టకండి బాబూ! పాదాలు పట్టుకుంటాను. క్షమించండి బాబూ!” అంటూన్న రాముడి వేడుకోలు, ఏడుపు, పేలుతున్న కంచీ కొసల శబ్దం కలసి కలగాపులగంగా విన్పించింది దిగువనుంచి.

రాముడేం తప్పుచేసాడని దెబ్బలు తింటున్నాడు? దిగువకుపోయి కనుక్కొని రావాలన్న ఉబలాటం కలిగింది సీతాపతికి.

తాను అనవసర జోక్యం కలుగజేసుకుంటున్నాడేమో అన్న ఆలోచన రాగానే, తన ప్రయత్నం మానుకున్నాడు.

# 7

రాత్రి పన్నెండుదాటి పది హేను నిముషాలయిందని రిస్టు వాచీ చూసి తెలుసుకున్నాడు సీతాపతి.

అంతవరకూ మేల్కొనే వున్నాడు, ఏవో పుస్తకాలు చదువుతూ.

ఆ క్షణంవరకూ ఎలాంటి గడబిడ లేకపోవటం చూసి 'కొంపదీసి, ఇవాళ దెయ్యాలు సెలవు తీసుకున్నాయేమిటి, నేను వచ్చానని' అనుకుని, తనలో తాను నవ్వుకున్నాడు.

'ఇహ నిద్రపోవడమే ఉత్తమం' అని లేచి లైటార్పడానికి వెళ్ళుతుంటే, లైట్లు ఫాటంతట అవే టక్కున ఆరిపోయాయి.

చిక్కని చీకటి గదంతా ఆవరించుకుంది. అమావాస్య రాత్రులు పైగా. ఆకాశంలో దట్టంగా మబ్బులు. మామూలుగా కనిపించే నక్షత్రాల కాంతి గూడా కనపడడం లేదు బయటనుంచి.

దీపాలు ఆరిపోవడం సంగతి తను వూహించుకోనయినా లేదు. లేకపోతే, టార్చిలైటు తెచ్చివుండేవాడు.

మెల్లగా తడుముకునిపోయి మంచాన్ని చేరుకుని, పడుకుని, ఏం జరుగుతుందా అని తదేకంగా గమనించసాగాడు.

గదికి వెలుపల ఎవరో పరిగెడుతున్నట్టు ఎవరిదో పాదాల చప్పుడు.

అవి ఒకరివికావు. యిద్దరివి.

ఒకర్నొకరు తరుముకుంటున్నట్టుగా వుంది. అందులో ఒకరు మేడ మెట్లెక్కబోయి జారి పడ్డట్టున్నారు. చెక్క మెట్లమీద మనిషి పడి దబాదబా కిందికి దొర్లినట్టు శబ్దం.

ఆ తరువాత ఎవర్నో కర్రతో గట్టిగా కొడుతున్నట్టు చప్పుడు.

"అమ్మోయ్! నాయనోయ్!...తల పగిలిపోయింది రక్తం...బాబోయ్! నన్ను చంపేస్తున్నారు" దెబ్బలు తింటున్న వ్యక్తి పెడుతున్న చావుకేకలు.

ఆ మనిషి దెబ్బలు తిని తిని, ప్రాణాలు పోగొట్టుకునేంత

వరకూ, కర్ర దెబ్బలు, ఆ మనిషి అరుస్తున్న అరుపులు వినిపిస్తూనే ఉన్నాయి.

ఆ తరువాత విసుగ్గా నేలను కర్ర పారేసి హంతకుడు పారిపోతున్నట్టు, గట్టిగా పడుతూ, కాని, అంతకంతకూ దూరమవుతున్న పాదాల చప్పుడు.

ఆ క్షణంలో ఆ భవంతిలో ఘోరమైన హత్య ఒకటి జరిగిందనుకున్నాడు సీతాపతి. వెంటనే లేచి బయటకు వెళ్లామా అన్నంత ఉత్సుకత కలిగింది. కాని బలవంతంగా అణుచుకున్నాడు.

అదంతా దెయ్యాలు కలిగిస్తున్న భ్రాంతి అని తెలుసుకుని ఊరుకున్నాడు.

తరువాత భయంకర నిశ్శబ్దం అంతటా అలుముకుంది.

పావుగంట గడిచింది.

ఈసారి, ఎక్కడ్నుంచో సన్నగా వినిపించడం మొదలుపెట్టింది, ఓ ఆడదాని మూలుగు.

ఆ నిశ్శబ్ద వాతావరణంలో, ఆ మూలుగు ఉక్కు గుండెల్ని కూడా ముక్కలు చేసేలా ఉంది.

ఆ మూలుగు క్రమంగా దగ్గరై, నెమ్మదిగా వెక్కిళ్ళ ఏడుపుగా మారి, ఆ తరువాత పెద్ద రోదనగా మారింది.

అంతలో ఓ పాతిక మంది జనం, ఆడ మగా తమలో తాము ఒక్కుమ్మడిగా కసురుకుంటున్నట్టు, కేకలు వేసుకుంటున్నట్టు, అది మెల్లగా కొట్లాటకు దారితీయగా, ఒకర్నొకరు కొట్టుకుని, యిద్దరు ముగ్గురు అక్కడికక్కడే ప్రాణాలు వదిలినట్టు పెద్ద కలకలం.

అది క్రమంగా అంతరించిపోయి సన్నగా ఏడుస్తున్న స్త్రీ గొంతు మాత్రం మళ్ళీ వినపడసాగింది.

సీతాపతి రక్తం గడకట్టుకుపోయింది. అలాంటి అనుభవం ఎన్నడూ కలగలేదేమో, తను అక్కడకు రావడం

అర్థంలేని సాహసమే అనుకున్నాడు.

అయితే, తను మంచం మీదకు చేరేముందు, తలుపులు బిగించే వచ్చాడు.

లేకపోయుంటే, అవి తననేం చేసివుండేవో?...

అదిరిపోతున్న గుండెల్ని అదుపులోకి తెచ్చుకోవడం కష్టంగావుంది సీతాపతికి.

అరగంటసేపు మళ్ళా నిశ్శబ్దం. అంతటా శ్మశానశాంతి.

అతడి గుండెల చప్పుడు అతనికే వినిపిస్తోంది, తుఫాను హోరులా.

ఈసారి నిజంగానే తుఫాను హోరు విన్పించసాగింది. చెట్లు గాలికి ఊగి ఊగి పెళ్ళున విరిగి కూలిపోతున్నట్లు, కట్టలు తెంచుకున్న నదులు భీకరంగా తమ తోవలో ఉన్న సర్వస్వాన్నీ ముంచి పారుతున్నట్లు-చప్పుడు.

మధ్యలో సన్నగా—ఎక్కడో దూరంగా-గుక్కపట్టి ఏడుస్తున్న చంటిపిల్ల ఏడుపు.

సీతాపతి గుండెలవిసిపోయాయి.

దెయ్యాలున్నాయని, వాటిని తాము చూసేమనీ, చెప్పే వాళ్ళందరకూ ఏదో మనోరుగ్మత ఉండితీరాలని ఆ క్షణం వరకూ అనుకునేవాడు సీతాపతి. ఆ భావాలన్నీ ఒక్క దెబ్బతో తుడిచిపెట్టుకుపోయాయి.

దెయ్యాలున్నాయని ఇప్పుడు ఎవరు నమ్మినా నమ్మక పోయినా, తనుమాత్రం గట్టిగా నమ్ముతున్నాడు.

తెల్లవారింది. సూర్యోదయమైంది. ఎండ గదిలోకి వచ్చిపడుతున్నప్పటికీ సీతాపతి ఇంకా రాత్రి అనుభూతి లోనే వున్నాడు.

పనివాడొచ్చి, గట్టిగా తలుపు తట్టినప్పుడు యీ లోకం లోనికి వచ్చి పడ్డాడు.

కాలకృత్యాలు తీర్చుకోవడానికి, ఫలహారం వగైరా

తిని రావడానికి రామయ్య ఇంటికి వచ్చాడు.

రాత్రి అనుభవం అంతా అనసూయమ్మకు చెప్పాడు. రామయ్యకూడా అక్కడే వున్నాడు. సీతాపతి చెప్పిందంతా ఆయనగూడా విన్నాడు.

"ఒరేయ్! ఇంతమంది అక్కడ దెయ్యాలున్నాయని పదే పదే చెప్తుంటే, అదెలా పొల్లవుతుందిరా?" అన్నాడు రామయ్య.

"పోనీ లెద్దురూ. ముత్తంమీద, ఆ దెయ్యాలు మన వాడ్నేం చెయ్యలేదు. అదే చాలు" అంది అనసూయమ్మ.

"కాని బాబాయ్! నాకో అనుమానం ఉండిపోయింది" అన్నాడు సీతాపతి.

"యేమిటది?" అడిగాడు రామయ్య.

"దెయ్యాలు కసికొద్దీ మనిషిని చంపెయ్యొచ్చుగాని, మటుమాయం యెందుకు చేసాయి?"

"ఒరేయ్! అదీ ఒక ప్రశ్నేనురా! నువ్వు అనుకున్నట్టుగానే, అవి ప్రవర్తించాలని యెక్కడన్నా ఉందా?"

ఆ మాటలకు సీతాపతి చిన్నబోయాడు. మవునం వహించాడు.

ముడుచుకుపోయిన సీతాపతి మొహంలోకి కాసేపు చూసి "ఓహో! కొద్దిరోజుల్లో సబిన్స్పెక్టరువి కాబోతున్నావు కదూ. ఇప్పట్నుంచి అందుకే ఆ పోకడలో ఆలోచించడం మొదలెట్టావు. అవునా" అంటూ గట్టిగా నవ్వేసాడు రామయ్య.

అనసూయమ్మకూడా శృతి కలిపింది.

మధ్యాహ్నం భోజనం అవగానే, మంచం మీదకు చేరాడు సీతాపతి. ముందు రాత్రి నిద్రలేదేమో, మత్తుగా నిద్ర పట్టేసింది.

సాయంకాలం అయిదవుతుండగా, మెలకువ వచ్చింది.

అతడికి ప్లేటుతో టిఫిను, కాఫీ గ్లాసు అందించింది అనసూయమ్మ.

ఫలహారం తిని కాఫీ త్రాగుతూ, పాత విజయచిత్ర పత్రికలు తిరగేయసాగాడు.

ఏదో చిత్రం తాలూకు పాటల రికార్డింగు సందర్భంలో తీసిన ఫోటోలో కనిపించిన ఓ వ్యక్తిని చూడగానే, తక్కువ ఆగిపోయి, ఆ బొమ్మను దీక్షగా చూడసాగాడు.

ఆ వ్యక్తి అచ్చు మేనేజరు రమాకాంత్‌లాగానే ఉన్నాడు. కాని అతని పేరు ఉమాకాంత్.

మనిషిని బోలిన మనిషి ఉన్నాడనుకోవచ్చునా? లేక రమాకాంత్ కవల సోదరుడు సినిమారంగంలో ఉన్నాడా?

లేక ఆ ఉమాకాంత్, ఈ రమాకాంతేమో!

బట్టలు మార్చుకుని ఆ పత్రిక చేత బుచ్చుకుని వీరాజీ భవంతికి బయలుదేరాడు సీతాపతి.

"ఎక్కడికిరా అబ్బాయ్?" అడిగింది అనసూయమ్మ.

"వీరాజీ భవంతికి" చెప్పాడు సీతాపతి.

"మళ్ళా యెందుకు?"

"మేనేజరు రమాకాంత్ గార్ని కలుసుకోవాలి."

"అయితే పోయిరా."

అరగంటలో వీరాజీ భవంతి చేరుకున్నాడు. అయిదు నిముషాల్లో మేనేజరు రమాకాంత్ ఆఫీసు గదిలో ఉన్నాడు సీతాపతి.

"చూసారా సార్! ఈయనకూ మీకూ చాలా దగ్గర పోలికలున్నాయి" అన్నాడు సీతాపతి; తను చూసిన విజయచిత్రలోని బొమ్మను చూపి.

రమాకాంత్ మొహంలో క్షణం సేపు కంగారు కనిపించింది. కాని వెంటనే సర్దుకుని "నాకో తమ్ముడుండేవాడు లెండి, ఉమాకాంత్ అని. రికార్డింగ్ భాగంలో

పనిచేస్తుండేవాడు" అని చెప్పాడు.

ఆ ఫోటో చూసి రమాకాంత్ కంగారుపడాల్సిన అవసర మేముంది?

ఆ కంగారుకు కారణమేమిటి? సీతాపతి మనస్సు సంశయాత్మక మైంది.

అదే సమయంలో ఏదో పనిమీద రత్నమాల కూడా అక్కడకు వచ్చింది.

విజయచిత్రలోని ఆ ఫోటో ఆమెకూ చూపి, ఫోటోలో ఉన్న వ్యక్తికీ, రమాకాంత్ కూ దగ్గర పోలిక లెలా వున్నాయో వర్ణించాడు సీతాపతి.

ఆ సమయంలో రత్నమాల మొహంలో కూడా అవుపించిన కలవరపాటు చూసి ఆశ్చర్య చకితుడయ్యాడు సీతాపతి.

రత్నమాలనీ, రమాకాంత్ నీ కలవరపెట్టే విశేష మేముంది ఆ ఫోటోలో?

ఏవేవో అర్ధంలేని వూహా చిత్రాలు గీస్తోంది సీతాపతి మనస్సు. ఏదో రహస్యం చేజిక్కినట్టు అనిపించి అంతలోనే అంతా గజిబిజిగా తయారవుతోంది.

"భోంచేసి వస్తానండీ రాత్రి పడుకోవడానికి."

అనాలోచితంగా అనేసి బయటకు వచ్చేడు సీతాపతి.

రాత్రి భోంచేస్తున్నాడన్న మాటేగాని, అతని ధ్యాస తిండిమీద లేదు.

రకరకాల ఆలోచనాతరంగాలు లేస్తున్నాయి అతని మనస్సులో.

"ఇవాళ రాత్రిగూడా అక్కడే నా పడక" అని చెప్పి పిన్ని, బాబాయ్ యేమేమో అంటుంటే వినిపించుకోకుండా, బయటకు పరుగెత్తుకొచ్చి, అరగంటలో భవంతిలో తన గదికి చేరుకున్నాడు.

ముందు రాత్రి తనతో పిచ్చాపాటీ మాట్లాడిన పని వాడు రాముడు కనిపించాడు.

ముహం వాడిపోయి వాడు ఏడుపు కళ్ళతో ఉన్నాడు.

"ఏమిటోయ్! అలాగున్నావేం?" అడిగాడు సీతాపతి పనివాడ్ని అనునయంగా.

"బాబూ! నన్నేం అడగకండి. మీకు పుణ్యముంటుంది" అన్నాడు పనివాడు చేతులెత్తి దండంపెట్టి.

"ఏమోయ్ అలాగ? మేనేజరుగారు నాతో మాట్లాడ వద్దన్నారేమిటి?" అన్నాడు సీతాపతి నవ్వుతూ.

"నన్ను కొట్టారంటే, అయ్యగారికి తప్పులేదు బాబూ! నవుకర్లం, మాకు యింట్లో జరిగిన సంగతులన్నీ తెలుస్తాయి. పైవాళ్ళతో మాట్లాడేటప్పుడు, యేం అనాలో, యేం అన గూడదో తెలీక అన్నీ వాగేస్తుంటాం" అన్నాడు పని వాడు తనను తాను నిందించుకుంటూ.

యేమిటీ? రాత్రి రాముడ్ని మేనేజరు కొట్టింది, తనతో మాట్లాడినందుకా?

అంటే పనివాడు ఏదో వాగితే, ఆ వాగుడు ద్వారా తమ రహస్యం ఏదో బయటపడుతుందని భయపడ్తున్నారన్న మాట!

అటువంటప్పుడు, వాళ్ళు అతిజాగ్రత్తగా కాపాడు కొస్తున్న రహస్యమేమిటి?

నిన్నటిలా గాకుండా ఇవాళ, టార్చిలైటు, పొరబాటున పెట్టెలో పెట్టేసి తనతో తీసుకొచ్చిన "నకుల్ డస్టర్", జేబులో పెట్టుకుని తీసుకొచ్చాడు, భవంతికి.

పనివాడు వెళ్ళిపోయాడు.

గది తలుపు బిగించి, నిన్నటిలా చదవడానికి ఉపక్ర మించాడు.

రాత్రి పన్నెండు దాటాక, ముందురోజు లాగానే, లైట్లారిపోయాయి.

గదిలో గాఢాంధకారం అలుముకుంది.

పావుగంట పోయాక బయట ఏవేవో శబ్దాలు ముందు రోజు మాదిరిగానే వినవచ్చాయి.

సీతాపతి మెల్లగా మంచంమీంచి లేచాడు. టార్చి లైటు వెలిగించి, గోడలమీద ప్రసరించి, అటూ ఇటూ త్రిప్పాడు.

గది మూలనున్న స్పీకర్ను ఆన్ చేసే స్విచ్చి కనిపించింది. వెళ్ళి ఆన్ చేసాడు.

అంతవరకూ బయట విన్పడుతున్న శబ్దాలు, తన గదిలోనే, తన ఎదుటే జరుగుతున్నట్టుగా విన్పించసాగాయి.

మిస్టరీ విడిపోయిందన్న ఆనందం ఒకవైపు, అందుకు కారణం తనే అన్న గర్వం ఇంకోవైపు కలగ్గానే, అతని మొహం నవ్వులతో వికసించింది.

జేబులోంచి 'నకుల్ డస్టర్' తీసి చేతికి తగిలించుకున్నాడు. చప్పుడు చెయ్యకుండా గది తలుపులు తెరచి బయటకు వచ్చాడు.

అంతటా చిక్కని చీకటి. టార్చిలైటు ఒక్కో గది మీద వేసుకుంటూ, ఆ అంతస్తులోని గదులన్నీ చూసాడు.

ఏ గదిలోనూ లైట్లు లేవు.

మూడవ అంతస్తుకు తీసుకుపోయే మెట్లు కనిపించాయి. వాటిని పట్టుకుని మూడవ అంతస్తు చేరుకొన్నాడు. అక్కడ ఒకే ఒక గదిలో దీపాలు వెలుగుతున్నాయి.

'ఇక్కడ నుంచేనన్నమాట, తనకు దెయ్యాల సంగీతం విన్పిస్తోంది' అని అనుకుంటూ, ఆ గది సమీపించాడు సీతాపతి. తెరచివున్న కిటికీలోంచి లోనికి చూసాడు.

అక్కడ కనిపించిన దృశ్యం సీతాపతిని ఒక ప్రక్క

ఆశ్చర్యంతోనూ, ఇంకో ప్రక్క అసహ్యంతోనూ ముంచెత్తింది.

రత్నమాల నగ్నంగా మంచంమీద బోర్లాపడుకుని ఉంది. రమాకాంత్ కూడా నగ్నంగానే ఉన్నాడు. కాని, అతని చేతిలో బెల్టు ఉంది.

అతను బెల్ట్‌తో ఆమెను బాదుతున్నాడు.

ఆమె "అమ్మో! అయ్యో!" అంటూ మూలుగుతూ, ఏడుస్తూ దెబ్బలు భరిస్తోందే తప్ప ఏమాత్రం ప్రతిఘటించడం లేదు.

బెల్ట్ దెబ్బలు వేస్తున్న రమాకాంత్ కళ్ళల్లో కారుణ్యం జాలి వగైరా సున్నితమైన భావాలు లేవు.

అనిర్వచనీయమైన వెర్రిఆవేశం చిందులు వేస్తోంది అతని మొహంలో.

అయిదు నిముషాలు పోయాక ఆమె వెల్లకిలా తిరిగింది. "ఇక చాలు కమాన్ డార్లింగ్" అంటూ అతడ్ని పిలిచింది, ఆపుకోలేని తమకంతో.

రమాకాంత్ బెల్ట్‌ను ఓ మూలకు గిరవాటేసి ఆమె మీదకు దుమికాడు.

ఆ తరువాతి కార్యక్రమం చూడలేక పోయాడు సీతాపతి.

గిరుక్కున వెనక్కు తిరిగి, తన గదికివచ్చి, నిద్ర పోయాడు.

# 8

"గుడ్ మార్నింగ్ సార్!" అన్నాడు సీతాపతి, టుటౌను పోలీసు స్టేషనులో అడుగుపెట్టి, ఎదురుగా టేబిలు ముందున్న కుర్చీలో కూర్చున్న సబిన్స్పెక్టరు మోహన్ నుద్దేశించి.

"గుడ్ మార్నింగ్ రండి. కూర్చోండి" అన్నాడు సబిన్స్పెక్టరు మోహన్, తన కెదురుగా ఉన్న కుర్చీని సీతాపతికి చూపించి.

"థేంక్స్" చెప్పి మోహన్ చూపిన కుర్చీలో కూచున్నాడు సీతాపతి.

"ఆఁ ఇప్పుడు చెప్పండి. ఏమిటి కావాలి మీకు" అడిగాడు మోహన్.

"ముందు నన్ను నేను పరిచయం చేసుకోనివ్వండి. నా పేరు సీతాపతి బి.ఏ. వరకూ చదువుకున్నాను. ఈ మధ్యనే సబిన్స్పెక్టరు సెలక్షన్ కు కూచున్నాను. అనఫిషియల్ గా తెలియవచ్చిం దేమంటే, లిస్టులో నా పేరు మొదట్నే ఉందట."

సీతాపతి మాటలకు అడ్డుపడి "కంగ్రాచ్యులేషన్స్, త్వరలో మీరూ మాలో కలవబోతున్నారన్న మాట" అన్నాడు మోహన్.

"థేంక్యూ! థేంక్యూ వెరీ మచ్!...అయితే ఓ విషయంలో మీ సలహా కోరి యిలా వచ్చాను...శ్రమనుకోకుండా నేను చెప్పేది వినడానికి, ఓ అరగంట టైమ్ స్పేర్ చెయ్యగలరా?"

"ఓ...అలాగే చెప్పండి".

"డబ్బు అవసరపడి ఈ మధ్య కోటపాడులో ఉన్న మా బంధువులింటికి వెళ్ళాను" అంటూ తను ఆ వూరు వెళ్ళిన దాదిగా జరిగిన సంఘటనలన్నీ చెప్పి "నేనుచూచిన దానిమీద మీ అభిప్రాయం చెప్పండి. వినాలని వుంది" అని ముగించాడు సీతాపతి.

కాసేపు దీర్ఘాలోచనలో పడిఉండిపోయి మోహన్ తన అభిప్రాయం తెలియజేసాడు.

"అది పల్లెటూరు కావడంవలన ప్రజలు అమాయకులు.

స్పీకర్లు వగైరా వాటిగురించి తెలీదు.

ప్రజలు నమ్ముతున్నట్టుగా అక్కడ దెయ్యాలు లేవు. దెయ్యాలున్నాయన్న భ్రాంతి కలిగించాయి, రమాకాంత్, రత్నమాలలు వేస్తున్న టేప్స్. అంటే, యీ నాటకం చాన్నాళ్ళనుంచి సాగుతోంది. అయితే ఎందుకా నాటకం? రమాకాంత్, రత్నమాలలకున్న అక్రమ సంబంధం బయట పడకుండా ఉండడానికా?

ఆ భవంతిలో ఉన్న వాళ్ళందరూ పనివాళ్ళే. వాళ్ళకు జడిసి, ఇంత పెద్ద దెయ్యాల నాటకం ఆడుతున్నారను కోవడానికి వీలులేదు. అంటే, ఆ నాటకం ఇంతకుముందు కూడా జరిగిందన్నమాట."

"అంటే, వీరాజీగారున్నప్పుడనా మీ అభిప్రాయం" మధ్యలో అడ్డుతగిలి అన్నాడు సీతాపతి.

"అవును! నిజానికి అతనినుంచి తమ అక్రమ సంబంధం తాలూకు రహస్యం కాపాడుకోవడానికి దెయ్యాల నాటకం ఆడబడి వుండాలి. అయితే రంకుతనం, దొంగతనం ఆట్టే కాలం సాగవు. మీకు దొరికిపోయినట్టే, వీరాజీకి కూడా దొరికిపోయి వుంటారు. ఆ విషయం వారికికూడా తెలిసింది. అతడే వారిమీద యాక్షన్ తీసుకోకముందు, వారే అతడ్ని మాయం చేసేసారు. హత్య చెయ్యాడం సులువేగాని, శవాన్ని మాయం చెయ్యాడం కష్టం. శవాన్ని ఆ భవంతిలో ఎక్కడో పాతిపెట్టేసి వుంటారు. దానికోసం ఎవరూ వెతికే ఆస్కారం లేకుండా దెయ్యాలెత్తుకు పోయాయన్న వదంతి లేవతీసారు."

"ఇంచు మించు మీ ఆలోచనలు, నావీ ఒకేలా వున్నాయ్... అయితే నాకో సందేహం ఉంది?"

"ఏమిటది?"

"తాము భయపడాల్సిన వ్యక్తిని తమనుంచి తొలగిం

చేసుకున్నారు. మరి, ఆ తరువాత కూడా యీ దెయ్యాల నాటకం యెందుకు సాగిస్తున్నట్టు?"

"రత్నమాలకు తను 'పతివ్రత దైవభక్తురాలు, చాలా మంచావిడ' వగైరా పేరు వదులుకోవడం ఇష్టంలేకపోయి ఉండాలి. అంతేగాదు. కొన్నాళ్ళపాటు యీ దెయ్యాల నాటకం సాగించకుండా, టక్కున ఆపేస్తే, ఎవరికైనా, అనుమానాలు కలగవచ్చునని వారు భయపడి వుండాలి."

"ఇంతకూ, రమాకాంత్ రత్నమాలను అలా కొట్టడంలో ఉన్న ఆనందమేమిటి?"

"వాళ్ళో సైకిక్ కేస్. ఆమె మాసోకిస్ట్. అంటే, బాధ అనుభవించడమే అదొక ఆనందం అలాంటివాళ్ళకు. ఇహ రమాకాంత్‌లో కూడా అలాంటివే అంటే, సాడిస్ట్ ఇన్‌స్టింగ్స్ కొంచెం ఉండివుండాలి. అందుకే వాళ్ళిద్దరి మధ్య పీడనిబంధం యేర్పడింది. అదే, వీరాజీని తప్పించెయ్యడానికి ప్రోత్సహించి ఉండాలి."

"ఇంతవరకూ మన థియరీ బాగానే వుంది. వీరాజీని అంతంచేసిన హంతకులు వాళ్ళే అయితే, వాళ్ళని ఎలా పట్టడం? యీ విషయంలో సలహా తీసుకోవడానికే ముఖ్యంగా మీ వద్దకు వచ్చింది."

"మంచి ప్రశ్న వేశారు. హత్య జరిగి సంవత్సరాలయి పోయింది. ఆ ఇల్లంతా అటునుంచి ఇటు తిరగేసి శోధిస్తే, అ సిపంజరం అయినా మనకు దొరక్కపోదు. అయితే, వాళ్ళే, వీరాజీని అంతంచేసేరని ఎలా నిర్ధారించడం, ఎలా నిరూపించి బంధించడం? మీకేమయినా అయిడియాస్ ఉన్నాయా?"

"ఉన్నాయి."

"చెప్పండి."

సీతాపతి తన ఆలోచనలు చెప్పాడు.

"ఓకే! మా డిపార్టుమెంటు సహాయం మీకెప్పుడూ వుంటుంది. ప్లీజ్ గో ఆన్" అన్నాడు సబిన్స్పెక్టరు మోహన్.

"థేంక్యూ."

సీతాపతి మోహన్ దగ్గర సెలవు తీసుకుని వచ్చేసాడు బయటకు.

## 9

ప్రతిభా సిల్కు హౌస్ గుమ్మంముందు ఆగిన స్టుడ్ బేకర్ని, అందులోంచి దర్జాగా, దర్పం ఒలకబోస్తూ దిగిన రత్నమాలనీ చూసిన షాపు యజమాని, మూడవ ప్రపంచ యుద్ధం వచ్చినంత కంగారుపడిపోతూ, వంగి, వంగి నమస్కారాలు చేసేస్తూ "నమస్కారం! రాణీగారూ! ఎన్నాళ్ళకెన్నాళ్ళకు?" అంటూ ఎదురొచ్చాడు ఆమెకు.

ప్రతి సంవత్సరం, తనకూ, తన భవంతిలోని సిబ్బందికీ (మేనేజరు రమాకాంత్ కు మినహా) మొత్తం పదివేల రూపాయలు బట్టలు కావాలి. అన్నిరకాల బట్టలు కావాలి. అన్నిరకాల బట్టలు దొరికే షాపు అదే కావడంవల్ల, పది షాపులు తిరిగి బేరాలు చేసే ఓపిక లేక, తనకు కావాల్సిన బట్టలన్నీ ఆ షాపులోనే కొంటుంది రత్నమాల.

అందుకే, షాపు యజమాని తనంటే, అంత మర్యాద, గౌరవం ఒలకబోస్తున్నాడని ఆమెకు తెలుసు.

అందువల్లనే, అతడి నమస్కారాన్ని పట్టించుకోలేదు రత్నమాల.

"కొత్తరకాల సిల్కు చీరలుంటే చూపించండి" అంటూ తిన్నగా సిల్కు చీరల కౌంటరు వద్దకు పోయి నిలబడింది.

చీరలు చూపించడానికి అక్కడున్న సేల్సుమన్ ముందుకు రాబోతుంటే వాడ్ని ఒక్క గసురుతో అక్క

ద్నుంచి పంపించేసి, షాపు యజమానే స్వయంగా బట్టలు చూపించ నారంభించాడు.

తనకు నచ్చినవి పది చీరలు యెంచి ప్రక్కగా పెట్టి "బిల్లు రాయండి" అని చెప్పి ఆమె ఇంకో కౌంటరువద్దకు వెళ్ళుంటే—

"అమ్మా! మీరేనా రత్నమాలగారు?" అంటూ ఓ పోలీసు కానిస్టేబులు వచ్చి, ఆమెకు కాస్త దూరంలో గౌరవ పురస్సరంగా వంగి నిలుచున్నాడు.

పోలీసుని చూడగానే ఆమె కళ్ళు ఆశ్చర్యంతో విప్పారాయి.

"అవును! యేం?" అడిగిందామె.

జవాబు వింటూనే, కానిస్టేబులు టకీమని సలాంచేసి "మిమ్మల్ని ఒకసారి స్టేషనుకు దయచెయ్యమన్నారు సబిన్స్పెక్టరుగారు" అన్నాడు.

"నేనా?... ఎందుకు?"

"ఏమోనమ్మా! నాకు తెలీదు. అక్కడే మీ మానేజరు రమాకాంత్ గారు కూడా ఉన్నారని చెప్పమన్నారు."

మేనేజరు రమాకాంత్ పోలీసుస్టేషనులో ఉన్నాడా? తను అతడ్ని గ్రామంలో వదిలి వచ్చిందే!...

ఆమె ఆశ్చర్యానికి అంతులేదు.

ఊరిలో ఉండాల్సిన రమాకాంత్ ఇక్కడి కెలా వచ్చాడు. తెలుసుకోవాలన్న కుతూహలం అణుచుకోలేక పోయిందామె.

"మీరు ముందు వెళ్ళండి. కార్లో వస్తాను... ఆ... మీ స్టేషనెక్కడ?" అడిగిందామె.

"టు టౌను పోలీసుస్టేషను... ఈ వీధి చివర మలుపులోనే" చెప్పి వెళ్ళిపోయాడు పోలీసు.

"మళ్ళా వస్తాను. ఇవన్నీ పేక్ చేసి, బిల్లురాసి సిద్ధంచేసి

ఉంచండి" అని కొట్టువాడితో చెప్పి, బయలుదేరింది స్టేషనుకు.

పదినిముషాల్లో కారు టు టౌను పోలీసుస్టేషను చేరు కుంది.

బయట కారాపి, రత్నమాల స్టేషనులో అడుగుపెట్టే సరికి, ఆమె రాకకోసం ఎదురుచూస్తున్న సబిన్స్పెక్టరు మోహన్ "రండి! రండి! రత్నమాలగారూ!" అంటూ ఆమెను లోనికి ఆహ్వానించాడు.

"ఏమిటి? ఎందుకు పిలిపించారు?" అని ఆమె స్టేషనులో అటూ ఇటూ చూసి "మా మానేజరుగారేరీ?" అంటూ అడిగిందామె.

"ఆయనిప్పుడే వస్తారు. దయచేసి కూర్చుని విశ్రాంతి తీసుకుంటూ ఉండండి" అంటూ మోహన్ తనకెదురుగా వున్న కుర్చీ చూపాడు ఆమెకు.

ఉస్సురంటూ ఆమె కుర్చీలో కూలబడింది.

"మీ మానేజరుగారు వచ్చేలోపల మీకు అభ్యంతరం లేకపోతే, కొన్ని విషయాలడగా లనుకుంటున్నాను" అని చెప్పి 'ఏమంటారు?' అన్నట్టుగా, ఆమె కళ్ళల్లోకి చూసాడు సబిన్స్పెక్టరు మోహన్.

"అడగండి. నా చాతనయినంతవరకు జవాబు లిస్తాను" అందామె చిరునవ్వులు చిందిస్తూ.

కాని, ఆమె అంతరంగంలో కల్లోలం మొదలయింది. ఆమె జన్మలో పోలీసుస్టేషను మొహం చూసి ఎరుగదు. అలాంటిది, వాళ్ళు పిలవడం, అక్కడ ఉన్నాడన్న రమాకాంత్ లేకపోవడం, తీరా వచ్చాక, వాళ్ళు ఏవో ప్రశ్నలడగడానికి పూనుకోవడం, అంతా అగమ్య గోచ రంగా వుందామెకు.

"ఈ మధ్య సీతాపతి అనే కుర్రాడు మీ భవంతికి

వచ్చాడు కదూ?" అన్నాడు మోహన్.

"అవును వచ్చాడు. రెండు రాత్రుళ్ళు మా భవంతిలో ఉండి వెళ్ళాడు కూడా" చెప్పిందామె.

"ఎందుకన్నాడో చెప్తారా?"

"ఆయనకు దెయ్యాలంటే యెలాగుంటాయో చూడాలనిపించింది...అయినా యెందుకడుగుతున్నారు ఆయన గురించి?"

"ఏం లేదు. ఆయన్ని దెయ్యాలెత్తుకు పోయాయని వారి తల్లిదండ్రులు ఫిర్యాదు చేసారు."

"అదేమిటి? ఆయన మర్నాడు ఉదయం క్షేమంగానే మావద్ద నుంచి శెలవు తీసుకొన్నాడే!..."

"ఏమో. ఆయన తల్లిదండ్రులు కంప్లెయింట్ ఇచ్చారు. ఇంతకు ముందుకూడా, ఇలాగే ఎవర్నో దెయ్యాలు యెత్తుకు పోయాయట కదూ?"

"అవుననుకోండి. నా భర్త వీరాజీగార్నే యెత్తుకు పోయాయి. కాని, ఇందులో యేదో మోసం ఉంది...ఆ కుర్రాడ్ని దెయ్యాలు మాత్రం యెత్తు పోలేదని గట్టిగా చెప్పగలను" ఆమె కళ్ళల్లో ఆవేశం నాట్యం చేసింది.

"ఆవేశ పడకండి. అదృశ్యమైన సీతాపతి మాకో రిపోర్టు అందచేసాడు."

"ఏమిటది?" అడిగిందామె కంగారుగా, మధ్యలోనే కల్పించుకుంటూ.

"మీ భవంతిలో దెయ్యాలు లేవనీ, అదంతా స్పీకర్ల ద్వారా భవంతి అంతా మీరు ప్రసారం చేస్తున్న టేప్స్ అనీ, అదంతా మీకూ మీ మానేజరు రమాకాంత్ కు మధ్య ఉన్న అక్రమ సంబంధాన్ని కప్పి పుచ్చుకోవడానికి వేస్తున్న నాటకమనీ ఉంది ఆ స్టేట్ మెంట్ లో" చెప్పాడు మోహన్.

"వాటీజ్ దిస్ ఇన్స్పెక్టర్. దిసీస్ నథింగ్ బట్ నాన్సెన్స్" అరిచింది రత్నమాల.

అరగంట క్రితం ఉన్న ఆమె శాంత వదనం మంత్రించినట్టుగా మారిపోయిందిప్పుడు.

"వెల్! చూడండి రత్నమాలగారూ! మరీ అంత తీవ్రంగా వాదించెయ్యకండి. మా దగ్గర యెలాంటి సాక్ష్యాధారాలు లేకుండా మిమ్మల్ని పిలిచామని భావించకండి."

మోహన్ అలా అనగానే, ఆమెలో ఆవేశం కొంత తగ్గుముఖం పట్టింది.

"ఏమిటా ఆధారాలు? చెప్పండి" అందామె పాలిపోయిన మొహంతో, పొడారిన గొంతుకతో.

"ఒకటి. మీరు రమాకాంత్ గారూ ఏకాంతంగా సెక్స్ ఆర్గీ చేస్తున్నపుడు తీసిన ఫోటో కాపీ మాకు అందించాడు సీతాపతి."

దాంతో ఆమె నోరు పడిపోయినట్టుగా ఉండిపోయింది.

"దీనికి మీ సమాధానం యేమిటి?" మోహన్ అడిగాడు ఓ క్షణం పోయాక.

"ఏముంది...మీరు చెప్పింది ఒప్పుకుంటున్నాను" అందామె, కళ్ళు నేలవైపు దించేసి పూర్తిగా.

"అంటే మీ భవంతిలో దెయ్యాలు లేవు. అదంతా నాటకం అని ఒప్పుకుంటున్నారు కదూ?"

ఆమె వెంటనే జవాబియ్యలేదు. నేలవైపు చూస్తూ ఉండిపోయింది బొమ్మలా.

"చెప్పండి. దెయ్యాలు లేవని మీరు ఒప్పుకున్నట్టేనా?" రెట్టించి అడిగాడు మోహన్.

ఇహ, జవాబివ్వక తప్పదనుకుంది కాబోలు. "అవును" అంది, ఎలాగో శక్తి తెచ్చుకుని.

"అంటే, వీరాజీగార్ని దెయ్యాలెత్తుకు పోలేదు. ఇంకెవరో మాయం చేసారు...అయితే యెవరు?"

"ఏమో. నాకేం తెలుసు?" అందామె కంగారుగా టకీమని.

"స్కూలు కుర్రాడిలా 'నాకేం తెలుసు?' అని అనేసి పట్టుబడి పోయారు. ఎవరెత్తుకు పోయారో తెలీదు గాని, ఎత్తుకుపోయారన్న విషయం ఒప్పుకుంటున్నారన్న మాట."

"మేమూ అదే అనుకున్నాం. అన్ని చోట్ల వెదికించాం" అని రత్నమాల ఇంకేమేమో చెప్పబోతుంటే, మధ్యలో కలగ జేసుకొని "కానీ, పోలీసు రిపోర్టు మాత్రం చెయ్య లేదు" అన్నాడు మోహన్.

దొరికిపోనట్టుగా మొహం పెట్టి "అవును!" అందామె.

"ఏం? ఎందుచేత?...ఇంట్లో చిన్న బంగారపు వస్తువు పోతే పోలీసు కంప్లయింట్ ఇస్తారు గదా, మనిషే మొటు మాయమైతే ఎందుకివ్వలేదు కంప్లయింటు?"

ఆమెవద్ద జవాబు లేదు.

ఆమె మవునం వహించింది.

ఇదే ప్రశ్న మొదట్లో వేసుంటే, వీరాజీగార్ని దెయ్యా లెత్తుకు పోయాయని మామూలుగా జవాబిచ్చి వుండేది ఆమె. అయితే, అయిదు నిముషాల క్రితమే దెయ్యాల సంగతంతా ఓ నాటకం అని ఒప్పుకుంది.

"అవును! మీరు జవాబియ్యలేరు. కారణమేమంటే, వీరాజీగారు ఎలా మాయమయ్యిందీ మీకు తెలుసు. పైగా దెయ్యాల నాటకం వల్ల అతన్ని దెయ్యాలెత్తుకు పోయా యని నమ్ముతున్నారు జనం. ఇహ, పోలీసు కంప్లయింట్ ఇస్తే అది ఎటుపోయి ఎటు వస్తుందో. అందుకే ఊరు కున్నారు, అవునా?"

ఆమె పెదవి కదపలేదు. వింటూ ఉండిపోయింది.

"చూడండి రత్నమాలగారూ!...మీరు ఇప్పటికైనా జరిగిందేమిటో చెప్పేసి తప్పు ఒప్పుకోవడం మంచిది. శిక్ష తగ్గే అవకాశం ఉంది. మీరిచ్చే స్టేట్‌మెంటు కోసం ఎదురు చూస్తున్నాను" అని ఆమె ముహంలోకి చూస్తూ ఉండిపోయాడు మోహన్.

రత్నమాల తీక్షణంగా ఆలోచిస్తూ ఉండిపోయింది అయిదు నిముషాలు.

'ఇన్నాళ్లూ అతిభద్రంగా కాపాడుకొస్తున్న రహస్యం చెప్పక తప్పదు. కాని చెప్పడం ఇష్టంలేదు' అన్న ఆలోచనల ఇరుకునబడి ఆమె ఏ నిర్ణయమూ తీసుకోలేక నలిగిపోతోంది అని అర్థం చేసుకొన్నాడు మోహన్.

"రత్నమాలగారూ! ఇంకా తటపటాయిస్తున్నారు దేనికి? మీ మేనేజరుగార్ని బెదిరించేసరికి అంతా చెప్పే సారు. వారిచ్చిన స్టేట్‌మెంట్ ఇదిగో. ఇచ్చి వూరికెళ్ళి పోయారు యేనాడో" అంటూ డ్రాయరు సొరుగులోంచి చిన్న కాయితాల కట్ట బయటకు లాగి, టేబిలుమీద పడే సాడు మోహన్.

తీసి చూద్దామని ఆమె చెయ్యి చాచబోతుంటే, "నో! నో! చూడకండి. నా మాట నమ్మండి...మీ ఇద్దరి స్టేట్‌మెంట్ల లోని విషయాలు మేము టేలీ చెయ్యాలి... అంచేత మీరు చదవ కూడదు" అని ఆ కాయితాలకట్టను టేబిలుమీంచి తీసి, తిరిగి టేబిలు సొరుగులో పడేసు కున్నాడు మోహన్.

ఆమె ముహం డీలా పడిపోయింది. ఒక్కసారిగా ఆమె వయస్సు పదేళ్ళు పెరిగినట్టుగా కనిపించింది.

"స్టేట్‌మెంట్ ఇస్తాను. రాసుకోండి ఇన్‌స్పెక్టర్" అంటూ ఆమె చెప్ప నుద్యుక్తురాలయింది.

ఇన్‌స్పెక్టర్ మోహన్, కాయితాలు కలం తీసి రాయడం మొదలుపెట్టాడు.

"ఆంధ్రప్రదేశంలోని ఓ మారుమూల గ్రామం నుంచి, మద్రాసు పారిపోయాను, వాణిశ్రీ అంతటి మహా నటినై పోదామని. కాని, నా అందం చూసి మెచ్చుకుని, నలిపి పారేద్దామని ఉరకలు వేసేవాడేగాని ప్రతివాడూ, తెగించి నన్ను హీరోయిన్‌గా చేసుకొన్నవాడు యెవడూ లేడు. కాని, చిన్న చిన్న వేషాలు మాత్రం రావడం ఆరంభించాయి. అదే మహాభాగ్యం అనుకుని, మహా నటులందరూ మొదట చిన్న వేషాలు వేసిన వాళ్ళేనని సర్ది చెప్పుకుని, కొన్నాళ్ళు చిన్న వేషాలతో తృప్తిచెందాను. రెండేళ్లు తిరిగాయి. కాని, నే నాశించిన అదృష్టం ఎదురురాలేదు. ఎన్నాళ్ళు చిన్న వేషాల బ్రతుకు? ఏంచెయ్యాలి ఇకముందు? అని నాలో నేను మథనపడుతున్న సమయంలోనే నేను వీరాజీగారి గురించి విన్నాను. వారు మద్రాసు వచ్చినప్పుడు ఓసారి దర్శించుకున్నాను.

వారు నన్ను పెళ్ళిచేసుకో నక్కరలేదు. ఉంచుకుంటే చాలు, అదే పదివేలు. ఎక్‌స్ట్రా నటి బ్రతుకకన్నా ఎన్నో రెట్లు నయం అని అనుకున్నాను" ఆగింది రత్నమాల.

అటూ ఇటూ చూసి "మంచినీళ్లు ఇవ్వండి దయచేసి. గొంతుక ఆరిపోయింది" అంది గొంతుక పట్టుకుని.

జవాన్నొకడ్ని పిలిచి, గ్లాసుతో నీళ్లు తెప్పించి ఆమెకు ఇవ్వగానే త్రాగి, మళ్ళా చెప్పసాగింది.

"వీరాజీగారు నన్ను ఉంపుడుకత్తెగా గాకుండా భార్యగానే అంగీకరించడానికి నిశ్చయించుకున్నారని తెలియగానే, నా జాతకం తిరిగిపోయిందని భావించాను. అయితే ఆ భావన యెన్నో రోజులు నిలవలేదు. కొద్ది రోజుల్లోనే నాకు అర్థమయిందేమంటే, ఆయన నాకు

మిగల్చకుండా తన మగతనాన్నంతా ఏనాడో కర్చు చేసేసారు. ఇద్దరు భార్యలు నిస్సంతుగా చనిపోయినా, సంతానంమీద ఆశకొద్దీ నన్ను చేసుకొన్నవారి ఉద్దేశం నెరవేర్చలేకపోయాను. ఆయనతోపాటుగ నేనూ యెంతో కుమిలిపోయాను. రోజులు నడుస్తున్నాయి. పురుష సంపర్కంలోని ఆనందం యెరిగిన దాన్నేమో, పగళ్లు యెలాగో గడిచినా, రాత్రుళ్ళు దుర్భరంగా గడవసాగాయి. నా పరిస్థితి గ్రహించిన మానేజరు రమాకాంత్ అప్పుడే నన్ను లోబరచుకున్నాడు, తన విపరీతమైన లైంగిక పద్ధతులతో. అయితే, మా అక్రమ సంబంధం వీరాజీ-గారికి తెలియడం నాకేమాత్రం ఇష్టంలేదు.

అందుకే, రమాకాంత్‌ను మెద్రాసు పంపి, అతడి బంధువు సహాయంతో దెయ్యాల శబ్దాల టేప్స తయారు చేయించి తెప్పించాను.

అయితే, మా రహస్యం దాగలేదు ఎన్నాళ్లో. ఓ రోజున, నేనూ రమాకాంత్ మా గదిలో మంచి రసపట్టులో ఉండగా, వీరాజీగారు వచ్చేసారు లోనికి.

ఎప్పటిమాదిరిగా, వారిగదికి బయటనుంచి గడియ పెట్టడం మర్చిపోయామని, ఆయన్ని మా దగ్గరగా చూసాకగాని మాకు తెలీలేదు.

"వంచకీ! రత్నమాలా!" అంటూ పిచ్చిగా కేక పెట్టారు ఆయన. నేనూ, రమాకాంత్ విడిపోయి, మూలనున్న బట్టలు ఒంటికి చుట్టుకున్నాం. తలవంచుకుని, నేరస్తుల్లా నిలుచున్నాం. మేమేం మాట్లాడలేదు.

మా మౌనం వార్ని ఇంకా రెచ్చగొట్టింది. వారు ఆవేశంతో ఊగిపోతూ "నా వంశం పరువు ప్రతిష్ఠలు మంటగలుపుతావటే రాక్షసీ!" అంటూ నా జుట్టు పట్టుకుని యీడ్చారు బరబరా.

తప్పు చేసిందాన్ని శిక్ష అనుభవించాల్సిందే అని ఆయన యేంచేస్తున్నా ఊరుకొన్నాను. రమాకాంత్ కూడా నిస్సహాయంగా నిలుచున్నాడు నన్ను ఏంచేస్తున్నా.

ఆయన నన్ను తిట్టారు. కొట్టారు. కసితో కాళ్ళతో తన్నారు. సహిస్తూ ఊరుకున్నాను.

పావుగంట పోయాక యేంజరిగిందో యేమో గుండె పట్టుకుని నేలమీద పడిపోయారు.

గాభరాపడుతూ ఆయన్ని సమీపించి, ఆయనకు ఉపచారం చెయ్యడానికి పూనుకుంటే, కోపంతో నన్ను తోసేసారు దూరంగా.

డాక్టరుని తీసుకురావాలని రమాకాంత్ ఆయత్తమవుతుంటే, భయంకరంగా కేకపెట్టి వీరాజీగారు ప్రాణాలు వదిలారు. వీరాజీ మృతదేహం చూసి మేము నిర్విణ్ణులయ్యాం. అలా జరుగుతుందని కలలోగూడ అనుకోలేదు.

ఆయనకు గుండెజబ్బు ఉందనీ, అప్పటికి రెండుసార్లు పోటువచ్చి ఎలాగో బ్రతికారనీ, మాకు గూడా తెలియకుండా జాగ్రత్తపడ్డారనీ, ఆ తరువాతగానీ మాకు తెలియలేదు."

రత్నమాల క్షణం ఆగింది. గుక్కెడు మంచినీళ్ళు త్రాగాక, చెప్పడం ఆరంభించింది. మోహన్ తలవంచుకుని రాసుకోసాగాడు, ఒక్కమాట తప్పిపోకుండా.

"జరిగిందేదో జరిగిపోయింది. పోయి పనివాళ్ళను పిలిచి జరపవలసిందేదో చూడండి" అని రమాకాంత్‌కు చెప్పాను. ఆయన కదల్లేదు. ఓ క్షణంచూసి, ఆయన కదిలేటట్టు లేరని గ్రహించి "కదలరేం?" అని రెట్టించి అడిగాను.

"మనల్ని యీ విధంగా ఒకే గదిలో ఉండగా, మన ఎదురుగా యీ శవం ఉండగా, ఎవరైనా చూస్తే యేం అనుకుంటారో గ్రహించారా?" అన్నాడు రమాకాంత్.

అప్పటికిగాని, మేం ఇరుక్కున్న పరిస్థితి అర్థంకా లేదు నాకు.

దెయ్యాల నాటకం ఆడుతూ మేం ఇద్దరం రహస్యంగా కలుసుకుంటున్నాం. ఆ విషయం వెల్లడి కావడమే గాకుండా, మా ఆనందానికి వీరాజీ అడ్డుచెప్పగానే అతన్ని అంతచేసేసాం అనుకుంటారు జనం. గుండెపోటు వచ్చి మరణించాడని ఎవరూ అనుకోరు.

నాకేమీ పాలుపోవడంలేదు. "యేం చేద్దాం అయితే?" అన్నాను రమాకాంత్‌తో.

"దెయ్యాల నాటకం ఆడుతున్నాం యెలాగూ. శవాన్ని యెక్కడో దాచి వుంచేస్తే, దెయ్యాలే అతన్ని యెత్తుకుపోయాయనుకుంటారు జనం" సలహా యిచ్చాడు రమాకాంత్.

అతని ఆలోచన సవ్యంగానే ఉందనిపించింది నాకు: వీరాజీ తండ్రిగారి పటం వెనకాల ఓ పెద్ద రహస్యపు ఇనప అరవుంది. అది గుర్తొచ్చింది నాకు. వీరాజీగారి శవాన్ని మోసుకెళ్ళి అందులో పడేసాం. కొన్నాళ్ళు పోయాక, వారి తండ్రిగారి ఫోటో తీయించి, వీరాజీగారి చిత్రపటం బిగించాం.

ఆ తరువాత ఆ శవం యేమైందో చూడ్డానికి గూడా మాకు ధైర్యం చాలలేదు. ఆ గది ఉపయోగించడమే మానేసాం. బహుశా, ఇప్పుడు అక్కడ కాస్తంత మట్టి, వీరాజీగారి అస్థిపంజరం వుండి వుండాలి" అంటూ ముగించింది రత్నమాల.

"అంటే, హత్య జరగలేదన్నమాట. విచిత్రమైన పరిస్థితుల్లో వీరాజీగారు మరణిస్తే, ఆ విషయం బయటపడితే మీ రహస్యం బయటపడుతుందని, వీరాజీగారి శవాన్ని

దాచేసారు" అడిగాడు మోహన్ ఆశ్చర్యంగా.

"అవునండి. జరిగిందంతా చెప్పాను, జరిగిన క్రమంలో. మీ నిర్ణయం చెబితే వెళ్ళిపోతాను" అందామె.

ఇప్పుడామె ముహంలో రిలీఫ్ కనిపిస్తోంది. తలమీంచి పెద్ద భారం వదిలించుకున్నట్టుగా, హాయిగా ఫీలవుతున్నట్టు కనిపిస్తోంది.

"మరి, రమ్యాకాంత్ గారు తామే వీరాజీగార్ని చంపినట్టు స్టేట్మెంట్ ఇచ్చారేః?"

ఒక్క క్షణం ఆమె ముహం ముడుచుకుపోయింది. కాని, వెంటనే తెప్పరిల్లి "మేం యిద్దరం రహస్యంగా కలిసివుండడం చూసిగదా, వీరాజీగారు మరణించింది. అందుకే ఆయన అలా అని వుంటారు. అసలు యథార్థమేదో మీకు చెప్పాను, రవంత వదిలేయకుండా" అంది రత్నమాల.

"అలాగా!...మా నిర్ణయం కొద్ది రోజుల్లో మీకు తెలియజేస్తాం. మీరు వెళ్ళండి!...మీ నుంచి అసలు సంగతి వెళ్ళగక్కించడంకోసమే సీతాపతి మాయమయాడని బొంకాం. సీతాపతి భద్రంగానే వున్నాడు. మీరింక నిశ్చింతంగా వెళ్ళండి" అన్నాడు సబిన్స్పెక్టరు మోహన్, నవ్వుతూ లేచి నమస్కారం చేస్తూ.

"థేంక్స్" అంటూ లేచింది రత్నమాల బయలుదేరడానికి.

# 10

స్టేషనునుంచి తిరిగొచ్చి, బట్టలు కొనడం పూర్తిచేసి, కార్లో తిరిగి గ్రామానికి బయలుదేరింది రత్నమాల.

ఆ రోజు జరిగిన సంఘటన తలచుకొంటున్న కొద్దీ ఆమెకు నవ్వు రాసాగింది ఉప్పెనగా.

కాసేపటివరకూ ఎలాగో వస్తున్న నవ్వుని పట్టడ గలి

గింది. ఆ తరువాత నవ్వాపుకోవడం ఆమె తరం కాలేదు. ఎవరైనా చూస్తే, ఆమెను పిచ్చిదనుకుంటారన్న సందేహం కూడా లేకుండా, ఆమె పగలబడి నవ్వసాగింది.

తను అతి తెలివిగా సబిన్స్పెక్టరు మోహన్ని బోల్తా కొట్టించింది. పోలీసు డిపార్టుమెంటు వేసిన పథకానికి తను చిక్కిపోయానే అని అనుకొంది. కాని, అతి నేర్పుగా, వాళ్ళ వుచ్చుల్నించి తప్పించుకుంది.

సీతాపతిని రెయ్యా లెత్తుకు పోయాయనీ, రమా కాంత్ తను చేసిన నేరం ఒప్పుకుంటూ స్టేట్మెంట్ ఇచ్చాడనీ సబిన్స్పెక్టరు మోహన్ చెప్పి చెప్పగానే అదంతా, తననుంచి వాళ్లు అసలు రహస్యం రాబట్టడానికి చేస్తున్న బుకాయింపని సులువుగా గ్రహించేసింది.

వీరాజీ హత్య చేయబడి యేళ్ళు గడిచిపోయాయి. ఆ హత్యగురించి సాక్ష్యాధారాలు యేమీ మిగిలిలేవు. అందు చేతనే, సీతాపతి సబిన్స్పెక్టరు మోహన్ కూడబలు క్కుని, రమాకాంత్ చేసిన నేరం ఒప్పుకున్నాడనీ, అలా స్టేట్మెంటు ఇచ్చాడని నాటకమాడారు. గుండె జార్చు కుని తను యేమాత్రం తొందరపడినా అసలు రహస్యం చెప్పేసి ఉండేది.

అబద్ధాలాడ్డం నిజంగా ఒక కళ. అయితే ఆడవాళ్ళకు మాత్రం అది వెన్నతో వచ్చిన విద్య.

అబద్ధం చెప్పడం ఎవరైనా చెయ్యగలరు. కాని, చెప్పి, నమ్మించడంలోనే ఉంది నేర్పంతా.

ముందు నమ్మించాల్సిన వ్యక్తికి యేమాత్రం తెలుసునో కరెక్టుగా అంచనా వెయ్యాలి. ఆ తరువాత చెయ్యాల్సింది బహు తేలిక.

నిజాల్ని అక్కడక్కడ కాస్త మార్చి, మధ్య మధ్య సమయం చూసుకుని అబద్ధాల్ని జొరబెడితే, పాలల్లో

నీరులాగ చెల్లిపోతుంది.

తను అంతే చేసింది, వీరాజీ హత్య విషయంలో. గుండు ముక్కలాగుండే వీరాజీకి గుండెజబ్బు సృష్టించింది. తనూ, రమాకాంత్ కలిసిఉండగా వీరాజీ చూడ్డం నిజమేగాని, అతడు ఒక త్తిపుచ్చుకుని తమమీద కోపంతో విరుచుకు పడ్డం, ఆ తరువాత లాఘవంగా అతని చేతిలో కత్తి లాక్కుని రమాకాంత్ పొడిచి పారెయ్యడం మొదలైన విషయాలు సందర్భోచితంగా వదిలి పారేసింది.

అసలు దెయ్యాల నాటకం, వీరాజీని అంతంచేసి, ఆ సి స్వంతం చేసుకుని, తను తన ప్రియుడు రమాకాంత్ శాశ్వత సుఖాలు పొందాలన్న పరమావధితోనే మొద లైంది. దాన్ని, తమ అక్రమ సంబంధాన్ని కప్పిపుచ్చుకోవ డానికే, ఆరంభించామని మార్చి చెప్పింది.

సినిమాల్లో రికార్డింగ్ శాఖలో పనిచేస్తే, రమాకాంత్ పింతల్లి కొడుకు ఉమాకాంత్ దెయ్యాల టేప్స్ తయారు చేసి ఇవ్వడంలో సహకరించాడు. ఆ విషయం - నిజమే చెప్పింది.

పోలీసు డిపార్టుమెంటుని ఎంత నేర్పుగా తను బుకా యించి బుట్టలో వేసుకొన్నదీ తలచుకుంటున్న కొద్దీ, తెరలు తెరలుగా వస్తోంది రత్నమాలకు నవ్వు.

అలా ఉప్పెనలా వస్తున్న నవ్వును బలవంతంగా ఆపు కోవడానికి ప్రయత్నించడంలో స్టీరింగ్ వీల్ కంట్రోలు తప్పింది. కారు సరాసరిగా వెళ్ళి రోడ్డు ప్రక్కనున్న బావిబొందలో పడిపోయింది.

అంతే! రత్నమాల నవ్వుతోపాటు ఆమెలో చలనం కూడా ఆగిపోయింది.

—:ఐ పో యి ం ది:—




## తొమ్మిదవ భాగము

"డియర్ హరీ! నిన్ను చూశాను. నీ దగ్గర ఆనందం పొందాను. నువ్వు ఇండియన్ కదా. నిన్ను చూస్తుంటే ఇండియాగా చూసినట్లుంది. ఇండియాలో తిరిగి ఆనందం పొందినట్లుంది" అంది స్టెల్లా నన్నే చూస్తూ.

"స్టెల్లా! ఐ లవ్ యూ!" అన్నాను ప్రేమగా చేయి నొక్కుతూ.

"మీ టూ! ప్రాణాలతో బైటపడి క్షేమంగా దేశం చేరుకోగలిగితే వెంటనే అక్కడే పెళ్ళి చేసుకుందాం!"

అంది నా భుజంపైన చెయ్యివేసి, పైకి వంగి, నా పెదాలపైన గట్టిగా ముద్దుపెడుతూ.

ఆమె రొమ్ములు నా గుండెకు ఘట్టిగా తగిలాయి. ఆ స్పర్శకు నాలో క్రొత్త ధైర్యం, ఆత్మస్థైర్యం పుట్టుకొచ్చాయి. ఆవేశంతో స్టెల్లాను నా హృదయానికి గట్టిగా హత్తుకున్నాను.

డెల్లా కళ్ళు ఆనందంతో మెరిశాయి. మా ఇరువురి మధ్య మౌనం ఐదునిముషాలు రాజ్యం చేసింది.

"నేను రెస్టు తీసుకుంటాను. నువ్వు కాస్త చూస్తుండు. ఈ మారు తలుపులు తడితే కాల్చి పారెయ్యి. ఎవడో ఒకడు ఛస్తాడు" అంది డెల్లా మౌనాన్ని పారద్రోలుతూ.

సరేనన్నాను తుపాకి సరిచేసుకుంటూ.

డెల్లా దిండు సర్దుకుని పడుకుంది మంచంపైన.

నేను మంచం దిగి తలుపుదగ్గరకు నడిచాను. అంతకు ముందు బరిసె గుచ్చి తీసినందువల్ల ఏర్పడ్డ రంధ్రంలో కన్నుంచి వెలుపలేం జరుగుతుందో చూడసాగాను.

నాలుగైదు తెల్లని పాలిథిన్ బస్తాలు అక్కడ వేసి వున్నాయి. వాటి నానుకొని నన్నూ డెల్లానూ అంతకు ముందు బంధించిన నాయకుడు నిలబడున్నాడు. అతని చేతిలో విస్కీ సీసా వుంది. తడవకు సగం మించి మింగుతున్నాడు.

సూట్లతో వున్న ఇద్దరు వ్యక్తులచేతుల్లో కూడా గ్లాసులున్నాయి. ఒకతను గ్లాసుక్రింద పెట్టి రెండో కాబిన్ లోకి వెళ్లాడు. అందులోంచి విస్కీ బాటిల్స్ కేస్ ఒకటి తెచ్చి నాయకుడి ముందు పెట్టాడు. అతని వెంట వున్న ఇద్దరు అనుచరులు దాన్ని నెత్తికెత్తుకొన్నారు.

ఆ నాయకుడేదో అర్ధంగాని భాషలో వాళ్ళతో ఏదో చెప్పాడు. అదే భాషలో వాళ్ళుకూడా ఏదో చెప్పారు. అందరూ నవ్వుకొన్నారు. ఆ తర్వాత నాయకుడే వంగి సలాంచేశాడు. అక్కడ్నుంచి నిష్క్రమించాడు. అతను వెళ్ళినవైపే చూస్తూ నిల్చున్నారు, ఇద్దరు సూట్స్‌లో వున్న వ్యక్తులు.

"ఈమారు చాలా ఎక్కువ సరుకు తెచ్చారు వీళ్ళు.

అమ్మితే మనకు ఏంలేదన్నా లక్ష డాలర్లు దొరుకుతాయి"
అన్నాడొకడు.

"అవును. స్మగ్లింగ్ గాంగ్స్ వాళ్ళకు అమ్మామంటే
రెండు లక్షల డాలర్ల ఖరీదుచేసే బంగారం దొరుకుతుంది"
రెండో అతను చెప్పాడు సిగరెట్ వెలిగించుకుంటూ.

"ఈ దీవినిండా గంజాయి మొక్కలు విపరీతంగా
వున్నాయి. మనం ఇచ్చే విస్కీ బాటిల్స్ ఖరీదుకు, వాళ్లు
తెచ్చి ఇచ్చే సరుకు విలువకు పోల్చుకుంటే మనం వాళ్ళను
ఎంతగా దోచుకుంటున్నదీ అర్థమవుతుంది!" అన్నాడు
మొదటి వ్యక్తి.

"అదిసరే! ఆ కాబిన్‌లో వున్న వాళ్ళను ఏంచేద్దాం?"
అడగాడు అతను సిగరెట్ వెలిగించుకోవడం పూర్తిచేసి,
అగ్గిపుల్ల ఆర్పి సముద్రంలోకి విసురుతూ.

"చంపేద్దాం! మనం వంతుల ప్రకారం కాపలా
కాద్దాం! వాళ్ళు తలుపు తెరవడం గమనించగానే
కాలుద్దాం!" అన్నాడు.

బోటు నడుస్తూనేవుంది. ఎక్కువ స్పీడుగా పోవడం
లేదు. మెల్లగా పోతూంది. సన్నగా వాన తుంపరలు
పడసాగాయి.

వెలుపల వాళ్ళేం చేస్తున్నారో చూద్దామని మళ్ళీ
ప్రయత్నించాను. కానీ వాళ్ళ జాడలేదు. నాకు కేబిన్‌లో
తలుపు మూసుకుని ఖైదీగా కూర్చోడం కష్టంగావుంది.
అయినా చేసేదేమీ లేక చూస్తూ కూర్చున్నాను.

డెల్లా పరుపుపైన హాయిగా పడుకుంది. లోపల రూం
చీకటిగా వుంది. గాలికూడా సరిగాలేదు లోపల. కిటికీ
తలుపులు తీస్తే కాస్త గాలి వస్తుంది. కానీ అవి తీసిపెట్టు
కోనడం ప్రమాదం.

వాన జోరు హెచ్చినట్లు సముద్రం పైనుండి వస్తున్న

శబ్దం ద్వారా అర్థం చేసుకున్నాను.

బోటు ఆగిపోయింది. ముందుకు కదలడం లేదు. గాలి కూడా ప్రారంభమయింది. అటూ ఇటూ విసురుగా ఊగ సాగింది బోటు.

డెల్లా మౌనంగా కూర్చుంది.

దభీమని బోటు పైన ఏదో పడింది. ఒక్క వుదుటున క్రిందకు నీళ్ళలోకి దిగబడిపోతున్నట్లయింది మాకు. కిటికీ తలుపులు ఊడిపోయాయి. పైప్ లోంచి వచ్చినట్లుగా వచ్చాయి నీళ్ళు.

డెల్లా బిక్కచచ్చి, నా దగ్గరగా వచ్చి నిలబడింది. నేను ఆమె చెయ్యి పట్టుకుని భయపడవద్దన్నట్లు కళ్ళతోనే ధైర్యం చెప్పాను.

"ఏమవుతూంది?" అడిగింది.

"తుఫాను రేగినట్లుంది. నీళ్ళు పైకిలేచి పెద్ద పెద్ద అలల్లా బోటును చుట్టుముట్టి కొట్టుకొంటూ వుండాలి" అన్నాను.

నా మాటలు ముగియకుండానే బోటు తల్ల క్రిందు లయింది. ఇద్దరం పడిపోయాం. మళ్ళీ మామూలు స్థితికి వచ్చింది. సర్దుకుని కూర్చున్నాం. అలా గిరగిర తిరుగుతూనే వుంది రంగుల రాట్నంలా.

మా ఇద్దరి తలలూ, కాళ్ళు, మంచానికి, కుర్చీలకు కాబిన్ గోడలకు కొట్టుకొన్నాయి. అక్కడక్కడా గాయాలయినాయి. రక్తం కూడా కారసాగింది. అయితే మత్తుగా విస్కీ త్రాగి వున్నాను కాబట్టి తెలీలేదు.

బోటులోని మిగిలిన ఇద్దరు ఆగంతకులు ఏమయినారో నాకు తెలీలేదు. వెళ్ళి చూద్దామనిపించింది. కానీ డెల్లాను వదలి వెళ్ళడం ఇష్టంలేక అక్కడే కూర్చున్నాను.

వాన జోరు తగ్గినట్లు లేదు.

గాలి జోరు హెచ్చుతున్నట్టుగా వుంది.

చేయగలిగిం దేమీ లేదు కాబట్టి భగవంతుణ్ణి ప్రార్థిస్తూ మౌనంగా చూస్తూ కూర్చున్నాను. కాబిన్‌లో మోకాలు లోతున నీళ్ళు నిలబడి వున్నాయి. డెల్లా, నేనూ ఇద్దరం మంచంపైనే కూర్చున్నాం.

అలా మూడు గంటలుపైనే గడచిపోయాయి. తుఫాను తగ్గనేలేదు. పోనుపోనూ తీవ్రత ఎక్కువవుతున్నట్లుగా తోచింది నాకు. గాలికూడా ఎక్కువ వేగాన్ని పుంజుకుంది.

తెల్లవారేందుకెంతో వ్యవధి వుండదని తోచింది నాకు. భయంకరంగా సముద్రంపైనుండి వస్తున్న శబ్దాలను వింటూ కూర్చుని, నాకు నేనే ధైర్యం చెప్పుకుంటున్నాను తప్ప, ప్రమాదాన్ని మాత్రం ప్రతిక్షణం ఊహిస్తూనే వున్నాను.

మా బోటు వెనక్కు కదలింది. బహుశా గాలి నెడుతూ వుండాలనిపించింది.

ఆ కదలికలో వేగం హెచ్చి స్పీడుగా పోసాగింది. అదీ పిచ్చి వేగంతో పోతూన్నట్లు గమనించాను. తుఫాను తీవ్రతరమైన దనడానికి అదే గుర్తు. నాలుగైదుసార్లు ఢీంకీలు కొట్టి మళ్ళీ శాంతించి నిలబడింది.

మాతోపాటు బోటులోవున్న మిగిలిన ఇద్దరూ ఏ మయ్యారో నాకర్థం కాలేదు. బహుశా వాళ్ళ కాబిన్‌లోంచి వెలుపలకొచ్చి మా సంగతి చూచేంత ధైర్యం, అవకాశం వాళ్ళకు వుండివుండదనుకున్నాను.

చెవులు చిల్లులుపడేట్లు ఢామ్మని శబ్దమైంది.

డెల్లా నన్ను గట్టిగా పట్టుకుంది. ఏంజరిగిందీ అర్థం కాలేదు. కానీ మరుక్షణంలో నేను నీళ్ళలో వున్నానని గ్రహించాను. కాలిక్రింద బూటు తాలూకు భాగం తగల లేదు. నేల అంతకన్నా లేదు. అంటే సముద్రంలో పడి

పోయాయని ఊహించాను.

డెల్లాను ఒక చేత్తో పట్టుకునే ఈదుతూ మునిగి పోకుండా వుండేందుకు ప్రయత్నం చెయ్యసాగాను. కళ్ళు తెరచిచూశాను. చీకటిగావుంది. చుట్టూ నీళ్ళు.

కుడివేపు అలలు చిన్నచిన్నవి కనుపించాయి. వాటిని బట్టి నేను ఏదో తీరానికి దగ్గరగా వున్నానని గ్రహించాను.

మెల్లగా డెల్లాను వెంటవేసుకుని అటు వేపు ప్రయాణం మొదలెట్టాను. బోటు తాలూకూ చెక్కలు రెండు మూడు నాకు ఎదురొచ్చాయి. వాటిని చూచి మా బోటు ముక్కలు ముక్కలయి వుండాలనుకొన్నాను.

గంటసేపు తంటాలు పడ్డాను. నీళ్ళ లోతు తగ్గి పోయింది.

డెల్లాను నడిపించుకుంటూ వచ్చి సముద్రపు టొడ్డున వచ్చి పడ్డాను. అక్కడ్నుంచి ముందుకు కదలేందుకు కాళ్ళల్లో సత్తువలేదు నాకు. బోరగింతలా పడుకున్నాను. డెల్లాకూడా నా ప్రక్కే పడుకుంది.

అలా ఎంతోసేపు పడివుండి పోయాం చనిపోయిన శవాల్లా.

చీకటిని తరుముతూ వెలుగురావటం గమనించాను. ఆ తర్వాత అరగంటకు సూర్యకిరణాలు నాపైన పడ్డాయి. లేచి కూర్చున్నాను. డెల్లానుకూడా లేపాను.

"ఈమారు తప్పుకొంటామన్న నమ్మకం నాకు లేనే లేదు!" అంది డెల్లా తల్లోకి దూరిన ఇసుకను విదిలించుకుంటూ.

"నాకూ అంతే! కానీ భగవంతుడి దయవల్ల బ్రతికి బయట పడతామన్న నమ్మకం మాత్రం కొద్దిగా వుంది" అన్నాను.

"ఇదేదో క్రొత్త ప్రదేశంలా వుందికదూ?" అడిగింది డెల్లా.

నేను కనుచూపుమేర దూరం సర్వేచేసి చూసి అవునన్నట్లు తలూపాను.

"మనమేం చేద్దాం?" అడిగింది డెల్లా.

"చేసేందుకేముంది. మెల్లగా దీవిలోకి వెళ్దాం. ఆ మనుషుల్ని చూద్దాం. మనకు మనదేశమెళ్ళేందుకేమైనా మార్గం దొరికేదాకా ఇక్కడ వుండాల్సిందేగా. వీలైనంతవరకు ఇక్కడివాళ్ళతో సర్దుకుపోవటం అవసరం" అన్నాను.

డెల్లా మరేం మాట్లాడలేదు.

ఇద్దరం లేచాం. మెల్లగా నడక సాగించాం. చాలా దూరం మా కళ్ళకు ఇసుకమేటలు కనిపించ సాగాయి. చెట్లు అసలు కనుపించనే లేదు. రెండు గంటలు నడిచాం ఆ ఇసుకలోనే. అప్పటికీ చెట్ల జాడగానీ, పక్షుల అలికిడిగానీ లేదు.

"ఇదేమైనా ఎడారి ప్రదేశమా?" అడిగింది డెల్లా.

"కావడానికి వీల్లేదు. మనం ఇంతకుముందు విడిదిచేసిన రెండు ద్వీపాలకు మధ్యలో వుండివుండాలి ఇది. అంటే అక్కడ వాతావరణమే ఇక్కడా వుంటుంది. కాకుంటే సముద్రతీరంలో కాస్త ఎక్కువ విశాలంగా ఇసుకమేటలు వేసివుంటుందనుకుంటాను" నా అభిప్రాయాన్ని చెప్పాను.

మా ఇద్దరికీ నోరెండిపోయింది. ఎక్కడా చుక్క నీళ్ళు లేవు. అందులో సముద్రపుటొడ్డున పడివుండడం వల్ల ఉప్పగాలికి నాలిక నాకు పిడచకట్టుకుని వుంది.

"దాహంగా వుంది!" అంది డెల్లా.

"నాకూనూ, ఇంకొంచెం దూరం నడిస్తేగానీ మనకేమీ కనుపించేట్లు లేదు" అన్నాను నడుస్తూనే.

మరో అరగంట నడిచాం. ఇసుక మేటలు పల్చబడ్డాయి. దూరంగా చిన్న చిన్న చెట్లు కనిపించాయి. వాట్ని చూడగానే నా మనస్సు ఆనందంతో నిండిపోయింది. డెల్లా కేసి చూశాను. ఆమె కళ్ళల్లో మెరుపు కనిపించింది.

ఆ చెట్లను దాటి కొంతదూరం వచ్చాం. అక్కడో చిన్న నీళ్ళగుంట కనుపించింది. తిన్నగా వెళ్ళి కడుపు నిండా త్రాగాం నీళ్ళు. నీళ్ళు మాత్రం మట్టి మట్టిగా వున్నాయి. నాకున్న దాహంలో ఆ నీళ్లెలావున్నదీ కూడా గమనించ లేదు. త్రాగాక మాత్రమే శుభ్రంగా లేవని తెలుసుకొన్నాను. డెల్లా కూడా నీళ్ళు త్రాగింది.

ఇద్దరం ఆ ప్రక్కనే ఒక చెట్టునీడన విశ్రాంతి తీసుకోనేందుకు కూర్చున్నాం.

"మనం ఈ జన్మలో మళ్ళా మన దేశాలకు చేరతామా రాజ్?" దిగులుగా అడిగింది డెల్లా.

ఆమె పైకి కనబరిచిన అనుమానం నాకు లోలోపల వుంది. మగవాడ్ని ఆమెముందు అధైర్యపడుతూ మాట్లాడటం అవమానంగా భావించాను. అందుకే ఆమెకు ధైర్యం చెప్పాను.

అక్కడో గంటసేపు కూర్చున్నాం. ఆ తర్వాత మెల్లగా లేచి మళ్ళీ నడక మొదలుపెట్టాం. మూడు మైళ్ళకు పైనే నడిచి వుంటాం. మాకు కుడివేపు చిన్న తోట కనుపించింది. అందులో చెట్లు వున్నాయి. వాటి కొమ్మలకు ఎర్రటిరంగు బత్తాయి కాయిల్లాంటి పండ్లు కనుపించాయి. డెల్లా తోటను చూసి "ఆకలిగా వుంది? అవి తిందామా?" అంది.

నాకూ ఆకలేస్తోంది. డెల్లాను అక్కడే వుండమని చెప్పి, నేను కంచెలో చిన్న త్రోవ చేసుకుని తోటలోకి దూరాను. చెట్టు మెల్లగా ఎక్కి, పండ్లు తెంపి క్రింద

పడేశాను. తర్వాత నేను చెట్టు మొదట్లో నుండి క్రిందకు ఒక్క దుముకుతో దిగాను. పండ్లేరుకో నేందుకు వంగాను.

"భౌ! భౌ" మంటూ నల్లటి కుక్కలు రెండు నావైపు వచ్చాయి.

తలెత్తి చూశాను. ఒక్కొక్కటి నాలుగు అడుగుల ఎత్తున వుంది. వాటి కళ్ళు తళతళ మెరుస్తున్నాయి. నేను లేచి నిలుచున్నాను. నాకు ఆడుగు దూరంలో ముందొకటి వెనుకొకటి నిలుచున్నాయి.

వాటితో కలబడి ప్రయోజనం లేదని అర్థమైంది నాకు. ఎలా తప్పించుకోవాలని ఆలోచించ సాగాను. అవిమాత్రం నన్ను కాలు కదలనీకుండా నిలబెట్టేశాయి.

వాటి అరుపులు విని నల్లగా పొట్టిగావున్న మనిషి నావైపు వచ్చాడు.

అతన్ని పరిశీలనగా చూశాను. నల్లమొద్దులా వున్నాడు. ఒంటిమీద బట్టలులేవు. జుట్టు మెలికలు తిరిగిపోయివుంది. దవడలు పెద్దవిగా వున్నాయి. లావుపాటి పెదాలు నల్లగా వున్నాయి. మనిషిమాత్రం కుక్కలకన్నా ఎత్తు వుండడని పించింది.

అతని చేతిలో పొడవుపాటి కర్రవుంది. దాని చివర్న శూలంలా బిగించిన కత్తి వుంది. ఎండలో దాని ఛాయలు మిలమిల మెరుస్తున్నాయి.

నావేపు చూసి ఏదో అడిగాడతను. అతని భాష నా కర్థంకాలేదు. కుక్కలు దూరంగా తప్పుకున్నాయి. అతని మాటలు కుక్కల అరుపుల్లాగే వున్నాయి.

నా భాష అతనికెటూ అర్థంగాదని తెలుసు కాబట్టి సైగలుచేసి చెప్పాను, ఆకలవుతూంటే పండ్లు కోసు కునేందుకు వచ్చామని.

—(సశేషం)

# సప్లిమెంట్ పోటీ

స, రి, గ, మ, ప అక్షరాలను తీసుకొని, మీకు నచ్చిన వరుస క్రమంలో, ఈ క్రింది గళ్ళలో పూరించండి. మీ జవాబులను ఒక పోస్టుకార్డుసైజు. తెల్లకాగితంపై వ్రాసి, దానితో 75 పైసల పోస్టలు స్టాంపులు జత పరచి, ఈ నెల 30 వ తేదీలోగా మాకు చేర్చాలి.



మా ఆఫీసులో సీలువేసిన జవాబుతో సరిపోలిన జవాబుకు ఒక ఏడాది పత్రిక లేదా సప్లిమెంట్ ఉచితంగా పంపుతాం. ఈ పోటీలో అందరూ పాల్గొనచ్చు.

ఒక్కొక్కరు 3 కూపన్లకు మించి పంపకూడదు. ప్రతి కూపనుకు 75 పైసల పోస్టలు స్టాంపులు పంపాలి. ఫలితాలు ఏప్రిల్ '75 నెల మాసపత్రికలో చూడండి.

# ముఖచిత్ర వ్యాఖ్యల పోటీ

ఈ నెల "సప్లిమెంట్" ముఖచిత్రాలు పరిశీలించండి. రెండింటికి సంబంధం వుండేటట్లుగా ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగాని, చక్కటి వ్యాఖ్యలు ఒక పోస్టుకార్డుసైజు తెల్లకాగితంపై వ్రాసి, ఈ నెల 10 వ తేదీ లోపల మాకు చేరేటట్లు పంపండి. ఒక్కొక్కరు ఎన్ని వ్యాఖ్యలైనా పంపవచ్చును.

మాకు వచ్చిన వ్యాఖ్యలలో అత్యుత్తమమైన వ్యాఖ్యకు రు. 20-/లు నగదు బహుమతి పంపుతాము.

దీనిలో "హోమ్ డెలివరీ" సభ్యులు మాత్రమే పాల్గొనాలి. సభ్యులుకానివారు తమ సభ్యత్వ రుసుము పంపుతూ వ్యాఖ్యలు పంపవచ్చును. ఫలితాలు వచ్చే నెల మాసపత్రికలో ప్రచురించబడతాయి.—ఎడిటర్.

జోకాపేజీ వినోదం

## 48

బార్‌లో ఒకడు బాగా త్రాగాడు. మత్తులో వళ్లు తెలియని స్థితిలో ఎదురుగా ఒక స్త్రీవచ్చి నిలబడింది. "స్వర్గానికి పోయినా సవతి పోరు తప్పదన్నట్లు యిక్కడికీ వచ్చావా భార్యామణీ?" అన్నాడు.

ఆమె చెళ్లున కొట్టి "నేను భార్యమణిని కాదు, రాజమణిని" అంది.

* * *

ఒక ఇన్‌స్పెక్టర్ అన్నాడు, "ఏమయ్యా, మీ అబ్బాయి ఐదు రోజుల క్రితం తప్పిపోయాడని రిపోర్టు యిచ్చావు. రాత్రినుంచి కనిపించ లేదంటా వేమిటి?"

"అవును సార్. ఐదు రోజులనుండి బెదిరిస్తున్నాడు. అందుకే అడ్వాన్సుగా రిపోర్టు యిచ్చాను."

* * *

ఆరు గంటలసేపు ధారాపాతంగా ఉపన్యసించిన దేశ నాయకుడు అందరూ నిద్రపోవటం చూసి, "ఏమిటిది?" అని సెక్రెటరీని అడిగాడు.

"అయ్యా కూలిచ్చి కూర్చోబెట్టాం గదా! ఓపిగ్గా కూర్చో లేరని అందరికీ నిద్ర మాత్రలు కేటాయించి నిద్రపుచ్చాం!"

—డాక్టరు పెందుర్తి మాస్టర్జీ, విజయవాడ-3

## 49

డిటెక్టివ్ ఆరోగ్యం వళ్లో చేరాడు వంశాంకురం.

"నాన్నా నువ్వు డిటెక్టివ్ ఎలా అయ్యావు?" అన్నాడు ముద్దుగా.

"ఏముందిరా? డిటెక్టివ్‌కి కావల్సిన ముఖ్య లక్షణాలు మూడు. ఎదుటి వ్యక్తి తియ్యబోయే దెబ్బలనుంచి తప్పించుకో గలగటం, సహనం, గుండెధైర్యం. మీ అమ్మను చేసుకున్నాక అవి సులభంగా పట్టుబడ్డాయి."

* * *

"అమ్మాయే పుడుతుంది. అచ్చం అమ్మలాగే ఉంటుంది" ఇల్లెగిరేలా పాడుతున్నాడు వంశాంకురం.

"నోరు ముయ్యరా. ఆవిడతోటే చస్తుంటే మళ్లీ అది కూడానా!" విసుగ్గా అన్నాడు ఆరోగ్యం.

* * *

డిటెక్టివ్ ఆరోగ్యం యింటికి వచ్చేసరికి ఏడుస్తూ కనిపించాడు వంశాంకురం.

"ఎందుకురా" అన్నాడు ప్రేమగా.

"అమ్మ కొట్టింది నాన్నా."

నిట్టూర్చాడు ఆరోగ్యం "నీకు కనీసం చెప్పుకునేందుకు నేనైనా ఉన్నానురా!"

* * *

ఒక లాయర్ మందమతి ముద్దాయికి మాటలు నేర్పుతున్నాడు. "నేనా హత్య కావాలని చెయ్యలేదని, ఆవేశంలో చేసానని, శిక్ష తగ్గించమని కోరాలి నువ్వు." తలూపాడు ముద్దాయి.

మర్నాడు—

జడ్జి:—నువ్వు చెప్పేదేమయినా ఉందా?

ముద్దాయి:—మా ప్లీడర్‌గారు ఆ హత్య చెయ్యాలని చెయ్యలేదు, ఆవేశంలో చేసారు. దయచేసి శిక్ష తగ్గించండి."

– ఎమ్. వి. సుబ్బలక్ష్మి, చిక్కడపల్లి.



